# భారతి

సాహిత్య మాసపత్రిక

మే 1982



వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

KLVA104M776

# భారతి

మాసపత్రిక


శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



మే 1982

పంపుటము: 59 సంచిక: 5


విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

1

# విషయానుక్రమణిక

## మే 1982





# కిటికీ జయంతి

## డా॥ సి. నారాయణరెడ్డి

ఇవాళ నా కిటికీ
ఇరవయ్యో పుట్టినరోజు.
అక్షరాల గవాక్షాల
అనుబంధం మాది.

కిటికీ తెరిస్తే ఆకాశం
తెగ మెరుస్తుంది నీలివజ్రంలా.
మూస్తే — ఊపిరి తెగిన గాలి
మూల్గుతుంది మూగ కంఠంలా.

ప్రభవించే నా రచనకు
ప్రసవం హక్కు కిటికీదే.
ప్రసవించిన ఆ శిశువుపై
ప్రచురణ హక్కు ఉభయులదే.

ఏదైనా ఏమైనా
గది చెరలో ఉన్ననాకు
విచ్చుకున్న కిటికీ
విశ్వాత్మకు పరిచయం చీటీ.



# కపట దేశభక్తులు

తమిళ మూలం :
మహాకవి సుబ్రహ్మణ్యా భారతి

తెలుగు :
శ్రీ చల్లా రాధాకృష్ణ శర్మ

గుండె దిటవూ సత్యదృష్టీ లేక
మాయ మాటలు పలికేరు — చిలకా
పట్టి వదరుబోతులే వారు.

గుంపుతో కలసి అరిచేరు గాని
మనసు కేమీ పట్టించుకోరు — చిలకా
మరిచిపోతారు వెనువెంటనే.

స్వరాజ్య సౌఖ్యం సమకూరేనా
గుడ్డివారి కెపుడైనా — చిలకా
కలిగేనా షండులకు సంతోషం ?

కళ్లు కలిగీ చూడలేవు
అబలలే వారు — చిలకా
మాటలాడీ లాభమేముంది ?

యంత్రశాల లంటారు మా గుడ్డలంటారు
మంత్రాల కెపుడైన — చిలకా
మామిడికాయలు రాలేనా ?

స్వదేశీ వస్త్రాలనీ ఉప్పనీ
కబుర్లు చెపుతూ తిరిగేరు — చిలకా
కార్యశూరులు మాత్రం కారు.

నారీ శీలమనీ దైవభక్తి అనీ
నాలుక వల్లెవేసేను — చిలకా
నమ్మకమేమో హుళక్కి.

మగువలకు మానభంగం జరిగితే
పట్టి దేబెల మాదిరి — చిలకా
తమ ప్రాణాలు దక్కించుకున్నారు.

అమ్మవారి గుళ్లో అక్రమాలు జరగగా
అనువులే గొప్పగా తలచి — చిలకా
అటు యిటూ పరుగులెత్తేరు.

భయమూ అడియరి మోహం
బాగా తలకెక్కినవారే — చిలకా
మూగ మనుషులే వారు.

దీక్షాభావం సత్య ప్రీతీలేని
మనుషులకొక గడియైనా — చిలకా
మనుటకు యోగ్యత కలదా ?

అభిమానంకన్న మనుగడే మిన్న
అనుకునే హీనులకు — చిలకా
ఆశ్రయమున్నది దొరికేనా ?

కల్లుమీద మనసుంచి శివశివా అన్నట్లు
వందేమాతర మనేరు — చిలకా
మనసులో అది తలవరు.

పాత పాత అని పలికేరుగాని
పాత వర్ధిలిన తీరు — చిలకా
పామరులు వారెరుగరు.

తోడబుట్టినవారు కడగండ్లపాలై
కనుమూసినాకూడ — చిలకా
కొంచెమైనా జాలి తలవరు.

కరువులూ జబ్బులూ వచ్చి తనవారు
అలమటించుటచూసి — చిలకా
ఉలకరూ మరి పలకరు.

కరువుకిలోనై తల్లి కటకటబడినా
నోరు తెరిచి ఊరికే — చిలకా
వందేమాతర మనేరు.



శ్రీ నిడుదవోలు వేంకటరావు

# ప్రాచీన సాహిత్యానికి సమాధి
# తెలుగు అకాడమీ సాహిత్య పదకోశం

అధ్యాపకులకు, అధ్యయనపరులకు ప్రయోజనకరంగా ఉంటాయనే ఉద్దేశంతో తెలుగు అకాడమి శాస్త్ర నిఘంటువుల ప్రచురణ పథకానికి రూపకల్పన చేసిందని, ఛందఃపద కోశం, సాహిత్య పదకోశం, వ్యాకరణ పదకోశం– అనే మూడు నిఘంటువులను ఇదివరకే ప్రచురించటం జరిగిందని, వాటికి పూరక గ్రంథమైన తెనుగు సాహిత్యకోశంలో మొదటి భాగంగా ప్రాచీన సాహిత్యాన్ని వెలువరిస్తున్నామని, నన్నయకుపూర్వయుగంనుంచి క్రీశ.1850వరకు ఉన్న సాహిత్యాన్ని ప్రాచీన సాహిత్యంగాను, క్రీ.శ.1850నుంచి 1950వరకు ఉన్న సాహిత్యాన్ని ఆధునిక సాహిత్యంగాను విభజించి ఈ కోశాన్ని వెలువరిస్తున్నామని తెలుగు అకాడమీ డైరక్టరు శ్రీ ఎన్. వెంకటస్వామిగారు "ప్రవేశిక"లో పేర్కొన్నారు.

పునః పరిశీలన యోగ్యాలయిన విషయాలేమైనా ఉంటే వాటిని గురించి మాకు తెలియజేస్తే పరిశీలించి పునర్ముద్రణలో చేర్చటానికి ప్రయత్నిస్తామని కూడా డైరక్టరుగారు విజ్ఞప్తి చేశారు.

అకాడమీ ప్రచురణలలో ఈ విధమైన మంగళాంత ప్రవేశిక కనిపిస్తూనే ఉంటుంది. ఈ సాహిత్యకోశ నిర్మాణంలోమాత్రం ఈ వాక్యాలు నిర్మర్యాదతో ధ్వనిస్తున్నాయి. "విషయాలేమైనా ఉంటే" "తెలియజేస్తే" "పరిశీలించి" "పునర్ముద్రణలో చేర్చటానికి ప్రయత్నిస్తాము" వంటి మాటలు ఈ సాహిత్యకోశం పట్టుబట్టి ప్రవేశిక దగ్గరనుంచి చివరి పుటవరకు పరిశీలిస్తే ప్రగల్భపూరితాలని, చెప్పక తప్పదు.

ఈ కోశనిర్మాణం అంతా తప్పుడు కొలతలతో ప్రారంభమయింది. వాడిందంతా కల్తీ సిమెంటు, మంచి సరుకు కోసం ఎవరూ మార్కెటుకి వెళ్ళినపాపాన పోలేదు, కాంట్రాక్టుకి ఇచ్చినట్లు లేదు. గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలతో ఇళ్లు లేని కొంతమందికి ధనసహాయం చేస్తే వాళ్ళే కట్టుకొంటారు. అట్లాగే ప్రభుత్వం డబ్బిస్తే అకాడమీ పండితులు దీనిని నిర్మించారు.

మూల గ్రంథాలను చూడక, ద్వితీయశ్రేణి రచనల నుంచి ప్రధానారోపాలు సంగ్రహించటం అకాడమీ చేసిన మొదటి తప్పు. ఎత్తిన ఆరోపాలను తిరిగి ఆ గ్రంథాలతో "చెక్" చెయ్యకపోవడం రెండో తప్పు. ఇచ్చిన ఆరోపాలకు క్రాస్ రిఫరెన్సులు సరిగా ఉన్నాయా లేవా అనే చిన్నం ఎత్తు అనుమానం లేకుండా అచ్చుకి వదలడం మూర్ఖమైన మూడో తప్పు. కనీసం ప్రవేశికనైనా డైరక్టరుగారికి అప్రదిష్ట రాకుండా కోశంలో ఉన్నాయని చెప్పిన ఆరోపాలు మరోసారి చదివి ఉన్నాయో లేదో చూడకపోవడంలో అవరోహణ క్రమంలోని అధికారులు చేసిన తప్పు అక్రమశిక్షణ చర్య (చూ.నిగమశర్మ). ఇట్లా ఎంచుతూపోతే 1281 పుటల బృహద్గ్రంథంలో అంకానాం వామతోగతః అనే సూత్రం వర్తింపజేస్తే ఎంతసంఖ్య వస్తుందో అన్ని తప్పులు ఉన్నాయి. ఇంకా కక్షకొద్దీ తీస్తే ఎన్ని వస్తాయో !

ఏవం గుణవిహీనమైన వికృతికి అనభ్యుదయ వరంపరాభివృద్ధిగా నానేర్చిన విధంబున వ్రాయబూనిన విమర్శకు అశుభప్రారంభం బెట్టిదనిన....

నన్నయ ఆరణ్యపర్వంలో 142 లేదా 144 పద్యాలు రాశాడని, రాజరాజనరేంద్రుడి తండ్రి విజయాదిత్యుడని ఆయా ఆరోపాల వద్ద చదివాను. కళ్ళజోడు తీసి కళ్ళు నులుపుకొన్నాను. కంటి అద్దాలు ఊది, తుడిచి తిరిగి పెట్టుకొని చూసినా అవే మాటలు. తొందర పడకూడదని తప్పొప్పుల పట్టిక చూశాను. అక్కడ సవరణ లేదు. తెలుగుజాతికి తొలి తెలుగు గ్రంథాన్ని అందించిన రాజరాజనరేంద్రుడు విమలాదిత్యునికి కాకుండా పినతండ్రి వి జ యా దిత్యునికి పుట్టినట్లు రాసిన తెలుగు అకాడమీ అధికారుల అవిజ్ఞతకే కాకుండా అసభ్యతకు కూడా వెండి కాగడాలు ఎత్తాలనిపించింది. ఆరణ్య పర్వంలో ఎన్ని ఆశ్వాసాలున్నాయో, ఎన్నో అశ్వాసంలో ఎన్నో పద్యం వరకు నన్నయ రచన కొనసాగిందో అకాడమీ అధికార్లకు తెలియదనీ చెప్పడానికి సిగ్గు వేస్తోంది. నన్నయ, రాజరాజ నరేంద్రుల గురించి అధ్యాపకులకు, అధ్యయనపరులకు అకాడమీవారు చెప్పేదే ఇది అయితే ఇక చాలు. ప్రాచీన సాహిత్యానికి ఫైర్ ఆఫీసర్ సర్టిఫికేటు అనవసరం.

ఓం ప్రథమంగా మొదటి పుటే తిరగ వెయ్యండి. "ప్రబంధరత్నావళికర్త పెదపాటి జగ్గన్నకు పూర్వుడు" అన్నారు. ప్రబంధరత్నావళి కర్త స్వర్గీయ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. జగ్గన్న 16వ శతాబ్దివాడు. శాస్త్రిగారు 16 వ శతాబ్దికి పూర్వులయితే వారిఅబ్బాయి డా॥ ఆనందమూర్తికి అకాడమీవారు మార్కండేయుడులా చిరంజీవి అని దీవించారు- తథాస్తు.

అదే పుట చివర "పెదపాటిజగ్గన్న వాటిని తన ప్రబంధ రత్నాకరంలో ఉదహరించా" డన్నారు. బాగుంది. రైటే. కాని మూడోపేజీ తిరగవేసి చూస్తే ఉన్నట్లుండి టక్కున "కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఈ పద్యాలను (అంబికా శతకం) ప్రబంధ రత్నమాలలో ప్రచురించా" రన్నారు. 11వ పుట వచ్చేసరికి జగ్గన్నది ప్రబంధ రత్నాకరమని, శాస్త్రిగారిది ప్రబంధ రత్నావళి అని ఒప్పుకున్నట్లుండి 87వ పుట చేరుకునే సరికల్లా తిరిగి పాతరోగం బయట పడింది. జగ్గన్న "ప్రబంధ రత్నావళి" కర్త అన్నారు. 221 వ పుటలో అంతే 329 వ పుటలోమళ్ళీ వేటూరి వారి ప్రబంధ రత్నమాల నిటారుగా నిల్చుంది. ఇవి వివేకభ్రష్ట సంపాతాలు.

మళ్ళీ మొదటి పుటకే వద్దాం- "అంగభవభంగ తిరు కాళహస్తి లింగ శతకము అలభ్యం" అన్నారు. ఈ శతకాన్నే మరోసారి 205 వ పుటలో "కాళహస్తి లింగశతకము అలభ్యము" అని ఇచ్చి తప్పొప్పుల పట్టికలో ఈ పుటలోని కాళహస్తి లింగ శతకం "అంగభవభంగ తిరు కాళహస్తి లింగ శతకము" ఒప్పుఅనిచెప్పారు.అపాటిదానికి ఈకాళహస్తి లింగ శతకం ఆరోపం ఎందుకు దానిని మెల్లగాఅంగభవభంగ తిరుకాళహస్తి లింగశతకమని ఒప్పుకోవడం ఎందుకు? అయ్యంగారేం జేస్తున్నారన్నట్లుంది. గుడికి బారెడు దూరంలోని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ శ్రీ కృష్ణదేవరాయల జాంబవతీ పరిణయ నాటకాన్ని నాగరి లిపిలో 1969లో అచ్చువేసింది. డా. బిరుదురాజు రామరాజు విశేష పరిశ్రమకోర్చి సంస్కరించారు దీనిని అలభ్యం అంటారు తెలుగు అకాడమీ పండితులు. ఆ పైగా దీనిని రాయలవారు ఆముక్త మాల్యదలో రాసినట్లు చెప్పుకొన్నాడట!- ఈ తె.అ. పండితులు మహా చూసినట్లు. "చెప్పుకొన్నాడు" అన్నారు. కాని ఆ పద్యం భగవద్వాక్యం. తాను చెప్పుకోవడం రాయప లోపంకాదా! తమ అకాడమీకి ఒకసారి గవర్నరుగా నియమితులైన రామరాజుగారికే సొడ్డు.

దశరథరాజ నందన చరిత్ర అచ్చుపడినా నేడు ప్రతులు లభ్యం కావటంలేదట. ఇదీ సాహిత్య అకాడమీ ప్రచురణే. 2వ ముద్రణంకూడా వచ్చింది. మహబూబ్ నగర్ జిల్లా పాలెంలో శ్రీ రంగచార్యాది విబుధ వర్గం పకపక నవ్వుతారు.

శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానం (అలభ్యం) అన్నారు. శంకరకవి ఆరోపం వద్ద. హరిశ్చంద్రోపాఖ్యానం ఎంట్రీ చూస్తే అక్కడకూడా అలభ్యమనే బ్రాకెట్లలో పెట్టారు కాని శంకర కవి తండ్రి దేచన అని, కవిత్వం మృదు మధురంగా ఉంటుందని "శంకర కవి"వద్ద రాశారు. హరిశ్చంద్రోపాఖ్యానం ఐదాశ్వాసాల ప్రబంధం అన్నారు. ఇంతకీ అలభ్యమో! లభ్యమో తె. అ. పండితులకే తెలియదు. ఇది కాని డాక్టరు వాసా ప్రభావతిగారు కాని చూశారా? ఏముంది ఏ సాయంకాలం సభలోనో 'చూశారా నేనింత కష్టపడి శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానం మీద

రీసెర్చిచేసి పట్టం పొందితే ఈ అకాడమీవారు తమ ప్రామాణిక గ్రంథం సాహిత్య కోశంలో అలభ్యం పొమ్మన్నారు". అని అనరనుకోండి. అంటే? "ఉరంతా ఏమనుకుంటారూ"

ద్విపదభాగవతం తరిగొండ వెంగమాంబది(అలభ్యం) అంటారు సాహిత్యకోశకర్తలు. తిరుమల ప్రాచ్య పరిశోధనా సంస్థలో డా. జె. కృష్ణమూర్తిగారు తరిగొండవెంగమాంబపై పరిశోధనచేసి పట్టం పుచ్చుకొన్నారు. ద్విపద భాగవతాన్ని సంస్కరించి ముద్రణకు సిద్ధపరిచారు. అంతకు ముందే "గృహలక్ష్మి"పత్రికలో కొంత భాగం అచ్చయింది. తిరపతిలో అందులో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఈ అలభ్య వార్త పొక్కితే పరపతి ఏమన్నా మిగులుతుంది.

శ్రీకరభాష్యం (సం) (అలభ్యం). అని ఒక్కసారి కాకుండా శ్రీపతి పండితుడు ఆరోపం వద్ద బల్లగుద్దినట్లు చెప్పారు. ఈ భాష్యాన్ని శ్రీ సి. హయవదన రావుగారు బృహదాంగ్ల పీఠికతో చిన్న తలగడ పరిమాణంలో 1936లో ప్రచురించారు. దాని పీఠికలోని అంశాలను కళాప్రపూర్ణ చిలుకూరినారాయణరావు గారుపండితారాధ్యచరిత్రలో దుమ్ము ఝట్టారు. ఇటీవల రెండు సంపుటాల్లో నాగరి లిపిలో శక్తి విశిష్టాద్వైత మైసూరు ఆస్థాన విద్వాంసులు శ్రీ ఎం. జి. నంజుడారాధ్య ప్రచురించారు. కర్ణాటకలో ఈ అలభ్యం విషయం తెలుస్తే తె. అ. పండితులు "తల్లీ! కన్నడ రాజ్యలక్ష్మి అభయం, అభయం" అనాలి.

తాళ్ళపాక పెద తిరుమలాచార్యులుభగవద్గీతా వచనం "అలభ్యం" అన్నారు. 1978లో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ అప్పటి తెలుగు శాఖాధ్యక్షులు, ఒకప్పుడు తెలుగు అకాడమీ గవర్నరయిన డా. జి. ఎన్. రెడ్డిగారు వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రాచ్య పరిశోధన పక్షాన ప్రకటించారు. ఆ రెడ్డిగారు అమెరికాలోని విస్కాన్‌సిన్ యూనివర్సిటీకి మరోసారి వెడితే అక్కడివారు అడిగితే ఏం చెప్పమంటారు. పశ్చిమార్థ గోళందాక తె. అ. అపకీర్తి హంస ఎగిరి వెళ్ళినట్లే కదా!

తాళ్ళపాక పెద తిరుమలాచార్యుడు శృంగార దండకం, శృంగార వృత్తశతకం, వైరాగ్య వచన గీతములు సుదర్శన రగడ, రేఫఱకార నిర్ణయము, మేలుకొలుపు ద్విపద, భగవద్గీతా వచనము, ఆంధ్ర వేదాంతము ఆంధ్ర హరివంశము కూడా వ్రాశాడట అని టకార ప్రయోగంతో తె. అ. పండితులు రాస్తే వారు విని రాసిందికాని కని రాసింది కాదని స్పష్టమవుతోంది కదా! శృంగార వృత్త శతకం శీర్షిక కింద అ. భ్యం అని రాసిన దానినిబట్టి చూస్తే ఈ "ట" 'నిజమైంది. తాళ్ళపాక కృతులపై సునిశితపరిశోధన కావించి డాక్టరేటు పట్టం పొంది, తమ సిద్ధాంత గ్రంథాన్ని రెండు సంపుటాల్లో ప్రచురించిన శ్రీ వేటూరి ఆనందమూర్తి గారు ముక్కుమీద వేలు వేసుకొంటే తప్పా! ఆయన కాని మళ్ళీ మారిషస్ దీవులు పెద్ద హోదాలో వెడితే అక్కడివారు తప్పిజారి అడిగితే ఏంకాను అకాడమీ ప్రతిష్ఠ? షడ్భాషా వివరణము (అలభ్యం) అని రాసి తప్పయితే ఆరుద్ర 10 సంపుటం చూసుకో అన్నట్లు తె. అ. పండితులు రాశారు. అడయారులోనే ఈ ప్రతి ఉందని ఆరుద్రకు తెలిస్తేగా. ఈ ప్రతి చూసి వచ్చిన హైదరాబాదులోని విద్వాంసులను అడిగి చూడండి.

"టేకుమళ్ళ రంగశాయి తాను జానకీ పరిణయ యక్షగానాన్ని వ్రాసినట్లు వీరరాఘవ శతకంలోను కృష్ణ దండకంలోను చెప్పుకొన్నాడు" అని జానకీ పరిణయం వద్ద రాశారు. వీర రాఘవ శతకం అలభ్యం అన్నారు. కృష్ణ దండకం వద అసలు వివరణే లేదు. ఇంతకీ అలభ్యమని చెప్పిన వీరరాఘవ శతకంలో జానకీ పరిణయం రచించాడని రంగశాయి వచ్చి తె. అ. పండితులకు చెప్పాడా టేకుమళ్ళ రంగశాయి ఆరోపం వద్ద పై మూడు అలభ్యాలు అన్నారు.

చూ. చూ.

చూ అంటే "చూడుడు" అని అర్థం.

అహల్యా సంక్రందనం చూ. పాపయారాధ్యులన్నారు. పాపయారాధ్యులు ఉంటేగా చూడటానికి. ఆర్యా శత శివస్తోత్రం వద్ద చూ. పాపయారాధ్యులు అని, ఇంద్రాత్మజాసంవాదం వద్ద, ఏక దశీవ్రత చంపువన్ల ఘూర్జర చరిత్రవద్ద- శంతను చరిత్ర, వేమనారాధ్యచరిత్ర ఈ చూలు పెట్టి ఇటూ అటూ పేజీలు తిప్పించారు.

అసలు చూ. ములుగు పాపయారాధ్యులు అనే ఆరోపం వద్ద పై గ్రంథాలన్నీ చేరాయి కాబట్టి చూ. ములుగు పాపయారాధ్యులు అని ఉండాలి. కవి నామాంతర సంగమేశ్వరశాస్త్రి అని ఉంది.

"వేమనారాధ్యుల సంగమేశ్వరాధ్యుడు" అనే ఆరోపం కింద "అహల్యా సంక్రందనం" రాశాడని ఉంది ఇంతకీ ఇందు మూలంగా తెలియజేయడమేమంటే వేమ నారాధ్యుల సంగమేశ్వరారాధ్యులన్నా, ములుగు పాపయారాధ్యులన్నా ఒకే వ్యక్తి. సంగమారాధ్యులని తాతగారిపేరు పాపయ పెట్టుకొన్నాడు. వేమనారాధ్యులు ఇంటిపేరు

5లవ పుటలో ఆంధ్ర ద్విరూపకోశం ఆరోపం కింద చూ. ద్విరూపకోశమని వుంది. ద్విరూపకోశం ఆరోపం చూస్తే అక్కడ "అలభ్యం" అన్నారు. అంతదూరం ఎందుకు చూడమన్నారో అర్థంకాలేదు.

అకాడమీవారు పంచాంగం దాచేస్తే నక్షత్రాలు కనబడవా. తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో ఎం. 350 నెంబరుగా ఈ గ్రంథం నమోదయింది. కేటలాగ్‌లో వర్ణితమైంది. ప్రతి సమగ్రమైంది. అదే విధంగా అభినవాంధ్ర నిఘంటువు (అలభ్యం) అన్నారు. వెంకటేశాంధ్రమే అభినవాంధ్ర నిఘంటువు. ఈ గ్రంథాన్ని వావిళ్ళవారు చక్కగా అచ్చువేశారు.

"వీరభద్ర విజృంభణమ్ (అలభ్యం) కర్త. చూ. విశ్వేశ్వర కవి చంద్రుడు" అన్నారు. ఆ కవి చంద్రుడూ కనబడలేదు.

## ఆధారగ్రంథాలకు అపహాస్యం

విష్ణు పురాణాన్ని కలిదిండి భావనారాయణ రాసినట్లు అది అముద్రితమని విష్ణుపురాణం ఆరోపం కింద ఇచ్చారు. దీనికి ఆధారం ఆరుద్ర 9 వ సంపుటం 234 పుట అన్నారు. ఆరుద్ర 234 వ పుటలోనే దీనిని మద్రాసు విశ్వవిద్యాలయం వారు అచ్చువేశారని తెల్పారు. ఏమంటారు?

"నంభూరి గుండనమంత్రి. కాలం 12 వ శతాబ్దం. కేయూర బాహుచరిత్ర ఇతనికే అంకితం. ఇతడు వెలనాటి చోడ ప్రభువులైన పృథ్వీశ్వరుని దగ్గర మంత్రిగా ఉండేవాడు" అని చెప్పి "ఆరుద్ర-2" చూడమన్నారు. ఏమిటి దీని కర్థం? పుట ఇవ్వనక్కరలేదా. సరే ఆరుద్ర 2సం. పుట 190 తిరగవేస్తే నండూరి గుండనమంత్రి యొక్క తాత కేతన గొప్ప మంత్రి. వెలనాటి చోడులలో ఆఖరివాడైన పృథ్వీశ్వరుని వద్ద క్రీ. శ 1182-1206 ప్రాంతాలలో మంత్రిగా ఉండేవాడని ఆరుద్రరాస్తే దానికి విరుద్ధం రాసి ఆయన్ను ఎందుకండీ అప్రదిష్టపాలు చేస్తారు?

తాళ్ళపాక పెద తిరుమలాచార్యుని జీవితం కవి తరంగిణి 6 చూడమన్నారు. 6 కాదు గదా 7 దాటి 8వ సంపుటం 151-162 పుటల మధ్యకాని ఆచార్యులవారు సాక్షాత్కరించరు. అందులో శృంగార వృత్త పద్యం అలభ్యం అ. శేషయ్యగారు రాయలేదు. అకాడమీ విద్వత్ సార్వభౌములకి మైనర్ వర్క్స్ అఫ్ తాళ్ళపాకమ్ పొయెట్స్ అనే గ్రంథం ఒకటి అందని, దానిని టి. టి. డి. వారు మన తెలివితేటలు తెల్లవారక మునుపే అచ్చువేశారని తెలియక ఈ గోల అకాడమీ వారు ఆ గ్రంథాన్ని చూసినట్లయితే నోట్లో వేలుపెట్టుకొని పళ్ళతో గట్టిగా నొక్కుకోవలసి ఉంటుంది.

"విష్ణుమాయా నాటకము చింతలపూడి ఎల్లనార్యుడు (రాధామాధవకవి) తారక బ్రహ్మరాజీయమనే పేరుతో రాశాడన్నారు. ఆరుద్ర 4 వ సంపుటం పూర్తిగా చదవమన్నారు. పుటసంఖ్య ఇస్తేగా! తీరా ఆరుద్ర 4వ సంపుటి తిరగవేసి (79-90పుటలు) చూద్దుంగదా, అక్కడ వి.మా.నా. తా. బ్ర. రా లు ఒకటే అని ఆరుద్ర రాయలేదు. ఎందుకండీ? అలతి పండితులు వలతి ప్రముఖుల పేరు బదనామీ చేస్తారు?

పుట 610 ప్రభులింగ లీలలు "దానిని పాల్కురికి సోమనాథుడు, పిడుపర్తి సోమనాథుడు ద్విపద కావ్యంగా వ్రాశారు" అన్నారు. ఆధారగ్రంథంగా కవి తరంగిణి 6 వ సంపుటం చూడమన్నారు. ఈ గ్రంథంలో పాల్కురికి సోమనాథుడు ప్రభులింగ చెప్పినట్లు లేదు. వాస్తవానికి సోమన రాయనూలేదు.

## రతి రహస్యం మనోహర కావ్యం

"గద్వాల" ఆరోపం కింద "పెదసోమ భూపాలుని మనుమడు చిన సోమభూపాలుడు స్వయంగా కవి. రతి రహస్యమనే మనోహర ప్రబంధం, అష్టపదులు వ్రాశాడని అన్నారు. చినసోమభూపాలుడు వద్దకు వచ్చేసరికి, "రతి రహస్యం" ఊసే లేదు. పెద సోమభూపాలుని ఆరోపం వద్ద రతి శాస్త్రమనే మూడాశ్వాసాల శృంగార ప్రబంధాన్ని పెద సోమభూపాలుడు రాశాడన్నారు. ఇది మరీ ఘోరం. ఏతత్ రతి శాస్త్ర రచయిత మొదట్లో చెప్పిన చి. సో. భూ. వాడని ఆ పండితుల నిర్ణయం. తరవాత రతిరహస్యమ్ సంస్కృత మూలగ్రంథం ఆరోపం వద్ద, తెలుగు అనువాదం రతి రహస్యము ఆరోపం వద్ద పెదసోమభూపాలుడే అనువాదకర్త అని స్పష్టంగా చెప్పారు. దీని రచన ప్రౌఢంగాఉంది అన్నారు. దీనికి ఏ ఆధారము చూపలేదు కాబట్టి అకాడమీ పండితులే ఈ గ్రంథాన్ని చదివి మనోహరమైన ప్రబంధమని, రచన ప్రౌఢంగా ఉంటుందని కనుగొన్నారు. రతి రహస్యం కళా శాస్త్రగ్రంథం మనోహరంగా ఉంటే ఉండొచ్చు కాని ప్రబంధం కాదు. ఈ శాస్త్రగ్రంథానువాదం ఒక చోట మనోహరంగాను మరో చోట ప్రౌఢంగాను ఉందని పరస్పర విరుద్ధాభిప్రాయాన్ని అకాడమీ పండితులే ప్రకటించగలరు.

మూల గ్రంథాల ముక్కూ మొహం తెలియని అకాడమీ పండితులకి రతిరహస్యం పెదసోమభూపాలుడే రచించాడనుకొంటారు. అసలు ఆ గ్రంథాన్ని చినసోమభూపాలుడు రాశాడు. అతనికి గద్వాలకేశవస్వామి కలలో కనబడి "సోమ నృపాలబాల! విను సోమనృపాలుడు నీ బాపితామహుండై మును నాకు భక్తుడయి యత్యధిక ప్రతిభాప్తి గాంచె" నని తాతగారినిమనమడుకి జ్ఞాపకంతెచ్చాడు. గద్యలో "పెదసోమ నృపాల పౌత్ర" అని చిన సోమభూపాలుడు చెప్పుకొన్నాడు ఈ గ్రంథాన్ని మద్రాసు కల్చరల్ బుక్స్ లిమిటెడ్ వారు ప్రచురించారు. ఏతావాతా చెప్పదలచుకొన్నది ఏమంటే రతి రహస్య గ్రంథాన్ని శీర్షిక చూసి మైమరచి రాశారనుకోవాలి.

## తబ్బిబ్బులు-పులిజాల-గురుజాల

618. పులిజాల సోమయ్య-"తెనాలి అన్నయ సుదక్షిణా పరిణయం, బమ్మెర కేసన మల్ల కవులు రచించిన దాక్షాయణీ పరిణయం ఇతనికే అంకితాలు". సుదక్షిణా పరిణయ కృతిభర్త పులిజాల సోమయ్య రైటే. కాని దాక్షాయణీ పరిణయ కృతిభర్త పులిజాల సోమయ్యకాదు. ప. గో. జిల్లా ఆచంట గ్రామవాసి గురుజాల మల్లన.

"రాధామాధవము-చింతలపూడి ఎల్లయ-అంకితం శ్రీ రామునకు." ఈ ఆరోపం వద్ద రాసిందంతా తప్పే. రాధా మాధవాన్ని శ్రీరామునికి కాదు కృతి ఇచ్చింది. మదన గోపాలస్వామికి. పైగా ఇది వేదాంత గ్రంథంకాదు. శృంగారప్రబంధం. ఈ వివరణ తారక బ్రహ్మ రాజీయానిది. రాధామాధవం ఆరోపం కింద ఇచ్చి చాపగొట్టారు.

హిందూ ధర్మ శాస్త్ర సంగ్రహము-కర్త పరవస్తు చిన్నయసూరి. ఇండియన్ పీనల్ కోడుకి ఇది తెలుగు అనువాదమట! స్ట్రేంజ్ హిందూ లా కి అనువాదం. అని చిన్నయ సూరే చెప్పారు.

అనియాది గణపతి దేవుడు ఆరోపం ఇచ్చి కవి 18 వ శతాబ్దం అన్నారు. ఇతడు శివయోగకర్త అని తెలిపారు. శివయోగసారం రెండు ఆరోపాలు ఇచ్చి మొదటి దాని కర్త అనియాది గణపతి దేవుడని, కాలం 17 వ శతాబ్ది అని చెప్పారు. రెండో శివయోగసారం ఆరోపం వద్ద కర్త కొలని గణపతి దేవుడని, కాలం 15 వ శతాబ్ది పూర్వార్థం కావచ్చు నన్నారు. ఇంతకీ శివయోగ సారం ఎవరు రాశారో తెలియడానికి ముందుగా సా. ప. కో పెర్కొన్నఆధారగ్రంథాలు చూస్తే ఒకటి కవి సప్తశతి. ముందుగా అందులోని ఆరోపం ఎత్తి అనియాది గణపతి దేవుడని రాసుకున్నారు. కవి తరంగిణి తరువాత చూసి కొలని గణపతి దేవుడని తిరిగి మరో ఆరోపం తయారు చేశారు. "అనియాది" తప్పని కవి తరంగిణి లోనే ఉంది. కందుకూరి వీరేశలింగం కవిచరిత్ర లోనిపొరబాట్లనుకవిసప్తశతియధామాతృకంగాగ్రహించింది. వాటిని చాలా వరకు కవి తరంగిణి సవరించింది. అనియాది ఆరోపం తప్పు. అక్కడ ఇచ్చిన కాలం తప్పే. ఇటువంటి అపకతవకలవల్ల పాపం పెరిగినట్లు పేజీలు పెరిగాయి.

"కాళహస్తి మాహాత్మ్యము. కర్త ధూర్జటి లింగరాజు కవి. పన్నెండు ఆశ్వాసాల గ్రంథం. కృష్ణదేవరాయల అష్ట దిగ్గజాలలో ఒకరైన ధూర్జటి మహాకవి రచనకన్న భిన్న మైంది. ధూర్జటి రచన స్కాందపురాణంలో షడధ్యాయికథ ఆధారంగా రూపొందింది. లింగరాజ కవి రచన ("శివ రహస్య ఖండము"; అనే పురాణంలో ఉత్తర భాగంలోని 120 వ అధ్యాయంలోని కథను ఆధారంగా తీసుకొని రచింప బడింది" అని అన్నాడు.

12 ఆశ్వాసాల గ్రంథం ఇప్పుడు లేదు. శివరహస్య ఖండం ఉత్తరభాగంలో 120 వ అధ్యాయంలోని కథ అని ఇక్కడ రాసి పెదకాళహస్తి మాహాత్మ్యము ఆరోపంకింద 126 అధ్యాయాల కథ దీనికి మూలం అన్నారు. ఏమిటి సంగతి? శ్రీ కాళహస్తి మాహాత్మ్యము అనే ఆరోపంకింద కృష్ణరాయల ధూర్జటి గ్రంథాన్ని గురించి చెబుతూ దీనికి మూలం 120 అధ్యాయాలతో ఉన్న శివరహస్య సంగ్రహం అని తార్మారు చేశారు. కృష్ణరాయల ధూర్జటి గ్రంథానికి ఏది మూలమో తెలియకుండా మసిపూసి మారేడుకాయి చేశారు. "గణపనా రాధ్యుడు క్రీ. శ. 14 వ శతాబ్దం. రచన స్వరశాస్త్రం కొంత లభ్యం" అన్నారు రైటే.

గౌరన ఆరోపం ఒకటి పెట్టి అతడుకూడా స్వరశాస్త్రం రచించాడన్నారు. తప్పు. ఈ గౌరన స్వరమంజరిని స్వర మంజరి ఎంట్రీవద్ద అలభ్యం అన్నారు స్వరశాస్త్రమంజరి ఆరోపంవద్ద నామాంతరం స్వరమంజరి అని చెబుతూ కర్త గణపనారాధ్యుడు అన్నారు. తిరిగి స్వరశాస్త్రము ఎంట్రీ. దానికికర్త గణపనారాధ్యుడని రచనాకాలం క్రీ. శ. 1323-45 నడుమ అన్నారు అంతటితో ఊరుకొన్నవారు ఊరుకోక మళ్ళీ గౌరనకవి కూడా రచించాడని పట్టుకు వేలాడారు.

ఇన్ని తబ్బిబ్బులు పడకపోతే నేలటూరి వేంకట రమణయ్యగారి వాఙ్మయవ్యాస మంజరిలో గణపనారాధ్యుడు వ్యాసం చూస్తే సరిపోయేది కదా! ఆయనే ఈ గ్రంథాన్ని పైకి లాగింది. అసలు విషయాలు స్పష్టంగా తెలుసుకోక ఆరోపాలు ఎక్కిస్తే పరిమాణం పెరిగి ప్రామాణికత తగ్గి పోయి గ్రంథం అంగడిలో తులాభారం తూగడానికి పనికి వస్తుంది. ఆంధ్ర మన్వర్థ దీపిక-వివరాలు తెలియవట.

ఇది ఆనంద గజపతి మహారాజులుంగారి ఆజ్ఞ చొప్పున తన్మహారాజ సంస్థానాస్థాన పండితవర్యులగు బ్రహ్మశ్రీ కామేశ్వర శాస్త్రులవారిచే తెలిగింపబడిన ఆంధ్ర మన్వర్థ దీపికాసహితంబుగా చెన్నపురి శారదాంబావిలాస ముద్రాక్షర శాలలో 893లో ముద్రితమైనట్లు సుప్రసిద్ధ విద్వాంసులు బులుసు వేంకటరమణయ్యగారు "గజపతిరాజులు-తెలుగు సాహిత్యపోషణము" అనే గ్రంథం 169 వపుటలో పేర్కొన్నారు.

1188 పుటలో సామినేని ముద్దు నరసింహనాయుడు రచనలు తెలియవన్నారు. హిత సూచిని వ్యాససంకలనం ఆయనదే కదా. గిడుగువారు గద్య చింతామణిలో ప్రొఫెసర్ కొత్తపల్లి వీరభద్రరావు తమ సిద్ధాంత గ్రంథంలో ప్రమే యాలు చూపెట్టారు.

1231 పుటలో సూరసానమ్మకథ ఆరోపంవద్ద "ఇది పాల్కురికి సోమనాథ విరచిత బసవపురాణంలోని గాథ" అన్నారు.

కోలా శేషాచలపతి ఆరోపంవద్ద గోడే జగ్గారావు ప్రసక్తి లేదు. ఇతడు నీలగిరి యాత్ర కృతి భర్త. గోడే జగ్గారావు వద్ద కోలా శేషాచలకవి ప్రసక్తిలేదు. గోడే జగ్గా రావు ఖగోళ శాస్త్రంలో ప్రపంచ విఖ్యాతి గన్నవాడు. విశాఖపట్నం నక్షత్ర శోధనశాలను మొట్టమొదట నెల కొల్పాడు

"అనర్ఘ రాఘవమ్ (సం) కర్త-చెరుకూరి లక్ష్మీ ధరుడు ఇది సంస్కృత అనర్ఘ రాఘవానికి సంస్కృత వ్యాఖ్యానం."

లక్ష్మీధరుడు చేసిన వ్యాఖ్యపేరు ఇష్టార్థ కల్పవల్లి. మురారి అనర్ఘ రాఘవకర్త.

"అన్నమాచార్య చరిత- కర్త

తాళ్ళపాక చిన్నన్న ద్విపద కావ్యం చరిత్ర ప్రాముఖ్యం ఉన్న రచన" అని వదిలేశారు. తాళ్ళపాక చిన్నన్న ఆరోపం చదివితే ఈ అన్నమా

చార్య చరిత్ర విశేషాలే లేవు. తాళ్ళపాక అన్నమాచార్యుని గురించి చెప్పిందానిలోకూడా అన్నమాచార్య విశిష్టతను గూర్చి ఒక్కమాట విదల్పలేదు.

తాళ్ళపాక అన్నమాచార్యునివంటి లోకోత్తరపురుషుని జీవిత చరిత్ర-అన్నమాచార్యచరిత్ర. అటువంటి గ్రంథం గురించి చరిత్ర ప్రాముఖ్యం ఉన్న రచన అని దాటెస్తే ఈ కోశం ఎవరి తలమీద పెట్టుకొని ఊరేగాలి?

1?28 సౌందర్యలహరీ వ్యాఖ్య (సం) "లొల్ల లక్ష్మీధరుడు. ఇది సరస్వతీ విలసనామ ధర్మశాస్త్ర గ్రంథానికి విపుల వ్యాఖ్య." ధర్మశాస్త్ర గ్రంథానికి సౌందర్యలహరికి సంబంధం లేదు. లక్ష్మీధరుని సౌందర్యలహరి వ్యాఖ్యను నెల్లూరులో చదలవాడ జయరామ శాస్త్రిగారు తెలుగులిపి అర్థ తాత్పర్యాలతో అచ్చువేశారు. సరస్వతీ విలాసమనే ధర్మశాస్త్ర గ్రంథాన్ని లక్ష్మీధరుడు వ్రాసి ప్రతాపరుద్ర గజపతి పేర ప్రతిష్ఠ చేశారు.

"విష్ణుభక్త చరిత్ర- ఇందులోఆళ్వార్లు మొదలయిన విష్ణు భక్తుల చరిత్రలు వర్ణితాలని పండితులు అన్నారు" ఇందులో ఆళ్వారుల చరిత్రలేదు ఆచార్యుడైన రామానుజాచార్యుని చరిత్ర ఉంది. గ్రంథం పమ్మిత్యాగరాయచెట్టి 1901 లో అచ్చువేశారు.

ఊవని పెద్దిరాజు రామరాజు ఆరోపంవద్ద అప్పకవి నామాఖండపళులకోసం ఎవడో తలమాసిన వాడిపేరు పెట్టి రెండు కింద పద్యాలు కట్టాడు. సీతమ్మ శబ్దంలో అమ్మ అనే అచ్చుకి, "తమ్మ" పై హల్లుకి ఈ కింది పద్యపాదాలు చూపెట్టాడు.

సీ,తమ్మామాయమ్మ నిత్యహర్షము లిమ్మా (అచ్చుకి)
సీ,తమ్మా సౌభాగ్యసిద్ధి దాయినివమ్మా (హల్లుకి)

ఊది పలకడానికి పై విధంగా చెప్పి ఊదబడక ఉన్నందుకు "సీతమ"అని అనంతుని ఛందంనుండి ప్రయోగం ఇచ్చాడు.

పెద్దిరాజు రామరాజు రెండు పద్యాలూ ఒక శతకం లోని వేమో అని అనుమానంగా ఉందట. అట్లాగయితే తెలుగులో సీతమ్మ మీద. మొదటి శతకంఅవుతుందని సంబర పడుతున్నారు. ఇవి రెండూ ఒక శతకంలోనివి కావని వాటి మొహాలే చెబుతున్నాయి. "విశ్వదాభిరామ వినురవేమ" లా పాదమకుటం అనుకుంటే "తమ్మా మాయమ్మ నిత్యహర్షము లిమ్మా!" అని తమ్మా సౌభాగ్య సిద్ధి దాయిని వమ్మా అని రెండు వికృత పదాలు. పోనీ చివరి రెండు శబ్దాలు "వేమ"లా స్వీకరిద్దామా అనుకొంటే ఇమ్మా! అమ్మా! భిన్న మకుటాలు కనబడతాయి. ఈ అవలక్షణాలతో "సీతమ్మ"పేరు చెప్పి ఏ కవి రాక్షసుడు శతకం రాయడు.

"గంటివారు - ఈ "గంటి" శబ్దం ఇంటి పేరులో భాగంగా ఉన్న కుటుంబాల వారున్నారు. వారు గంటి వారు, మాగంటివారు, చాగంటి వారు, కావుగంటివారు' పానుగంటివారు మొదలయిన వారు" అన్నారు. మాగల్లు అనే ఊరినుండి వచ్చిన వారు మాగంటివారు. కల్లు ఔప విభక్తికం "కంటి" అదే విధంగా తక్కిన వారింటి పేర్లు సాధించాలి. "గంటి"వారు ద్రావిడులు. వారు తూర్పు చాళుక్యుల కాలంలో దక్షిణాదినుండి ఇక్కడికి వచ్చారు. పప్పు,చేబియ్యం, కర్రా, పచ్చిపులుసు, నేయి, మొదలయినపేర్లలాగే గంటె"ను కూడా ఈ జాబితాలో చేర్చుకోవాలి.

ఊరదేచ మంత్రి దేవీస్తుతి వ్యాఖ్య రాసినట్లు కవితరంగిణి కారులు భ్రమ పడ్డారు. "భవానీ శస్త్రవోచ్చారణ ప్రావీణ్య క్షమభావ అని అనే ఉద్భటారాధ్య చరిత్ర ప్రథమాశ్వాసం అంతంలోను, శంభుస్తుతి పఠనధురీణ" అని అదే గ్రంథం మూడో ఆశ్వాసం మొదటి పద్యంలోను తెనాలి రామ లింగం తనకృతిమతిని సంబోధించాడు. అవి శివపంచస్తవాలు కాని దేవీస్తుతి కాదు. ఊరదేచమంత్రి శివపంచస్తవాలకు సంస్కృతంలో రాసిన వ్యాఖ్య మద్రాసు ప్రభుత్వ

హస్తలిఖిత పుస్తకశాల లైబ్రరీ బులెటిన్ సంపుటం 3లో (1952) లో అచ్చయింది. ఊరదేచమంత్రి పఠించింది శివ పంచస్తవాలని, అవి దేవీ పంచస్తవాలు కావని, శివ పంచస్తవాలకు ఆయన రాసిన వ్యాఖ్య ముద్రితమై లభ్యమవుతోందని పండితార్థం.

ఈ సమీక్షా వ్యాసంలోసాహిత్యకోశంముందు పెట్టుకొన్నప్పుడు పుటలు గాలికి ఎగిరితే కనబడిన లోపాలే చెప్పటం జరిగింది.ఇంకఎన్ని ఉన్నాయోఆఇంద్రుడికేతెలియాలి. ప్రాచీన సాహిత్యాధ్యయనం ఎన్నడో చచ్చింది. కాని పూర్వకవుల రచనలు యూనివర్సిటీ డిగ్రీల కోసం, వర్ధంతి జయంతి ఉత్సవాల కోసం, ఇతర లాభాల కోసం కొన ఊపిరితో మూలుగుతూ బతుకు తున్నాయి. ఏ మహనీయుల గ్రంథాలు చదివి డిగ్రీలు సంపాదించుకొని నాలుగు రాళ్ళు ఈనాడు తెచ్చుకోగలుగు తున్నామో, ఆ ధర్మాత్ములకు కృతఘ్నతా సూచకంగా నిర్మించిన సమాధి ఈ సాహిత్య పదకోశం.

[తెలుగు సాహిత్యకోశము–ప్రాచీనసాహిత్యము. ప్రచురణ: తెలుగు అకాడమీ, హైదరాబాద్ (1980) 1281 పుటలు వెల రు. 47.75.]



శ్రీ ఎ. రవీందర్

# ఆంధ్రప్రదేశ్‌లో జాతీయ వయోజన విద్యా కార్యక్రమము - సమీక్ష

నిరక్షరాస్యత, పేదరికం, అజ్ఞానం వ్యక్తి వికాసానికే గాక సమాజాభివృద్ధికి కూడా గొడ్డలి పెట్టుగా ఉండి దేశ పురోభివృద్ధికి నిరోధంగా ఉన్నది. ప్రజల్లో జాగృతిని కలిగించి వ్యక్తి తన పరిసరాలను గుర్తించే స్థాయికి పెంపొందించేవరకు ఎన్ని ప్రణాళికలద్వారా అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టినా అవి సఫలీకృతం కానేరావు. ఈ నిరక్షరాస్యులలో గ్రామీణ స్త్రీలు, హరిజనులు, గిరిజనులు "చాలాఎక్కువ" "సాక్షరత" ప్రచారానికై ముఖ్యముగా వయోజన విద్యా ప్రచారము క్రింద పథకములు నిర్మించబడినప్పటికి వయోజన విద్యా కార్యక్రమము చెప్పుకోతగినంతగా అభివృద్ధి చెందలేదు. మూడవ పంచవర్ష ప్రణాళిక అంతర కాలములో ఈ కార్యక్రమ నిర్వహణకు తగిన రాజకీయ ప్రోత్సాహము, ప్రజలలో తగిన ఉత్సాహము లభించలేదు, 1981 జనాభా లెక్కల అంచనా ప్రకారము 15–35 సం॥ వయస్సు కలిగిన యువ జనత ఈ కనీస సౌకర్యము క్రింద అభివృద్ధి కార్యక్రమాలల్లో చురుకుగా పాల్గొనలేక పోవుచున్నారు.

భారత ప్రభుత్వము మొట్టమొదటిసారిగా 6.06 కోట్ల రూపాయలతో బృహత్తర పథకమును (జాతీయ వయోజనా విద్యా కార్యక్రమము) ప్రవేశపెట్టి 15 నుంచి 35 సం॥ వయస్సు కలిగిన 10 కోట్ల యువతీ యువకులను 5 సం॥ కాలములో 6 వ పంచవర్ష ప్రణాళికాంతము లోగా విద్యావంతులుగా చేసి, వారిని చైతన్యవంతులుగా తీర్చి దిద్దడమే గాక వారి వృత్తులలో ప్రావీణ్యతను పెంపొందించడం ప్రణాళికా లక్ష్యంగా పెట్టుకొన్నది. వయోజన విద్యద్వారా "సాంస్కృతిక విప్లవం" కలిగే అవకాశము కలదని మూడవ ప్రపంచ దేశాలు మరియు లాటిన్ అమెరికా దేశాల్లో అమలు పరచిన వయోజన విద్యా కార్యక్రమములు ఋజువుచేశాయి. దీనిని ప్రపంచంలోని కొత్తపంథాగా విద్యావేత్తలు అభిప్రాయ పడినారు.

పథకం ప్రకారము కార్యక్రమము 1978 అక్టోబర్ 2 వ తేదీ గాంధీ జయంతి నాడు లాంఛన ప్రాయంగా ప్రారంభించబడింది. అక్షరాస్యతలో జాతీయ స్థాయిలోనే గాక దక్షిణాది రాష్ట్రాలలో కూడా ఆంధ్రప్రదేశ్ వెనుకబడి ఉంది. పొరుగు రాష్ట్రాలలో మాదిరిగా కాకుండా కార్యక్రమం ఎక్కువ భాగము ప్రభుత్వ ఆధ్వర్యమున నిర్వహింపబడుచున్నది. రాష్ట్రస్థాయి నుండి ప్రాజెక్టుస్థాయి వరకు వయోజన విద్యా మండలులు ఈ కార్యక్రమ నిర్వహణలో తోడ్పడుటకుగాను పథకములో నిర్దేశించబడినది. ప్రతి జిల్లాలో ఒక ప్రాజెక్టు (300 వయోజన విద్యా కేంద్రాలు) చొప్పున గిరిజనులు ఎక్కువగా ఉన్న విశాఖ జిల్లాలో అదనంగా మరో ప్రాజెక్టు చొప్పున మొత్తం 23 ప్రాజెక్టులు రాష్ట్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో నిర్వహించ బడుచున్నది. ప్రారంభ దశలో కార్యక్రమము నిర్వహించుటకు ప్రత్యేక శాఖ లేకపోవడం వలన అధికారులు (సంచాలకుల) ఎంపిక జరగడం మరియు జిల్లాలో వయోజన విద్యామండలి రూపొందించడంలో ఆలస్యము జరుగడము, వయోజన విద్యలో ప్రత్యేక శిక్షణ పొందినవారు ఆనాటికి లేకపోవడం ఇత్యాది కారణాల వలన రాష్ట్రంలో 1979 డిశంబర్‌నుండి ఈ ప్రాజెక్టులు పనిచేయడం ప్రారంభించినవి.

ఆరవ పంచవర్ష ప్రణాళికలో రాష్ట్ర ప్రభుత్వ నిధుల నుండి 3 కోట్ల రూపాయలు వయోజన విద్యాకార్యక్రమాన్ని కేటాయించడం జరిగినది. 1980-81 కేంద్ర ప్రభుత్వ నిధుల నుండి కార్యక్రమానికి 80. 6 లక్షలు (18 ప్రాజెక్టులు) రాష్ట్ర ప్రభుత్వము 30 లక్షలతో (5 ప్రాజెక్టులు) మొత్తము 23 ప్రాజెక్టులు నిర్వహించబడినవి. రాష్ట్ర వ్యాప్తంగా 3, 878 పురుషుల కేంద్రాలు, 2,392 స్త్రీల కేంద్రాలు, 547 సమిష్టి కేంద్రాలు మొత్తం 6,817 వయోజన విద్యా కేంద్రాలను ప్రారంభించడం జరిగింది ప్రారంభ దశలో ఈ కేంద్రాలలో 1. 97, 3 0 యువతీ యువకులు ప్రవేశం పొందినారు. యుద్ధ ప్రాతిపదికపై నిర్వహించవలసిన ఈ కార్యక్రమాలు కేవలము ప్రభుత్వమే కాకుండా స్వచ్ఛంద సేవా సంస్థలు, ప్రజాసహిత సంస్థలు పాల్గొనినప్పుడే ఇది ఒక ప్రజా ఉద్యమంగా కొనసాగే అవకాశము కలదని సర్వత్ర అంగీకరించబడింది. వీటిఅన్నింటికన్నా ముఖ్యంగా ప్రభుత్వము యొక్క సంకల్పం కార్యక్రమానికి ప్రాణం అని గుర్తించబడింది.

కార్యక్రమము మొదటిదశ పూర్తి అయి రెండోదశలో అడుగిడుచున్నప్పుడు రాష్ట్రంలో గత సం॥ము జరిగిన కార్యక్రమము పరిశీలన చేయుడం వలన భవిష్యత్ కార్యక్రమానికి తోడ్పడే అవకాశము కలదని రాష్ట్ర వ్యాప్తంగా కార్యక్రమము ఎలా నిర్వహించబడుచున్నది తెలుసుకొని తద్వారా కార్యక్రమము అమలుకు తగిన మార్పులు, చేర్పులు చేసే అవకాశం కలుగుతుందని ఈ సర్వే నిర్వహించడం జరుగుతుంది. ఒక ఆశ్చర్యకరమైన విషయం ఏమనగా జాతీయ స్థాయి నిర్వహించిన సర్వేలో కేవలం 2 మాసములలోనే దేశములోని వివిధ రాష్ట్రాధికారుల మరియు విశ్వ విద్యాలయములనుండి సమాచారము సేకరించ కలిగినాము కాని రాష్ట్ర స్థాయిలో నిర్వహించిన ఈ సర్వేలో జిల్లా అధికారి నుండి ప్రాజెక్టు అధికారి వరకు 4 పర్యాయములు విన్నవించినప్పటికి 2 నెలలుపైబడినప్పటికి కేవలం 22 జిల్లాల్లో 12 జిల్లాలు 50 శాతం వారు మాత్రమే బాధ్యతను గుర్తించి సమాచారాన్ని ఇవ్వగలిగినారు. అభివృద్ధి కార్యక్రమాల్లో ముఖ్యంగా వయోజన విద్యా కార్యక్రమంలో అధికారుల మే నిర్లక్ష్య వైఖరి ఎంతో శోచనీయమైన విషయం. ఇలాంటి కార్యక్రమం సఫలీకృతం కావలెనని అధికారుల శ్రద్ధ, పట్టుదల, ఆసక్తి ఎంతో అవసరం. ప్రభుత్వము కోట్లాది రూపాయలు వ్యయముచేసి బడుగు వర్గాల అభ్యున్నతికై నిర్వహించే ఈ కార్యక్రమము ఇలాంటి వైఖరి కలిగిన అధికారులు ఉన్న కార్యక్రమము అనుకున్న లక్ష్యము సాధించలేక పోవచ్చును.

కార్యక్రమము మొదటి దశపూర్తి అయి రెండో దశలో అడుగిడుచున్నప్పటికిని ఇంకను వరంగల్ జిల్లాలో వయోజన విద్యామండలి ఏర్పాటు జరుగలేదు. జాతీయ వయోజన విద్యాకార్యక్రమం నిబంధనల ప్రకారము జిల్లా మండలులే యావత్ కార్యక్రమానికి సారధ్యం వహించవలసియున్నది. కానిఅలాంటిదిలేకుండానే 8శాతం ప్రాజెక్టులు మొదటి దశ పూర్తి చేసి కార్యక్రమను రెండో దశలో ప్రారంభించినారు. ఈ లాంటి చర్యవలన జాతీయ విద్యా కార్యక్రమము కొద్దిమంది అధికారుల బాధ్యత తప్ప ప్రజలకు బాధ్యత వహించే మండలులతో సంబంధం లేకుండా పోవుచున్నది. పైగా కార్యక్రమానికి అంకితమైనస్వచ్ఛంద సేవా సంస్థలు యధాశక్తిగా తోడ్పడే అవకాశము లేకుండా పోయినది. మరియు ఈ సందర్భములలో ఒక ప్రాజెక్టు అధికారి ఇచ్చిన సమాధానము బాధ్యతా రహితంగా యున్నది. వారు జిల్లా మండలి గురించి జిల్లా అధికారులను అడుగవలసినదని సలహా ఇచ్చినారు. ఈ మండలులు పని చేస్తున్న జిల్లాలు సక్రమంగా పని చేస్తున్నట్లు వెల్లడి అయింది. నియమానుసారంగా మండలులు కనీసము 2 సార్లు సమావేశము కావలసి యుండగా 5 జిల్లాలల్లో 3 సార్లు సమావేశాలు జరిగినట్లు తెలిపారు. ముదావహమైన విషయం ఏమనగా మహబూబ్‌నగర్ జిల్లాలో తప్ప మిగతా జిల్లాలన్నిటిలో ప్రాజెక్టు కమిటీలు ఏర్పాటు చేయబడినవి. పథకం ప్రకారము ప్రాజెక్టుయే కీలకమైనటువంటి ఈ కార్యక్రమం రెండో దశలో అడుగిడు చున్నప్పటికి ప్రాజెక్టు కమిటీ లేకుండానే కార్యక్రమం నిర్వహించడం విచారకరమైన విషయం. 12 జిల్లాలలో కేవలం 3 ప్రాజెక్టు మండలులలోనే స్వచ్ఛంద సేవా సంస్థలు ప్రాతినిధ్యము వహించి

నట్లు విదితమైంది. దీనికి కారణం ఆయా జిల్లాల్లో స్వచ్ఛంద సేవా సంస్థలు లేక పోవడం లేదా వున్నటువంటి వాటిని అధికారులు అధికార ధోరణిలో గుర్తించి వుండకపోవచ్చును.

స్వచ్ఛంద సేవా సంస్థలు 5 జిల్లాల్లో పని చేస్తున్నట్లు తెలిసినది 2 జిల్లాల్లో స్వచ్ఛంద సేవా సంస్థలున్నప్పటికి వాటిని విస్మరించడం జరిగినది. రాష్ట్రంలో పనిచేస్తున్న 30 శాతం పైగా స్వచ్ఛంద సేవా సంస్థలను విస్మరించడం జరిగినది.

బ్రహ్మాండమైన జాతీయ వయోజన విద్యా కార్యక్రమము మొదటి దశ పూర్తి అయినది. ప్రారంభములో 6, 817 వయోజన విద్యా కేంద్రాల్లో 1, 97, 310 యువతీ యువకులు ప్రవేశము పొందినారు. మొదటి కోర్సు యొక్క 10 నెలల కాలములోనే కేంద్రముల సంఖ్య 6, 388 గా మిగిలి పోయినవి అంటే 429 కేంద్రాలు మధ్యలోనే మూసివేసి నట్లు తేలింది. ఇది ఆందోళన కరమైన పరిణామం. ఇది కూడా అధికారులు ఇచ్చిన అంకెల ఆధారంగా మాత్రమేనని గుర్తించవలెను. మొదటి కోర్సు అంతములో 1, 13, 866 దీని వలన 83, 444 వయోజనులు మధ్యలోనే నిష్క్రమించి నారని విదితమైనది. యువతీ యువకులు మాత్రము 10 నెలల కోర్సు పూర్తి చేసినారు. ప్రణాళిక ఆశించిన సంఖ్యలో 90 శాతం వయోజన విద్యాకేంద్రాలు మాత్రమే నిర్వహించ బడినవి. మరియు పథకములో సూచించినట్లు 50 శాతం కేంద్రాలు (ప్రతి జిల్లాకు 150 మహిళలకు) నిర్దేశించబడి యుండగా సగటు 60 కేంద్రాలు మాత్రము నిర్వహించ బడటము విదితమైంది. ఇది ఉండవలసిన సంఖ్య కంటే మూడవ వంతు తక్కువగా యుండటము చాలాఆందోళన కర మైన విషయం. దీనికి కారణం కొన్ని ప్రాంతాల్లో మహిళా సంచాలకులు కొరత ఉండటము మరియు సామాజిక ఇత్యాది కారణాల వలన కొన్ని ప్రాంతాల్లో స్త్రీలు ఈ కార్యక్రమంలో చొరవ తీసికొని ముందుకు రాకపోవడం అయి ఉండ వచ్చును. కాని ప్రభుత్వ స్త్రీలలో నిరక్షరాస్యత నిర్మూలనకు ప్రత్యేక శ్రద్ధ వహించి ప్రత్యమ్నాయాలను గురించి ఆలో చించవలసిన అవశ్యకత ఎంతో యున్నది.

ఆరవ పంచవర్ష ప్రణాళిక అంతంలోగా ఆంధ్ర ప్రదేశ్‌లో 11.25 లక్షల యువతీ యువకులను విద్యావంతులుగా చేయ టం లక్ష్యంగా పెట్టుకొని పథకాన్ని తయారుచేసినారు ఎన్ఎఇపి ఆశయము ప్రకారము జిల్లాలో కార్యక్రమము నిర్వ హించే సంచాలకులు 50 శాతం మహిళలు వుండవలసి యుండగా 13 జిల్లాల్లో కేవలం ఖమ్మం జిల్లాలో తప్ప మరెక్కడను లక్ష్యము నెరవేరలేదని తెలిసినది. దీనికి చాలా వరకు వర్తమాన ఆర్థిక సామాజిక పరిస్థితులు కారణమై యుండవచ్చును. మెదక్, వరంగల్, ఒంగోలు జిల్లాలలో మొదటి దశలో 300 కేంద్రాలు ప్రారంభించటం కొంత ఆశా జనకంగా కనబడుచున్నది. మరియు 12 జిల్లాల్లో కేవలం 5 జిల్లాలు రెండవ దశలోకూడా 300 కేంద్రాలను ప్రారం భించటం జరిగింది.

దేశవ్యాప్తంగా వయోజన విద్యా కార్యక్రమము చేపట్టడం ఇదే మొదటిసారి. విశాలమైన ఈ దేశంలో 120 పైబడి యున్న విశ్వవిద్యాలయాల్లో కేవలం ఆంధ్ర ప్రదేశ్‌లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తమిళనాడులో మద్రాస్ విశ్వ విద్యాలయము మాత్రమే మాస్టర్ డిగ్రీ స్థాయిలో వయోజన విద్యా శిక్షణ ప్రవేశపెట్టి నిర్వహిస్తు న్నాయి. తక్కినవి కొన్ని స్వల్పకాలిక శిక్షణలను ఏదో ఒక రకమైన కార్యక్రమాల్ని నిర్వహిస్తున్నాయి. వీటన్నిటికి మిన్నగా వయోజనవిద్యలో డిగ్రీ శిక్షణాపున్నా లేకపోయినా ఆనాటిస్వతంత్ర పోరాటములో నిర్మాణాత్మక కార్యక్రమంగా భావించి ఉద్యమానికి అంకితమైన వారు అక్కడక్కడ మిగిలి యున్నారు. వీరు గాక స్వచ్ఛంద సేవా సంస్థలు నెలకొల్పి జాతీయ సేవా భావంతో ఇంతకు ముందే ఈ రంగంలో కృషి చేస్తున్న వ్యక్తులు కూడా కొన్ని జిల్లాల్లో యున్నారు. కార్యక్రమానికి అంకితమై ఈ రంగంలో అను భవము సంపాదించిన వ్యక్తులు ప్రస్తుత విద్యా కార్యక్రమా నికి ఎంతో తోడ్పడగలదు. పై వర్గాలకు చెందిన సుశిక్షితులు, అనుభవజ్ఞులు ఎక్కడ ఉన్నా అక్కడ వారి సేవలను ప్రభుత్వం ఉపయోగించుకోవడం వివేకవంతమైన చర్యగా అనిపించుకుంటుంది. ప్రస్తుత సర్వేలో కేవలము 4 జిల్లా

ల్లో మాత్రమే సదవకాశము కలిగినట్లు వెల్లడి అయింది. ఇది ఎంత మాత్రము ప్రోత్సాహకరమైన విషయం కాదు కావున ప్రభుత్వము ఇప్పటికైనను సుశిక్షితులు, అనుభవజ్ఞులైన వారిని లోగొంటు స్వచ్ఛంద సేవాసంస్థల విశ్వాసాన్ని చూరగొన్నప్పుడే ఈ కార్యక్రమము ఒక ప్రజా ఉద్యమంగా చొచ్చుకొని పోగలదు.

గత ఒకటిన్నర సం॥ము నుండి ప్రాజెక్టు నిర్వహించే ప్రత్యేక అధికారి లేకపోవటం వలన కార్యక్రమము ఎంతో కుంటుపడి ఈనాటి వరకు కూడా ప్రాజెక్టు కమిటీ లేకుండానే కార్యక్రమము నిర్వహించబడుచున్నదని మరియు కార్య నిర్వహణలో ఎన్నో ఇబ్బందులు ఎదుర్కొనవలసి వస్తుందని ఒక అధికారి ఎంతో ఆవేదనతో తెలియబరచినారు.

ఇద్దరు అధికారులు బడుగు వర్గాల అభ్యున్నతికి ఉగ్దేశించే ఈ కార్యక్రమం పట్ల హరిజనులు చాలా శ్రద్ధ చూపినట్లు పేర్కొన్నారు. కార్యక్రమం సఫలీకృతము కావలెనన్న శ్రద్ధ ఆసక్తిగల కార్యకర్తలు ఎంతో అవసరమున్నదని తెలిపినారు. అట్టివారు చాలా అరుదై యుండటము వలన కార్యక్రమము తన కొన్న లక్ష్యము నెరవేరక పోవచ్చునని ఆవేదన వెలిబుచ్చారు. స్వచ్ఛంద సేవా సంస్థల యొక్క సహకారము ఏ మాత్రము లేదనియు విచారము వెలిబుచ్చారు.

ఉన్నత వర్గాలవారు ఈ కార్యక్రమముపట్ల ప్రోత్సాహము చూపించుట లేదని మరియు గ్రామాల్లో మహిళల సంచాలకుల కొరత యుండుట వలన మహిళా కేంద్రాల నిర్వహణలో ఇబ్బందులు ఎదుర్కొనవలసి వస్తున్నది కార్యక్రమము సఫలీకృతము కావలెనన్న ఆసక్తి గలవారు ఎంతో అవసరమని తీవ్ర ఆందోళన వ్యక్తం చేసినారు.

ఒక అధికారి ప్రాజెక్టు వెనుకబడిన ప్రాంతంలో వుండటం వల్ల బడుగు వర్గాల నుండి కార్యనిర్వాహకుల (సంచాలకుల) కొరత యున్నదని విచారము వెలిబుచ్చినారు. ఒక ఆశ్చర్యకరమైన విషయము ఏమనగా ఒక జిల్లాలో ప్రభుత్వ సహాయం లేకున్నప్పటికి స్వచ్ఛంద సేవా సంస్థలు కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నాయి. కావున ప్రభుత్వము కార్యక్రమాన్ని కొనసాగించలేక పోయినప్పటికి స్వచ్ఛంద సేవాసంస్థలు పూర్వమునుండి చేస్తున్నట్లే కార్యక్రమాన్ని కొనసాగించగలవనియు మరియు వయోజన విద్యా భవిష్యత్తు స్వచ్ఛంద సేవా సంస్థలపై ఆధారపడి యున్నదనియూ దీనివల్ల విదిత మవుతున్నది. ప్రభుత్వము చేపట్టిన గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలలో వయోజన విద్యా కార్యక్రమము ఒకటి. మహాత్మాగాంధీ సూచించిన నిర్మాణాత్మక కార్యక్రమాల్లో వయోజన విద్యా ఒక అంగంగా పేర్కొనబడినది. దీనికై ప్రభుత్వము పథకాలను రూపొందించి బడ్జెట్‌ను మంజూరు చేయడంతో సరిపోదు. పోతే ప్రభుత్వం చేపట్టిన ఈ పథకాల్లో మార్పులు రావలసి యున్నది యుద్ధ ప్రాతిపదికపై నిర్వహించవలసిన ఈ కార్యక్రమం కేవలం ప్రభుత్వ ఆధ్వర్యాన నిర్వహించినంత వరకు ఇది ప్రజా ఉద్యమంగా చొచ్చుకొని పోలేము. ప్రజల్లో "జాగృతిని" కల్గించి వారి పరిసరాలను వారు గుర్తించి దేశాభివృద్ధికి, వ్యక్తివికాసానికి సమాజశ్రేయస్సుకు వారే బాధ్యులని వారికి తెలియ జేయుటమే ఈ కార్యక్రమ లక్ష్యం. కావున కార్యక్రమం స్వచ్ఛంద సేవా సంస్థలు రాజకీయ పార్టీలు, యువకులు పాల్గొన్నప్పుడే ఈ కార్యక్రమం ప్రజా ఉద్యమంగా చొచ్చుకొని పోగలదు. మరియు కార్యక్రమము సాంప్రదాయక పద్ధతులకి బదులుగా "శాస్త్రీయ పద్ధతులు" అవలంభించ వలసిన అవసరం ఎంతో ఉంది. వయోజన విద్యలో శిక్షణ పొందినవారిని అనుభవజ్ఞులైన వారిని కార్యక్రమ నిర్వహణలో భాగస్వాములుగా చేసి కార్యక్రమము ప్రజల అవసరాలను వారి దైనందిన జీవితాలను అనువుగా రూపొందించ వలసిన ఆవశ్యకత ఎంతైనా యున్నది. రష్యా, క్యూబా, చైనా, వియత్నాం దేశాల్లో చేపట్టిన వయోజన విద్యా కార్యక్రమాలు సఫలీకృత మగుటకు అచ్చట రాజకీయ పార్టీల పట్టుదల వివిధ సంస్థల సహాయ సహకారాలు ఆర్థిక వనరులు కల్పించడమే కాక వయోజన విద్యా శిక్షణ కార్యక్రమాలను చేపట్టినాయి. ప్రజల్లో "చైతన్యం" కల్గించుటకు ఉద్దేశించిన ఈ కార్యక్రమము ప్రభుత్వం చిత్తశుద్ధితో అమలు పరచిన ప్పుడే సఫలీకృతము కాగలదు.

ప్రస్తుత సర్వే కేవలం ఒక పై చూపుతో మాత్రమే స్థూలమైన పరిశీలనగా కొనసాగించాము. క్షుణ్ణమైన పరిశీలనకు అవకాశాలు కానీ కావలసిన వనరులు కాని లేవు. ఐనా సర్వేలో వెల్లడియైన సత్యాలు లోపాలను సవరించు కొనడానికి తద్వారా రెండవ దశ కార్యక్రమములో ఇతోధికమైన ప్రగతి సాధించడానికి సహాయపడుతుందని విశ్వసిస్తున్నాము. ఈదృష్టితో పై సర్వే ఆధారంగా దిగువ సూచనలు చేయబడినవి.

1. యావత్ ఆంధ్రప్రదేశ్‌లో తక్షణమే అన్ని ఖాళీలకు నియామకం చేయవలెను.

2. నియామకాలను లాంఛన ప్రాయమైన ఇంటర్వ్యూలు ఏదో అధికార హోదాలు చెప్పే దృష్టిని ప్రభుత్వం విడనాడాలి. లభించినంతవరకు "వయోజన విద్యలో డిగ్రీ స్థాయిలో" శిక్షితులైన యువకులందరిని తక్షణమే నియామకం చేయాలి.

3. అధికారుల నియామకంలో కేవలం గ్రేడ్‌లు, హోదాలు ఆధారంగా వివిధ డిపార్టుమెంటుల అధికారుల కేటాయింపును నిలుపుదల చేయాలి. చక్కగా వ్యావస్థీకరించి ప్రత్యేక శిక్షణ పొందిన వారిని నియామకం చేయాలి. ఈ శిక్షణా కాలములో వారి ప్రవృత్తిని, కార్యశక్తిని పరిశీలిస్తూ దానిపై జరిగే శిక్షితుల యొక్క సామూహిక నిర్ణయం పైననే ఎంపికలు నియామకాలు జరగాలి.

4. లాంఛనంగా నామ మాత్రం కొరకై ఉన్నటువంటి రాష్ట్ర వనరులను కేంద్రం పునర్వ్యవస్థీకరించి కార్యక్రమానికి తోడ్పడేటట్లుగా ప్రభుత్వ మరియు స్వచ్ఛంద సేవా సంస్థలకు ప్రాతినిధ్యము కల్పించవలెను.

5. అధికారుల శిక్షణా బోధకుల శిక్షణా పరిశోధన ఈ మూడు విభాగాలకు తక్షణమే రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక సంస్థల ఏర్పాటు చేయాలి.

6. 9 నెలల వయోజన విద్యా శిక్షణ కాలపరిమితి కనీసం 6 నెలలకు కుదించి వయోజనులను ఆకర్షించే బోధన సామగ్రి సహాయంతో వారిని ఆకర్షిస్తూ శిక్షణ పొందే వారిని మధ్యనే మానివేసే ప్రవృత్తిని అరికట్టే ఏర్పాటు చేయాలి.

7. శిక్షణ పొందే వారిని ప్రోత్సాహము సహాయము కల్గించే చర్యలకు పూనుకోవాలి. ఇవి స్థానిక ప్రజల సహకారంతో కొనసాగేటట్లు చూడాలి.

8. కార్యక్రమం మొదటి సం॥ము అనుభవములను దృష్టిలో ఉంచుకొని నిపుణులు, అమలు చేసే అధికారుల సమావేశం, సమీక్ష ఏర్పాటు చేసి రెండవదశ కార్యక్రమమునకు అవసరమైన వరకు సంస్కరించాలి.

9. ప్రతి జిల్లాలో ప్రభుత్వ ఆధ్వర్యాన నిర్వహించే 300 కేంద్రాలు మూకుమ్మడిగా ప్రభుత్వం నిర్వహించడం ఏ దృష్టితో చూసినా సమంజసం కాదు. అనుభవం, ఆసక్తి శిక్షణ కల్గి ముందుకు వచ్చిన వ్యక్తులకు లేదా సంస్థలకు వారి వారి శక్తి వనరుల అనుగుణంగా కేంద్రాలు నిర్వహించే అవకాశం కల్పించబడవలెను.

10. మహిళా కేంద్రాల పరిస్థితి దృష్టిలో ఉంచుకొని ప్రాజెక్టు అధికారులను సంప్రదించి ప్రత్యేక సదుపాయాల ద్వారా శిక్షణ ఒసంగి ప్రోత్సహించి వీటి పరిస్థితి మెరుగు పరచవలెను.

11. వయోజన విద్యా కేంద్రాలు మూత పడిన సందర్భాలలో ప్రాంతీయ వయోజన విద్యాధికారులు అంతా కలిసి గ్రామం సందర్శించి స్థానిక ప్రజలతో కలిసే బాధ్యత వహించాలి.

12. రాష్ట్ర ప్రభుత్వం, కేంద్రప్రభుత్వంసంప్రదింపులు జరిపి కేంద్ర ప్రభుత్వం సహాయం పొందటానికి కనీసం 30 కేంద్రాలను నిర్వహించవలెనని అర్థరహిత నిబంధనను తక్షణమే సడలించేటట్లు చేయాలి.

ప్రపంచంలోని దేశాలను పరిశీలించినప్పుడు ఒక విషయము దాగని సత్యంగా కనపడుచున్నది. అజ్ఞానము దారిద్ర్యము ఇవి రెండూ కల్సి వున్నాయి. మనదేశదారిద్ర్య నిర్మూలన చేయాలని చిత్తశుద్ధితో ఆశించే వారైతే అవిద్యను పారద్రోలుటకు కంకణం కట్టుకొని తీరాలి. ఆ విద్యలో ఉన్నటువంటి దేశం ఏ దిశ పయనిస్తుందో ఎవరూ చెప్పలేని విషయము. కావున ఈ కార్యక్రమమును "చైతన్యీకరణం" కన్‌సైంటిజేషన్ ద్వారా వయోజనులలో తగిన ప్రేరణతో తీసుకురావలసి యున్నది. ప్రజలలో "జాగృతిని" చైతన్యాన్ని కలిగించి వారి పరిసరాలను వారు గుర్తించి దేశాభివృద్ధికి వ్యక్తి వికాసానికి సమాజ శ్రేయస్సుకు వారే బాధ్యులని తెలియజేసే కార్యక్రమాన్ని రూపొందించాలి. చైతన్యీకరణ లోపించడం వలన కోట రూపాయలతో నిర్వహించే ఈ కార్యక్రమము అనుకొన్న లక్ష్యాన్ని నెరవేర్చక పోవచ్చు.



శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి

# పల్లవకుమారవిష్ణువు బొబ్బేపల్లి తామ్రపట్టికలు

సుమారు రెండేండ్లకు ముందు ప్రకాశంజిల్లా అద్దంకి తాలూకాలోని బొబ్బేపల్లి గ్రామ శివారులో జేరిన రాజుగారి పాలెములో సుంకరగోవర్ధనరావు అనునతడు భూమిని త్రవ్వుచుండగా కొద్దిలోతున ఈ క్రింద వివరింపనున్న తామ్ర పట్టికల గుది బయల్పడెను అటనుండి తాలూకాధికారి ద్వారా ఆంధ్రప్రదేశ్ పురావస్తుశాఖకు ఈ తామ్ర పట్టికలు చేరెను. అప్పుడు పురావస్తుశాఖ కమీషనరుగా నున్న శ్రీ పి. సీతాపతి ఐ. ఎ. యస్., యం ఏ., యఫ్. ఆర్. ఏ. యస్. గారున్ను, ఇప్పుడు డైరక్టరుగానున్న డా॥ వి.వి. కృష్ణశాస్త్రిగారున్ను దీనిని ప్రకటించుటకు నా కొసగినందుకు వారికి నా కృతజ్ఞతలు.

అయిదు రాగిరేకులు 7 సెం. మీ. ల వ్యాసము, అర్ధ సెం. మీ. మందముగల రాగి కడియములో దూర్చబడి, ఆ కడియము కొనలు 3.5 సెం. మీ. ల వ్యాసము గల గుండ్రని పోతరాగితో జేయబడిన రాజముద్రికతో తాపటము జేయబడి యున్నవి. మొత్తము గుది బరువు 477 గ్రాములు. కడియము తెగగొట్టి రేకులను తీసితిమి. ప్రతి రేకు 17 × 5 చ. సెంమీ. ఉండెను. రేకుల మందము చాలా తక్కువ. రాజముద్రికపైన ఎడమవైపునకు తల ఉండునట్లు ఆసీనమై యున్న వృషభలాంఛనము గలదు. దాని క్రిందను, పైనను కొన్ని అక్షరములు చెక్కివేయబడినట్లు తెలియుచున్నది. అంతేగాక ముద్రిక మీదనున్న వృషభచిహ్నముపైన ఎత్తుగ నున్న భాగములందు వెండిపూత వేయబడినట్లు తెల్లదనము గనుపించుచున్నది. అక్షరములు చెక్కబడిమాపు చేయబడుట, వెండిపూత వేయుట చూడగ ఈ ముద్రిక ఒకప్పుడు శాసన దాతకాక వేరొకరాజు కాలమున కొంత మార్పుచెందియుండు నని తోచుచున్నది. మొదటి రేకు మొదటి వైపున, అయిదవరేకు రెండవవైపున వ్రాత యేమియులేదు. మిగిలిన మూడు రేకులు రెండువైపుల వ్రాయబడగా మొత్తము ఎనిమిదివైపుల నాలుగేసి పంక్తుల చొప్పున 32 పంక్తులలో శాసనమంతయు వ్రాయబడెను. వ్రాత యెచటను నష్టము కాలేదు. మూడవరేకు మొదటివైపున మూడు ఏక కేంద్ర వృత్తములు గీయబడి వాటి నడుమ కూర్చొని యున్న వృషభచిహ్నము, ఆ వృత్తముల వెలుపల అడ్డముగ అస్పష్టముగ నాలుగు అక్షరములు గలవు. శాసనమునకు వీటితో సంబంధము లేదు.

## భాషాదికము

శాసనమంతయు సంస్కృతవచనములోను, తుదిలో అయిదు శ్లోకములు (వ్యాసగీతములు), మఱల శాసన కాలాదికమును తెలుపుచు కొంత వచనమును గలవు. అక్షరములు వేంగిలిపియని చెప్పబడు అయిదు ఆరు శతాబ్దములనాటి తెలుగక్షరములు. వాటిపైన అడ్డగీతలు చిన్నవిగా కూడా లేవు. కాని ఆ స్థానములో చుక్కలు మాత్రము ఉంచబడెను. కొన్ని అక్షరములపైన ఆ గుర్తులుకూడ లేవు. ఈ రాజులలో వేరొక కుమార విష్ణువుయొక్క చెందలూరు(1)శాసనములో అక్షరములన్నియు ఆ చుక్కలు గూడ లేకయే వ్రాయబడినవి. కాని ఆ శాసనాక్షరములు తరువాతి కాలమునకు చెందినవిగా కనుపించుటచేత ఆ శాసనము ప్రస్తుత శాసనము కంటే వెనుకదని చెప్పవచ్చును. "ద" అక్షరముయొక్క క్రింది భాగము కొన్నిటిలో కుడివైపునకు పొడిగించ బడుటయు, కొన్నిటిలో బ్రాహ్మీ అక్షరములందువలె క్రిందికి పొడిగించ బడుటయు కానవగును. "బ" అక్షరములోని ఎడమవైపున నిలువుగీత విడదీయబడెను. ఉపధ్మానీయమును "ప" వర్ణముతో చేర్చి వ్రాయునపుడు ఒకచోట "ట్ప" అని వ్రాయబడెను. ఇట్టి విశేషము అయిదవ శతాబ్దిలో కానవచ్చును. సంస్కృతభాషలో అనేక విధములగు తప్పులు

గలవు. అవి అన్నియు పూర్తిగ లేఖకునివే అనిగాని రేకులమీద చెక్కిన వ్రాయసగానివే అని గాని చెప్పజాలము. ఇరువురి తప్పులు ఇందుగలవు లేఖకుడు వ్యవహారములో నుండు కొన్ని పదములను విభక్త్యంత ప్రత్యయములు లేకయే వాడెను. "గ్రామే" అనుటకు "గ్రామ" అని "దత్తాం" అనుటకు "దత్తా" అని, "వర్మా" అనుటకు "వర్మ" మొదలయినవి యిట్టి తప్పులు. అయిదవ శ్లోకంలో, మొత్తము ప్రాకృతంతో కలసిన పదములనే తన యిష్టము వచ్చినట్లు ప్రయోగించెను. దానిని సంస్కృతములోనికి మార్చుట కష్టము. అక్షరముల తీరును బట్టి యీ శాసనము సుమారు క్రీ. శ. 450 ప్రాంతము నాటిదని చెప్పవచ్చును. కాని విషయము అట్లుగాక అంతకంటె ప్రాచీనమని తోచు చున్నది.

దీనిని ప్రాచీన పల్లవ శాఖకుచెందిన శ్రీమాన్ కుమార విష్ణు వర్మ మహారాజు, తన పదమూడవ విజయరాజ్య సంవత్సరము నందు, కర్మ రాష్ట్రమున కలిగొండ గ్రామములో కొంత భూమిని కాశ్యప గోత్రుడగు ఈశ్వరశర్మ యను బ్రాహ్మణుడికి దాన మొసగినట్లు తెలుపుటకై ఇచ్చెను. కంచి రాజధానిగ, కృష్ణానది వరకుగల దక్షిణాంధ్రమును ఇక్ష్వాకుల అనంతరము క్రీ. శ. 275–80 నుండి క్రీ. శ. 631లో చాళుక్య రెండవ పులకేశి ఆక్రమించి తన సోదరుడగు కుబ్జ విష్ణువర్ధనుని ఆధీనములో ఉంచు వరకు ప్రాచీన పల్లవ రాజవంశము పాలించెను. ఈ రాజులు ఆంధ్రదేశము లోనే బయల్దేరి తొలిదశలో రాజ్యము చేసి యుండిరి గనుక వీరిని ఆంధ్రపల్లవులందురు. వీరు ఇచ్చినవి 4 ప్రాకృత శాసనములు, 2 సంస్కృత శాసనములు ఇప్పటికి ప్రకటించబడెను. ఇటీవల ఈ శాసనమేగాక నా మిత్రులు డా॥ వై గోపాలరెడ్డి, గూడూరు కళాశాలకు లెక్చరర్ డా॥ యస్. యస్. రామచంద్రమూర్తి, రాష్ట్రపురావస్తుశాఖ అసిస్టెంట్ డైరక్టర్, ఇరువురు నెల్లూరు ప్రాంతమున దొరికిన తామ్రపట్టిక శాసనము వేరొండు దానిని బయల్పెట్టిరి. అది యింకను ప్రకటింపబడవలసి యున్నది. వాటిలో ఇది ముఖ్యమైనదగుటచే ముందు దీనిని ప్రకటించుచుంటిని. పై మిత్రుల అనుమతితో త్వరలో దానిని కూడా ప్రకటించు ప్రయత్నము చేయుదును. ఇప్పుడు ప్రస్తుతమైయున్న శాసనము లిపిని బట్టి సుమారు క్రీ శ. 450 ప్రాంతము నాటిదని చెప్పదగి యున్నను. సూక్ష్మముగ బరిశీలించుచో ఇది యీ చెప్పిన కాలములో తిరిగి వ్రాయబడినదనియు, దీని పూర్వపు నిజ శాసనము సుమారు డెబ్బది యేండ్లకు పూర్వము నాటిదై యుండుననియు చెప్పవలసి యున్నది. ఈ స్వల్ప వ్యవధిలో లిపిలో అట్టి మార్పును గుర్తించుట కష్టమే. కాని కారణాంతరములు బలముగ నున్నవి. వాటిని తరువాత వివరించుదును తిరిగి వ్రాయబడినంత మాత్రమున ఇందలి విషయమునకు అసత్యము నాపాదించ నక్కరలేదు. శాసనమును ప్రామాణికముగా స్వీకరించవచ్చును.

## శాసన విషయము

"స్వస్తి, జితం భగవతా" అను మంగళాశాసనముతో ప్రారంభమై ఈ శాసనము కాంచీపురము నుండి ఈయబడెనని తెలువబడెను. పరమ బ్రహ్మణ్యుడును, స్వబాహుబలము



మొదటి రేకు

చేత సంపాదించబడిన క్షాత్రవతమునకునిధియైన వాడును, విధివిహిత సర్వమర్యాద గల వాడును అగు మహారాజశ్రీ వీరకూర్చవర్మ యొక్క ప్రపౌత్రుడును; అభ్యుదితశక్తిసిద్ధి సంపన్నుడును, ప్రతాపముచేత ఉపనతుల గావించిన రాజ మండలము గలవాడును, వసుధాతలైక వీరుడును అగు శ్రీకరాళవర్మ యొక్క పౌత్రుడును; దేవద్విజ గురువృద్ధుల నారాధించుటచేత వృద్ధినొందిన ధర్మము గలవాడును, ప్రజా పాలన దక్షుడును, లోకపాలురలో అయిదవ లోకపాలుడును, సత్యాత్ముడును అగు మహారాజ శ్రీస్కన్దమూలుని యొక్క పుత్రుడును; భగవత్పాదానుధ్యాతుడు, బప్ప భట్టారకుని పాద భక్తుడు, పరమ భాగవతుడు, భారద్వాజసగోత్రుడు, యథా విధిగ నిర్వర్తించిన అనేకాశ్వమేధములు గల పల్లవులలో పల్లవ శ్రీ మహారాజ శ్రీమాన్ కుమార విష్ణువర్మ ఆజ్ఞాపించు నదేమన "కర్మరాష్ట్రములో కలిగొండ యను గ్రామమున, వీరి గ్రామము పోవు మార్గమునకు తూర్పునను, చుణో ప్రాళు గ్రామము యొక్క పొలమేరకు ఉత్తరమునను, కొండముజునూరు గ్రామమార్గమునకు పడమరగను, సర్పా శయమునకు దక్షిణముగను గల సుక్షేత్రములోను; దొనావటి గ్రామ సరిహద్దుకు పడమరగను, చుణోపాళు గ్రామ సరి హద్దుకు ఉత్తరముగను, సర్పగృహమునకు తూర్పుగను పాత, లేక, పెద్ద చెఱువుకు దక్షిణముగను గల సుక్షేత్రము లోను; (మరల) సర్పగృహమునకు తూర్పుగను, మహిషశిర గ్రామ సరిహద్దునకు దక్షిణముగను, పుల్లణూరు గ్రామ సరి హద్దుకు పడమరగను, కంసారి తటాకమునకు ఉత్తరముగను గల సుక్షేత్రములోను; ఈ మూడు భూములందు అరువది నాలుగు నివర్తనములు (భూమి) కాశ్యపగోత్ర ఈశ్వర శర్మకు, తన (రాజు యొక్క) ఆయుర్బల పుణ్య, ఆరోగ్య నిమిత్తముగ దానము చేయుచున్నాడెను. ఈ ఆజ్ఞను తెలిసికొని రాజవల్లభులు, నైయోగికులు, గోపాలురు, వత్సపాలురు, సంచరన్తకులు ఈ భూమిని సర్వకరపరిహారముగ రక్షింప వలెను, చేయించవలెను; ఈ శాసనము అతిక్రమించిన పాపాత్ముడు శారీరదండనమునకు అర్హుడగును."

ఇట భూమిదానాత్, బహుభిర్వసుధాదత్తా. స్వదత్తాం పరదత్తాంవా, బ్రహ్మస్వం విషం- అను నాలుగు శ్లోక ములు; తరువాత కాంచీపురాధీశునిచే బ్రాహ్మణునికి దానము చేయబడెను. దానిని పల్లవ వల్లభులందరు రక్షించవలెను అను భావముగల ఒక తప్పుల శ్లోకము గలవు. ఇందు జెప్పబడిన విషయములు.

1) ఈ శాసన ప్రదాత పల్లవ వంశమునకు చెందిన వీరకూర్చవర్మయొక్క ముని మనుమడు, కరాళవర్మయొక్క మనుమడు, స్కందమూలవర్మ యొక్క పుత్రుడు అయిన కుమార విష్ణువర్మ. 2) దానమొసగినది కర్మరాష్ట్రములోని కలిగొండ గ్రామములోమూడు ఖండములుగ అమరియున్న మొత్తము అరువది నాలుగు నివర్తనముల భూమి. 3) రాజు తన 13వ రాజ్య వర్షమునందు మహాకార్తిక మాసమున శుక్లపక్షపంచమి విశాఖా నక్షత్ర, గురువారమునాడు, ఈ, దాన మొసగెను. 4) ఈ దాన భూమిని రాజవల్లభులు నైయోగికులు గోపాలురు, వత్సపాలురు, సంచరన్తకులు అను ఉద్యోగులు (సర్వకర) పరిహారముగ మన్నించ



రెండవ రేకు – మొదటివైపు

వలెనని రాజు ఆదేశించును. 5) శాసన ఆజ్ఞప్తిబాడ రాజు; లేఖకుడు రుద్రశర్మ- అను అంశములు ఇందు గలవు. వీటిని క్రమముగా పరిశీలింతము.

1. శాసన దాత యగు కుమార విష్ణువు యొక్క ముత్తాత వీరకూర్చవర్మ. ఇతనిని చాలా కాలము పరిశోధకులు చారిత్రక పురుషునిగ అంగీకరించలేదు. క్రి. శ. 8 9 శతాబ్దముల లోని వసడగిన వాయలూరు, కాశాకుడి వేలూర్పాళయము శాసనములలో వీరకూర్చుని పేరు గన వచ్చుచున్నది. కాని ఆ శాసనములు అర్వాచీనములగుట చేత, అతని అస్తిత్వమును గూర్చి శంకించుచుండిరి. ఆ శాసనములందితడు పల్లవవంశమునకు మూల పురుషుడుగ పేర్కొనబడెను. కాని దర్శిశాసనపు మొదటిరేకు ఒకటి (4) లభించిన పిదప, అందు వీరకోర్చవర్మ యొక్క ముని మను మడిని చెప్పబోవుచున్న మొదటి భాగము లభ్యమగుటను బట్టి వీరకూర్చవర్మ చారిత్రక పురుషుడే యగుననియు ఇతడే పల్లవ వంశస్థాపకుడనియు నిర్ధారితమయ్యెను. దర్శిశాసనపు మొదటిరేకువలె ప్రస్తుతపు బొబ్బేపల్లిశాసనముకూడ వీరకూర్చవర్మతోటే ప్రారంభమగుచు అతని ముని మనుమడగు కుమార విష్ణువర్మను శాసనదాతగా జెప్పుచున్నది. దర్శిశాసనములో నష్టమైన భాగమందున్న మిగిలిన ముగ్గురు వ్యక్తులు బహుశ ఇందున్న కరాళ, స్కందమూల, కుమార విష్ణువులే కావచ్చును. కాని నిశ్చయముగ జెప్పజాలము. శాసన లిపి రెండింటి యందును ఒకే విధముగ నున్నది బొబ్బేపల్లి శాసనము తిరిగి సంస్కృతములో వ్రాయబడి యుండునని ఊహించితిమి. దర్శిశాసనాన్నికూడ అట్లే అనుకొనవలెనో లేక రెండును తర్వాత కాలానికి చెందినవో విచారించవలసి యున్నది. వీరకూర్చ పల్లవవంశస్థాపకుడై యుండగా అతని నాలుగవ తరమువాడైన కుమార విష్ణువు అతనికి తరువాత 81-100 ఏండ్ల మధ్యవాడు కావలెను. వీరకూర్చవర్మ సుమారు క్రి. శ. 275-300 మధ్య పల్లవ వంశమునకు రాజ్యము సంపాదించి యుండునని పలువురు అంగీకరించిన విషయము. కనుక అతని ముని మనుమడగు కుమార విష్ణువు క్రి. శ. 400లోపువాడే కావలయునుగాని ఆ తరువాతివాడు కాజాలడు. అతని బొబ్బేపల్లి, దర్శిశాసనములలిపి యింకా తరువాతదిగా కనుపించుచున్నది. వాయలూరు శిలాశాసనములో (6) రెండవవీరకూర్చవర్మ మఱియొకడు పేర్కొన్నబడెను కదా. అతని ముని మనుమడు ఈ కుమార విష్ణువుకాకూడదా అనుకొన వీలులేదు. రెండవవీరకూర్చవర్మకు ముందే కుమారవిష్ణువుయొక్క తండ్రి, తాతలైన స్కంద మూలవర్మ, కరాళవర్మలను వాయలూరు శాసనముపేర్కొను చున్నది అ శాసనములో ముందు సుమారు ఇరువదిమంది భరద్వాజ, ద్రోణ, అశ్వత్థామలవంటి పురాణములందుండు వ్యక్తులు, అశోక, కళింద, కొంకణి వంటి కొందరు చరిత్రకు తెలియని వ్యక్తులు చెప్పబడిన తరువాత 21వ సంఖ్యగల వాడుగ కాలభర్త అనువాడు పేర్కొనబడి ఆ తరువాత చారిత్రకవ్యక్తులు బేర్కొనబడిరి.

21. కాలభర్త

22. చూతపల్లవ



రెండవ రేకు - రెండవ వైపు

23. వీరకూర్చ (1)
24. చంద్రవర్మ
25. కరాళవర్మ
26. విష్ణుగోప
27. స్కన్దమూల
28. కాణగోప
29. వీరకూర్చ (2)
30. స్కన్దవర్మ
31. కుమార విష్ణు (1)
32 బుద్ధవర్మ

తరువాత మహేంద్రవర్మ వరకు 51 మంది ఆపైన మరికొందరు రెండవ నరసింహవర్మవరకును మొత్తము 53 గురు వ్యక్తులు పేర్కొనబడిరి. ఈ వాయలూరు శాసనము రాజసింహుడనబడు రెండవ నరసింహ వర్మ కాలమునకు చెందినది (క్రీ. శ. 700-728). మన ప్రస్తుత బొబ్బేపల్లి శాసన దాతయగు కుమార విష్ణువు యొక్క తాతయగు కరాళవర్మ పై జాబితాలో 25వ సంఖ్య వాడుగను, తండ్రియగు స్కందమూలుడు 27 వ సంఖ్యవాడు గను జూపబడిరి. వీరి తరువాతనే 29వ సంఖ్యవాడుగ రెండవ వీరకూర్చవర్మ కలడు. కనుక మన శాసనమందున్న కుమారవిష్ణువుని మొదటి వీరకూర్చవర్మయొక్క ముని మనుమడనియే చెప్పుట సముచితము. అతడు వీరకూర్చుని తర్వాత నూరేండ్లలోపుగా అనగా సుమారు క్రీ. శ. 375 ప్రాంతమువాడై యుండును. వాయలూరు శాసనములోని జాబితా కొంతవరకైనను నిజమై యుండునని ప్రస్తుత శాసనమువలన క్రొత్తగా తెలియవచ్చిన కరాళ,స్కందమూలుల పేర్లు రుజువుచేయుచున్నవి.

అయితే మొదటి వీరకూర్చుని తరువాత అతని కొడుకు కరాళవర్మగాని, మనుమడు స్కందమూలవర్మగాని రాజ్యమేలిరా లేదా అను విషయము సంశయమే. క్రీ.శ. 350 ప్రాంతమున కళింగాంధ్రములపై దాడి వెడలిన సముద్రగుప్తుడు కాంచేయకవిష్ణుగోపుని పరాజితు నొనర్చెనని అతని అలహాబాదు ప్రశస్తిశాసనము తెలుపుచున్నది. అట్లే మయిదవోలు(4)హిరహడగల్లి(5), చారుదేవి(5a) యిచ్చిన ప్రాకృత శాసనముల కాలములో శివస్కన్దవర్మ కంచినుండియే పాలించుచుండెను. కనుక వీరకూర్చుని యనంతరము కనీసము విష్ణుగోపవర్మ, శివస్కన్దవర్మ లైనను కంచినుండి పాలించి యుందురు. విష్ణుగోపునికి ముందు చంద్రవర్మ, కరాళ వర్మలు రాజ్యమేలిరోలేదో తెలియదు. వీరకూర్చునికి చంద్రవర్మ పుత్రుడో లేక తమ్ముడో తెలియదు. కరాళవర్మకు మన శాసనములో స్కన్దమూలుడు పుత్రుడుగా చెప్పబడెను. ఇతడుగాక 30వ సంఖ్యగల స్కన్దవర్మవరకు గలవారిలోకూడ కొందరతని పుత్రులై యుండిరేమో చెప్పజాలము. ఈ స్కంద వర్మయే ప్రాకృత శాసనములిచ్చిన దాత కావలెను. అతని తరువాత రాజ్యమునకు వచ్చినవాడే ప్రస్తుత బొబ్బేప



మూడవ రేకు - మొదటివైపు

శాసన దాతయగు కుమార విష్ణువు. శాసనభాష: లిపి ఆ ప్రాకృతశాసన కాలానికి దగ్గరున్నట్లు కనిపించుట లేదుకనుక ఈ శాసనము తరువాత కొంతకాలమునకు సంస్కృతములో పునర్లిఖితమైయుండునని ఊహించుటకు అవకాశము గలదు. మఱియు, ఈ కుమార విష్ణువే ప్రాచీనుడగు మొదటిరాజుగ వేలూరు పాళయంపట్టికల (6) శాసనమందు కీర్తింపబడెను. ఆవిషయమునుగూర్చి వేఱొండువ్యాసములో చర్చించబడును. తిరిగి యితని మునిమనుమడు విజయస్కందవర్మ మొదటి ఒంగోడు శాసనము (7) ఇచ్చెను. ఈ రాజుల సంస్కృత శాసనములలో ఈ ఒంగోడు శాసనమే మొదటిదిగా భావింపబడుచున్నది. ఆ శాసన కాలమునాటికివారి యితర సంస్కృత శాసన రచనలోగల విశేష ప్రశస్తిగాని, మొదట "జితం భగవతా" అను మంగళాశాసనముగాని రూపొందినట్లు కనుపించవు. దాని తేది తన 33 వ రాజ్యవర్షము హేమన్తర్తువు మూడవ పక్షములో త్రయోదశి అని చెప్పబడెను. లిపియు ఆ కాలమునకు తగినట్లేయున్నది. మన బొబ్బేపల్లి శాసనము అంతకు నాలుగు పురుషాంతరములు అనగా సుమారు 80 ఏండ్లకు పూర్వపుదై యుండవలెను. కాని దీనియందు వారి సంస్కృత శాసనములందున్న రచనా విధానము, "జితంభగవతా" అను మంగళవాక్యము, లిపి కనుపించుచు ఒంగోడు దానికంటె తరువాతికాలమును సూచించుచున్నవి. ఈ కారణము వలన కూడ బొబ్బేపల్లి శాసనము తరువాత కాలమున సంస్కృతీకరించ బడెనని తోచుచున్నది. 2. శాసనములోని రెండవ అంశము దాన విషయమై యున్న భూమిని గూర్చినది. ఇది త్రైభూమ్యాం అని చెప్పబడుటచేత ఆ కలిగొండ గ్రామములోనే మూడుచోట్ల మూడు ఖండములుగ మొత్తము భూమి 64 నివర్తనముల మేరకు సమాన, మగుచున్నదని చెప్పబడెను. దానికి తగినట్లు మూడు ఖండములకు ప్రతిదానికి నలుప్రక్కలగల సరిహద్దులు నిర్దేశించి చెప్పబడెను. వీటిలో సర్పాలయము బహుశ ఒక నాగులగుడియైయుండును. కలిగొండగ్రామము గుర్తించ వీలుగాకున్నది. వీరి అను గ్రామము బహుశ విరివలు కాదగును. అక్కడికి పోయే త్రోవయేసరిహద్దుగ జెప్పబడెను గనుక విరివలు ఈ భూమికి దూరముగనైన ఉండవచ్చును. చణోపాళు, ఆకాలమున సున్నపురాళ్లు త్రవ్వి, బట్టీలుకాల్చు సున్నప్పొడు వంటి పేరుగల పల్లెయై యుండును. ఇప్పుడు గుర్తించలేము. కాని బొబ్బేపల్లి దగ్గర సున్నపుబట్టీలున్న ప్రదేశముగలదని మిత్రులద్వారా వింటిని. మహిషశిరము అనునది "ఎనుముతల" అను తెలుగు పదమును ఇప్పటి "ఎనముదల" అను గ్రామనామము నుండి గ్రహించి సంస్కృతము గావించబడెను. ఇది బొబ్బేపల్లికి ఉత్తరముగా 5.6 కి. మీ. దూరమున గలదు. కొండముజునూరు, బొబ్బేపల్లికి దక్షిణముగ 8 కి. మీ. దూరమున గల యిప్పటి కొండముజులూరు. దొనావటి యిప్పటి ద్రోణాదుల గ్రామము. అదియు అచ్చటనే గలదు. పుల్లఊరు కూడ బొబ్బేపల్లికి కొంచెము తూర్పుగనున్న పూనూరు కావచ్చును. వృద్ధతటాకము, కంసారితటాకము అనునవి అచట నుండు చెఱువులు. ఇప్పుడు గుర్తింపజాలము. సరిహద్దులుగా పేర్కొనబడిన కొన్ని గ్రామములు శాసనము దొరికిన



మూడవ రేకు - రెండవ వైపు

బొబ్బేపల్లి సమీపములో ఉండుటచేత దానమొసగిన భూమిగల కలిగొండ్ల గ్రామము కూడ ఆ ప్రాంతముననే పూర్వము ఉండి యుండును. ఇచ్చిన భూములు మూడును సర్పాలయమునకు సమీపముగనే యుండుటచేతను, ప్రతిగృహీతయగు ఈశ్వరశర్మకు ఈదానమొసగుటకు గల విశేష నిమిత్తము చెప్పబడకుండుటచేతను, ఆ ఈశ్వరశర్మ సర్పాలయమునకు అర్చకుడై యుండునని తోచుచున్నది. ఇతని పాండిత్యాదికము ఏదియు చెప్పబడలేదు. తొలిపల్లవులు నాగవంశమువారితో బాంధవ్యము కలుపుకొని, వీరకూర్చవర్మ ఒక నాగరాజు కుమార్తెను పరిణయమాడి, రాజ్యలక్ష్మిని పొందినట్లు వేలూరిపాళయపుశాసనము చెప్పుచున్నది. కనుక సర్పదేవుని ఆరాధించుట వారి ఆచారమయ్యెను. కొండముజునూరు, పావులూరు ప్రాంతములలో నాగపూజ, నాగశిలలు విశేషముగా గనుపించును. ఇప్పటి ఒంగోలు, చీరాల, దర్శి, అద్దంకి, బాపట్ల, నర్సరావుపేట తాలూకాలు మఱి కొన్ని భాగములు పూర్వము కర్మరాష్ట్రమనబడుచుండెను.

3. ఈశాసనమందు చర్చించదగిన ముఖ్యాంశములలో అందు జెప్పబడిన కాలమొకటి. శాసనదాతయగు కుమారవిష్ణువుయొక్క పదమూడవ విజయరాజ్య సంవత్సరము మహాకార్తికమాస శుక్ల పక్ష పంచమియు, విశాఖా నక్షత్రము, గురువారము అని శాసనము 29,30 పంక్తులలో తెలుపబడెను. తేదీలను మాసము, పక్షము, తిథులలో తెలుపుట క్రీ. శ. రెండవ శతాబ్దమునాటి కొన్ని నాసిక శాసనములందు (8) సైతము గనుపించుచున్నది. అట్లే ఋతువు, పక్షము, దివసములలో తెలుపు ఆచారము క్రీ. శ. 659 నాటిదగు తూర్పుచాళుక్య జయసింహవల్లభుని గుడివాడ శాసనములో కూడ కనుపించుచున్నది. (9) కనుక ఈభేదమును పురస్కరించుకొని శాసనకాలములో ముందు వెనుకలను ఊహించుట కష్టము. కాగా, ఈశాసనములో విశాఖానక్షత్రము, గురువారము పేర్కొనబడుట క్రొత్తవిషయము. దక్షిణదేశపు శాసనములందు వారము పేర్కొనబడుట క్రీ. శ. 631 నాటిదగు రెండవ పులకేశి యొక్క కొప్పారం శాసనములోను, ఇంచుమించుగ అదేకాలమునకు చెందిన రేనాటి చోళరాజు పుణ్యకుమారుడి తిప్పలూరి శాసనములోను (10) గనుపించుచున్నది. ఈ తిప్పలూరుశాసనములో కార్తిక బహుళపాడియు, సోమవారము, పునర్వసు నక్షత్రము బృహస్పతి హోర చెప్పబడినవి. ఇంతవరకు వారమును, నక్షత్రమును దెలుపు శాసనమిదియే మొదటిదిగా భావింపబడుచున్నది. ప్రస్తుత బొబ్బేపల్లి శాసనము తిరుగ వ్రాయబడినదని అనుకొన్నను, అయిదవ శతాబ్దము మధ్య కాలము కంటె తరువాతది కాజాలదు. కనుక వారమును, నక్షత్రమును చెప్పుచున్న మొదటి శాసన మిది యగుచున్నది. ఇన్ని వివరములున్నప్పటికి దీనియందొక లోపము గనుపించుచున్నది. ముందు మహాకార్తిగమాసమనగా విశేషమేదియో తెలియుటలేదు. మహాకార్తికి అని కృత్తికానక్షత్రముతో సరిగా కూడియుండు కార్తికపూర్ణిమకు పేరు. బార్హస్పత్యమాసములో బృహస్పతి గ్రహము ఉదయించు నక్షత్రము కృత్తిక



నాల్గవ రేకు — మొదటి వైపు

యగుచో ఆ సంవత్సర మంతయు మహాకార్తిక సంవత్సర మనబడును. కాని మంకిచట మహాకార్తిక మాసము వేర్కొన బడియున్నది. కార్తిక మాసములో శుక్ల పంచమినాడు విశాఖ నక్షత్రమున్నది, గనుక తిథులననుసరించి పంచమినాటిక పౌర్ణమి 9, 10, లేక 11 రోజుల వ్యవధిలో నుండును. నక్షత్రములననుసరించి చూచినచో విశాఖనుండి కృత్తిక 14 రోజులు లేదా కనీసము 13 రోజుల వ్యవధిలో నుండవలెను. కనుక కార్తికమాస శుక్లపక్ష పంచమినాడు విశాఖ నక్షత్రము కుదరని విషయముగ గన్పట్టుచున్నది. ఈ సన్నివేశము ఆశ్వయుజ శుక్లపక్ష పంచమియగుచో వీలగును. అప్పుడు కూడ పంచమినుండి పౌర్ణమి 11రోజులు తిథివృద్ధివలన వచ్చినచో సరిపోవును. కాని మహాకార్తికమాసమును దానికి వేఱొక విశేషమేదైనా కలదేమో తెలియదు ఇంతకు, ఇన్ని వివరములున్నను శాసనకాలమును దానికి సరియగు 'శతాబ్దములలోగాని క్రీస్తుశకములోగాని కనిపెట్టుట కష్టమగుచున్నది. కార్తికమాసములో శుక్లచవితి నాగుల చవితిగా మనకు పర్వదినము. ఆనాడు ఉపవాసముచేసి మరునాడు పంచమినాడు దానాదికములు నాగదేవునికి ప్రీతిగా చేయుట ఆనాటి ఆచారమువావచ్చును. ఈ దానము అట్టి సందర్భమును సూచించుచున్నది. దానమునకు వేఱొక నిమిత్తము చెప్పబడలేదు. పైన చర్చించిన తేదీ ఒక విధముగా తప్పు అగుటకూడ ఈ శాసనము తిరుగ వ్రాసినది కావచ్చుననెడి యూహకు కారణమగుచున్నది.

ఈ సందర్భమున క్రింది అంశములను పురస్కరించు కొని శాసన కాలమును చర్చించవలసి యున్నది.

1. ఈ శాసనము పల్లవ వంశ స్థాపకుడైన మొదటి వీరకూర్చవర్మ యొక్క మునిమనుమడగు కుమార విష్ణువర్మచే ఈయబడెను.

2. ఈ కుమార విష్ణువు, ఒంగోడు మొదటి 'శాసన దాతయగు విజయస్కందవర్మయొక్క ముత్తాతయని అందు చెప్పబడిన కుమారవిష్ణువు ఒకే వ్యక్తియైయుందురు.

3. ఒకే రేకు మాత్రము దొరకిన దర్శి శాసన ఖండములో చెప్పబడిన వీరకూర్చుని ప్రపౌత్రుడు కూడ ఈ కుమార విష్ణువే కాదగును. ఈ రెండు శాసనములు ఒకే ప్రాంతములో దొరికినవి. రెండిటి లిపి, రచనా విధము ఒకే రీతిగ నున్నవి. అయినను దాతలు ఒకే వ్యక్తియని నిశ్చయముగ చెప్పజాలము.

4. ఒంగోడు మొదటి శాసనము లిపిని బట్టియు శాసనరచనా విధానమును బట్టియు ప్రస్తుతమై యున్న బొబ్బేపల్లి శాసనము కంటె ప్రాచీన కాలమునకు చెందినదని తెలియుచున్నది. అనగ ఒంగోడు శాసనము సుమారు క్రీ. శ. 430 ప్రాంతము నాటిది కాగా, ఇది క్రీ. శ. 450 నాటిదనిపించును. ఒక్క పురుషాంతర వ్యవధిలో ఆ రాజుల శాసన రచనా విధానమొక నిర్దిష్ట రూపములో కొన్ని ప్రశస్తి పూర్వక సమాసములతోను, "జితం భగవతా" అని మంగళా శాసన ప్రారంభముతోను శాసనములు రచింపబడుట మొదలయ్యెను.



నాల్గవ రేకు - రెండవ వైపు

# శాసన కాల పరిశీలన

శాసనములో దాతయొక్క పదమూడవ రాజ్య సంవత్సరములోనివిగా చెప్పబడిన విశేషముల వలన మనకు శతాబ్దములు తెలియుటలేదు. కనుక వేరొక విధముగనే ఈ శాసన కాలమును సుమారుగనైన చెప్పవలసియున్నది. అట్లు చెప్పుటకు కొన్ని సాధకములున్నప్పటికిని అందుకు బాధకముగ కూడ కొన్ని కారణములు గనుపించుచున్నవి.

సాధకములుగనున్న అంశములు : ఈ మొదటి పల్లవుల శాసనములలో ఇందుకాక కుమార విష్ణువుపేరు మూడు మార్లు వచ్చును. ముందు చెప్పిన ఒంగోడు ఒకటవ శాసనములో ఆ శాసన దాతయగు విజయస్కంద వర్మయొక్క తండ్రి వీరవర్మ, తాత స్కందవర్మ, ముత్తాత కుమారవిష్ణువు అని పేర్కొనబడిరి. ఈ కుమార విష్ణువు తండ్రి పేరు తెలియదు. వారి సంస్కృత శాసనము లన్నిటిలోను ఇవి ప్రాచీనమని చెప్పవచ్చును. దీనిలో వారియితర సంస్కృత శాసనములలో వలె రాజులను ప్రశంసించు దీర్ఘ సమాసములు ఇంక రూపొందినట్లు గనుపించదు. శాసనముయొక్క ఆదిలో వారి యితర సంస్కృత శాసనములందు గనుపించు "జితం భగవతా" అను మంగళ శాసనము లేదు వారి ప్రాకృత శాసనములలో కూడ అది ఉండదు. వారి ప్రాకృత శాసనములందువలె ఈ ఒంగోడు శాసనములో తేది ఋతువులలో పరిగణించు పద్ధతిలో చెప్పబడెను. ప్రస్తుత బొబ్బేపల్లి శాసనముతో సహా వారి యితర సంస్కృత శాసనములన్ని మాసముల పద్ధతిలో తేదీని చెప్పుచున్నవి. ఒంగోడు శాసన అక్షరములుకూడ ప్రాచీనతను సూచించుచున్నవి. ఇందులో మొదటి వాడుగ పేర్కొనబడిన కుమారవిష్ణువు ఈ ఒంగోడు శాసన కాలముకంటె సుమారు 60 ఏండ్లయినను పూర్వపు వాడు కావలెను ఇది విజయస్కంద వర్మయొక్క 33 వ రాజ్యవర్షమున ఈయబడెను. అంతకు ముందు తండ్రి, తాతలకు కనీసము ముప్పదేండ్లయినను కాలమొసగుచో ఆపై వాడైన కుమారవిష్ణువు కనీసము 60 ఏండ్లకు పూర్వము వాడగును. కనుక ఒంగోడు శాసన కాలము చెప్పగలుగుచో అందున్న కుమారవిష్ణువుయొక్క కాలము సుమారుగ చెప్పవచ్చును.

చెందలూరు శాసనములో (12) ఇద్దరు కుమార విష్ణువులు పేర్కొనబడిరి. కాని వారిలో ఒకరు స్కందవర్మ కొడుకనియు, రెండవవాడు బుద్ధవర్మ కొడుకనియు చెప్పబడిరి. మన బొబ్బేపల్లి శాసనములోని కుమారవిష్ణువు స్కన్దమూలుని కొడుకని చెప్పబడినాడు గనుక వారిలో ఏ ఒక్క కుమార విష్ణువును బొబ్బేపల్లి శాసన కుమార విష్ణువునిగా చెప్ప వీలులేదు పై ఒంగోడు శాసనములోని కుమారవిష్ణువుయొక్క తండ్రి పేరు తెలియదు. కనుక వానిని ప్రస్తుత శాసనములోని వానినిగా చెప్పుకొను అవకాశము గలదు. చెందలూరి శాసనములోని స్కందవర్మ కొడుకైన మొదటి కుమార విష్ణువే ఒంగోడు శాసనములోని వాడగుచో ఆ అవకాశము ఉండదు. కాని ఒంగోడు శాసనములోని కుమారవిష్ణువు విశేషించి అశ్వమేధయాగము చేసిన వాడుగ కీర్తింపబడెను. చెందలూరు శాసనములోని మొదటి కుమారవిష్ణువు అట్లు



అయిదవ పదేకు

మే

కీర్తించబడలేదు. ఆకాలములో అశ్వమేధ యాగము చేయుట రాజులకొక విశేష ఘనత. సామాన్య రాజులుగాక అనేక యుద్ధములొనర్చి గొప్ప రాజ్యము సంపాదించినవారికే అదిసార్థకమై చెల్లుచుండెడిది ఈ పల్లవులలో మొదటి శివస్కందవర్మ, మొదటి కుమారవిష్ణువు మాత్రమే అశ్వమేధయాగ మొనర్చినట్లు చెప్పబడిరి. ప్రస్తుతమై యున్న బొబ్బేపల్లి శాసనదాతయైన కుమారవిష్ణువు ఆ వంశ స్థాపకుడైన మొదటి వీరకూర్చునికి నాలుగవ పురుషాంతరము వాడే గనుక అతడే మొదటి కుమార విష్ణువు. ఈ శాసనములో ఆ యాగము నతడు చేసినట్లు చెప్పబడకున్నను దీని తరువాత ఆ క్రతువును చేసి యుండవచ్చును. ఇతనికి మరి నాలుగు పురుషాంతరముల వాడు ఒంగోడు శాసన దాతయగు విజయస్కందవర్మ తన ముత్తాతయిన కుమార విష్ణువును అశ్వమేధయాజిగా ప్రశంసించెను. కనుక చెందలూరు శాసనమందున్న ఇద్దరు కుమార విష్ణువులలో ఎవరును ఒంగోడు శాసనములో ఆ పేరుతో పేర్కొనబడిన వాడు కాజాలడు.

కనుక ఒంగోడు శాసనమందు మొదటి వాడుగను అశ్వమేధయాగము చేసిన వాడుగను కీర్తింపబడిన కుమార విష్ణువును, బొబ్బేపల్లి శాసనములో దాతగాను, వీరకూర్చ వర్మకు మునిమనుమడుగాను చెప్పబడిన కుమారవిష్ణువును ఒకే వ్యక్తియై యుందురను ఊహతో ఈ శాసన కాలము క్రీ. శ. నాలుగవ శతాబ్దిలో రెండవభాగము అనగా క్రీ. శ. 370-75 ప్రాంతముగ చెప్పవచ్చును. దీని తరువాత ఈ రాజు ఇంకాయెంత కాలము రాజ్యముచేసెనో తెలియదు. అట్లే యితని కొడుకైన స్కందవర్మ, మనుమడైన వీరవర్మ లెంతెంత కాలము రాజ్యమేలిరో తెలియదు. ముని మనుమడైనవిజయస్కందవర్మ తన 33వ రాజ్యవర్షమున ఒంగోడు శాసనమిచ్చెను. అతని కొడుకు సింహవర్మ క్రీ. శ. 436లో రాజ్యారంభము చేసియుండునని ఆధారాంతరములతో పలువురు తీర్మానించి చెప్పుచున్నారు కనుక విజయస్కందుడు క్రీ. శ. 400 ప్రాంతములో రాజై యుండును. అంతకుముందు ఇరువదేండ్ల వ్యవధిలో ఇద్దరు రాజులను చూపవలసి వచ్చుచున్నది. దాయాదుల శాఖలలో అధికారము మార్పు చెందియుండును. లేదా ఈ శాసనదాత వేరొక కుమార విష్ణువు కాదగును. వాయలూరు శాసనము ఇచ్చిన జాబితా ఇద్దరు కుమార విష్ణువులనే పేర్కొనుచున్నది. అయినను పై చర్చలో ముగ్గురిని చెప్పవలసి వచ్చెను ఇంకొకరిని కల్పించుట ఆధారాంతరములు లభించువరకు సహేతుకము కాజాలదు. ఇప్పటికి ఈ శాసనమునుబట్టి స్కందమూలుని కొడుకైన కుమార విష్ణువు మొదటివాడు. చెందలూరు శాసనములో స్కందవర్మకొడుకైన కుమార విష్ణువు రెండవవాడు. అదే చెందలూరు శాసనములో బుద్ధవర్మ కొడుకైన కుమార విష్ణువు మూడవవాడు. ఒంగోడు (1) శాసనములో తండ్రి పేరు తెలియని కుమార విష్ణువు మొదటివాడు కాదగును

ఈ రాజుల మొదటి సంస్కృత శాసన మనుకొనుచున్న ఒంగోడు (1) శాసనము కంటె ప్రస్తుత బొబ్బేపల్లి శాసనము వెనుకదిగా కనుపించుచున్నది. ఒంగోడు (1) శాసనములో లేనట్టియు వారి యితర సంస్కృత శాసనములు అన్నిటిలోను గనుపించునట్టియు "స్వస్తి జితం భగవతా" అను మంగళా శాసనముతో శాసనము మొదలగుట యిందు గనుపించుచున్నది. దీనిని శ్లో॥ జితం భగవతాతేన సంబుద్ధేన కృపాత్మనా, నిర్వాణ ప్రాప్తయే యేన నత్యై మార్గః ప్రదర్శితః॥ అని బుద్ధుని పరముగ విష్ణుకుండి గోవింద వర్మ తుమ్మల గూడెం (14) శాసనములోను; "జితం భగవతా తేన గత ఘన గగనాభేన పద్మనాభేన" అని అయిదవ శతాబ్దపు గాంగ మొదటి మాధవవర్మ పెనుకొండ శాసనములో విష్ణు దేవుని పరముగను శాసనాదియందు మంగళా శాసనముగ గనుపించుచున్నది. దీనిలోని మొదటి భాగము "జితం భగవతా" అని మాత్రము అది పల్లవుల సంస్కృత శాసనము లన్నిటిలోను, (ఒంగోడు(1) తప్పించి) కనిపించు చున్నది. కనుక బొబ్బేపల్లి శాసనము ఒంగోడు (1) శాసనముకంటే తరువాతిది కాదగును. ఇంకను ముఖ్యమైనది, ఒంగోడు శాసనము (1)లో కనుపించని పల్లవ రాజుల ప్రశస్తితో గూడిన దీర్ఘ సమాసములు వారి ఇతర సంస్కృత శాసనములందువలె ఈ బొబ్బేపల్లి శాసనములో

గూడ కనుపించుచున్నవి. దీనిని బట్టి కూడ వారి శాసన ప్రశస్తికొక విధమగు రచనా విధానము ఏర్పడిన తరువాతనే యీ శాసనము రచింపబడెనని తెలియుచున్నది. ఇందలి లిపికూడ అయిదవ శతాబ్ది దనిపించుచు ఒంగోడు (1) శాసనముకంటె తరువాతిదిగ తోచును. అట్లగుచో దాతయగు కుమార విష్ణువును నాలుగవ శతాబ్దపు వాడుగ చెప్పుట యెట్లు వీలగును?

ఈ సమస్యను బరిష్కరించుటకు ఈ క్రింది సమాధానములు చెప్ప వీలగునేమో చూడవలెను. 1. ఈ శాసన దాతయగు కుమారవిష్ణువుయొక్క తండ్రిగా పేర్కొనబడిన స్కందమూలుడు, చెందలూరు శాసనములో మొదటి కుమార విష్ణువుయొక్క తండ్రిగా జెప్పబడిన స్కందవర్మయు ఒకే వ్యక్తియై యుండురనుకొన వచ్చునా? కాని యీ ఊహ కుదురదు. వాయలూరు శాసనములో మొదటి వీరకూర్చ వర్మకు సన్నిహితుడుగ స్కందమూలవర్మ కనుపించుచుండగా వేరొక శాసనములో ఆ పేరును స్కందవర్మగా మార్పు చేయుట అసంగతము. స్కందమూలుడు, స్కందవర్మ భిన్న వ్యక్తులు.

2. వాయలూరు శాసనములోనే రెండవ వీరకూర్చుని తరువాతనే కరాళ, స్కందమూల వర్మలను చూపవలెను. ఇది పండిత సమ్మతమైన సమాధానము కానేరాదు.

3. మనము సూచించిన క్రీ. శ. 370 ప్రాంతమునాటి క్రీ. శ. 450 ప్రాంతములో తిరిగి వ్రాయబడిన దనుకొనుట. ఇట్లనుకొన్నచో దీనితో అన్ని విధముల పోలియున్న దర్శి శాసనముకూడ అట్లే తిరుగ వ్రాయబడిన దనుకొనవలెను. మనకు చరిత్రలో కుదరని శాసనములన్నింటిని యిట్లు ఫోర్జరీలని ఆరోపించకూడదు కదా. కనుక ఇది కూడ సంతృప్తి కరమైన సమాధానము కాజాలదు. అయినప్పటికి ఈ శాసనము దర్శిశాసనము తిరుగ వ్రాయబడి యుండునని తోచుచున్నది.

1. ఆ కాలములో కొన్ని ప్రాకృత శాసనములు సంస్కృతములోనికి తిరుగ వ్రాయబడె ననుటకు అవకాశము గలదు. ప్రస్తుత శాసనములో కొన్ని పదములు ప్రయత్నపూర్వకముగ సంస్కృతీకరించబడినట్లు స్పష్టముగ గనుపించుచున్నవి. ఉదాహరణకు: నాగుల గుడి సర్పాలయమని, సర్పగృహమని: సున్నప్పాడును చూర్ణప్రాంతని; ఎనమదలను; ఎనుము + తల అని విడదీసి మహిష శిరగ్రామమని; కిష్టయ, గోవింద, గోపాల మొదలయిన పదాలతో చేరియున్న, చెఱువునో లేక "నల్ల చెఱు" వను పేరుగల దానిలో "నల్ల" అను విశేషణమును "కృష్ణ"గా మార్చి దానినుండి కంసారి తటాక మని, పాత చెరువును వృద్ధ తటాకమని కొన్ని వ్యావహారిక పదములను ప్రయత్నపూర్వకముగ సంస్కృతీకరించినట్లు కనబడును. సాధారణముగా శాసనములలో సరిహద్దులపేర్లు దేశభాషలోనే వ్రాయుచుందురు. అయినను ఈ శాసనములో సంస్కృత వ్యామోహము స్పష్టముగ తెలియుచున్నది. అట్లే చివర నున్న శ్లోకము "కాఞ్చీ పురాధిపోదత్తం భక్తేన బ్రాహ్మణాయ చ। రక్షణార్థకాం యదా భూమివల్లభ పల్లవసదా॥" దీనిని సరిగా అన్వయించుట కష్టసాధ్యము. (కాంచీపురాధిపుడైన రాజు భక్తుడై బ్రాహ్మణుని కొరకు ఇచ్చిన దానిని పల్లవ భూమివల్లభుల రక్షణార్థముగ స్వీకరించవలెను.) ఒకే కాంచీపురాధిపుడు పూర్వ మొసగిన దానమును వేరొక పల్లవ భూవల్లభుడు రక్షణార్థమై స్వీకరించెను. అనగా మన్నించి తిరిగి దానమొనర్చెననియెడి భావము దీనియందు తెలియుచున్నది. శాసనములో కృత్రిమ సంస్కృతీకరణము గనుపించును.

2. శాసన కడియముపైనున్న రాజముద్రిక మీది అక్షరములు చెక్కివేయబడుట, ఆ ముద్రికమీది వృషభము పైన వెండిపూత వేసినట్లుండుట చూడగా కడియము నొకమాటు విడదీసి తిరిగి మఱల తాపటము చేసినట్లు అనుమానము కలుగుచున్నది. అంటే పూర్వపు శాసనాన్ని సంస్కృతములో తిరిగి వ్రాయించి యుండునని తోచుచున్నది. ఆ కడియమునే ముద్రికతో సహ వాడిరి.

3. ఇంతకంటె ముఖ్యమైన విషయము-దానముచేసిన భూమి ఒక నాగుల గుడికి చుట్టుపట్లనే మూడు ఖండములుగా నున్నది. ప్రతి గృహీత "కాశ్యపగోత్రాయ ఇసరసర్మణే" అని మాత్రమే పేర్కొనబడెను. ఆతని విద్వత్తు వగైరా యితర విశేషణములెవ్వియు చెప్పబడలేదు. దీనిని బట్టి ఆ భూమి ఒకప్పుడు ఏక ఖండముగా నాగదేవాలయమునకు కుమార విష్ణువుచేత దానము చేయబడగా, రెండు మూడు పురుషాంతరములు గడిచిన పిదప ముగ్గురు అర్చకులు పంచుకొన దలచి అప్పటి పల్లవ రాజును ఆ భూమికే మూడు ఖండములుగా చూపుచు తమ తండ్రి పేరనో తాత పేరనో తిరిగి వ్రాయించి ఇచ్చునట్లు కోరియుందురు. లేకున్న యెడల ఒకే స్థలమున దానము చేసిన భూమిని మూడు ఖండములుగా స్పష్టమైన సీమాహద్దులు తెలుపుచు ఒక మహారాజు శాసనము వ్రాయించ వలసిన అవసరమురాదు. ఒకే ఖండముగా కొంత అధిక భూమి నైనను ఇచ్చి తన యీవిని ప్రకటించు కొనువాడు. ఇది కేవలము వారసుల పంపిణీలకు సంబంధించినదిగా స్పష్టమగు చున్నది. అయిదో శతాబ్దంలో రాజులుకూడ ప్రాకృతాన్ని విడిచి శాసనాలు సంస్కృతంలో వ్రాయించటం ముఖ్యంగా కనుపిస్తుంది. అట్లా సంస్కృతంలోకి మార్పు చేయబడ్డ పదాలతో మార్చిన శాసనమిది. ఇట్లా మార్చినదే దర్శి శాసనం కూడ అయి యుండును. తిరిగి వ్రాయించిందికూడా పల్లవరాజే కనుక మొదటి దాత యైన కుమార విష్ణువునందు గౌరవము కొద్ది ఆ రాజు పేరనే దీనిని సంస్కృతంలో వ్రాయించి ఇచ్చెను. ఆ రాజ ముద్రికనే వాడుచు దానిపై నున్న అక్షరములను తొలగించెను. కాని తనపేరును వేయించి నట్లు లేదు.

4. ఇట్లా తిరుగ వ్రాయించిన పల్లవ శాసనాలు మఱి కొన్ని గలవు. బాగోడు రెండవ శాసనము అట్టిదేనని దానిని ప్రకటించిన హెచ్. కృష్ణశాస్త్రిగారు అభిప్రాయపడిరి. (16) చూరా శాసనము కూడ అట్టిదేనని చెప్పుచు సి. ఆర్. కృష్ణమాచార్లుగారు ఈ పల్లవ రాజుల శాసనాలు ఇట్లేల తిరుగ వ్రాయబడినవో అర్థమగుట లేదనిరి. (17) అట్లు ఆ రాజులు సంస్కృతములో తిరిగి వ్రాయించుటకు మనమీ యర్థము చెప్పవచ్చును. అప్పటి వరకు మహోజ్వలముగ నున్న బౌద్ధ మతమును తొలగించి వైదిక ధర్మోద్ధరణమే తమ రాజ్యాధికారమునకు ప్రయోజనముగా వారు చెప్పుకొనిరి. "కలియుగ దోషావసన్న ధర్మోద్ధరణ నిత్య సన్నద్ధస్య" అని ఉరువపల్లి, నెడుంగరాయ శాసనాల్లో యువరాజ విష్ణుగోప వర్మ చెప్పుకొనును. కనుక బ్రాహ్మణ మతోద్ధరణకు సూచకముగా సంస్కృతమును శాసనభాషగా ప్రవేశపెట్టుటయేగాక బౌద్ధ మతము వారు ప్రోత్సహించిన ప్రాకృతమును క్రమముగ అధికారిక భాషా ప్రతిపత్తినుండితొలగించుటతోబాటు పూర్వము తమ వంశము రాజులు ఇచ్చిన ప్రాకృతశాసనాలను దొరికినంతమటుకు ప్రతిగృహీతల నుండి తెప్పించి సంస్కృతములో తిరిగి వ్రాయించి యుందురు. ఆకాలమున ఆంధ్రదేశమునేలిన మిగిలిన రాజుల మాటయెట్లున్నను ఆంధ్రపల్లవులుమటుకు ఇట్టి పనులను చేసియుందురనుకొనుట మిక్కిలి సంభవము. వారిలో త్రినయన పల్లవుడను బిరుదు గల రాజొకడు శ్రీశైలమునకు తూర్పున అనేక బ్రాహ్మణాగ్రహారములు నెలకొల్పెనను సమాచారము మనకు అనేక శాసనాల నుండి తెలియుచున్నది. అది అంతయు బౌద్ధమునకు,బౌద్ధుల ప్రాకృతభాషకు వ్యతిరేక కార్యక్రమములో జేరిన పనియే. కనుక తమపూర్వులొసగిన కొన్ని ప్రాకృత శాసనాలను సంస్కృతములో తిరుగ వ్రాయించిరనుటను సంశయింప నక్కరలేదు. ఈశాసనవిషయములో ప్రతిగృహీతల అభ్యర్థన కూడ మఱియొక కారణమైయుండును.

5. ఈ తిరుగవ్రాయించినపుడు "జితంభగవతా" అను మంగళాశాసనము, క్రొత్తగా రూపొందించు కొన్ని దీర్ఘ సమాసములతో గూడిన రాజ ప్రశస్తులు, తేదీని తెలుపునపుడు తిథి, వార, నక్షత్రాలు తప్పుగా వ్రాయుట, చివరి శ్లోకము తప్పువ్రాయుట మున్నగునవి చేరి యుండును. దీనిలో తమ పూర్వికుడొకడు చేసినదానము రక్షణార్థముగ ఆరాజు పేరనే తిరిగి వ్రాయబడెనని సూచింపబడుచున్నది.

6. తిరిగి వ్రాసినదైనను అందలి వీరకూర్చ, కరాళ వర్మ, స్కందమూల, కుమారవిష్ణు అను నలుగురి క్రమము

సత్యముకాకుండుటకు కారణములేదు. కనుక ఆ అంశమును చరిత్రకు విశ్వసనీయముగ గ్రహించవచ్చును. అట్లే తిరుగ వ్రాసిన కాలపు అక్షరములు క్రీ. శ. అయిదవ శతాబ్దపు మధ్య భాగమును సూచించుచున్నవి గనుక అప్పటికైనను తేదీయందు తిథితోపాటు వార, నక్షత్రములను పేర్కొన్న శాసనము ఇదియే మొదటిదని చెప్పవచ్చును. శాసనదాత యైన కుమార విష్ణువు సుమారు 370 ప్రాంతమువాడై యుండును. ఇతని మునిమనుమడు విజయస్కందవర్మ ఒంగోడు మొదటి శాసనమును సుమారు క్రీ. శ. 430-5 మధ్య ఇచ్చియుండును.

శాసనోక్తదానను మొదటి సారిగా కుమారవిష్ణువు సుమారు క్రీ. శ. 370 ప్రాంతమున ప్రాకృత సంస్కృత మిశ్రమభాషలో ఇచ్చియుండగా దానిని తిరిగి వేటాక వలవ రాజు సుమారు క్రీ. శ. 450 ప్రాంతమున సంస్కృతములో ఇప్పుడు మనకు లభ్యమగుచున్న రూపములో వ్రాయించి యుండునని తలంచుటకు అవకాశము గలదు.

ఈ దానముచేసిన భూమిని పరిహారములతో కాపాడ వలెనని రాజు కొందరు ఉద్యోగులను ఆదేశించును. కొన్ని పన్నులు గాని మొత్తము అన్ని విధములగు పన్నులుగాని చెల్లించనవసరములేకుండుట, రాజోద్యోగులు ఎట్టి బాధకలి గించకుండుట, మున్నగునవి బ్రహ్మదేయములు, దేవదేహ ములు అగు భూములకు రాజులు అనుగ్రహించువారు. వీటిని పరిహారములందురు. కాపాడవలసిన ఉద్యోగులు అనేకులు చెప్పబడుచుందురు. రాజవల్లభులు రాజుల యొద్దనుండి విశేషోద్యోగులు, నైయోగికులు రాష్ట్ర, విషయ గ్రామము లకు సంబంధించిన స్థానికోద్యోగులు, గోపాలురు గోవులను రక్షించువారు, వత్సపాలురు ఇతర పశువులను రక్షించువారు, పూర్వము రాజులకు పశుధనము విశేషముగా నుండెడిది. శత్రురాజులు వాటిని అపహరించు కొనిపోవుట మహాభార తమునందు ఉత్తర గోగ్రహణ గాథనుండియు, చరిత్ర కాల ములో బాణ-వైదుంబ రాజుల యుద్ధములు, కాటమరాజు కథ మున్నగు వాటిని బట్టి తెలియుచున్నది. కనుక పశు మే

వుల పర్యవేక్షణకై ప్రత్యేకోద్యోగులుండువారు. వారు దాన భూములలో గోవులను అక్రమముగా మేపుకొనరాదనియు ప్రతి గృహీతల గోవులకు పన్నులు విధించరాదనియు ఆ ఉద్యోగులు హెచ్చరిక చేయబడిరి. సంచరన్తకు లనగా రాజ శాసనములను ప్రజలకు తెలుపుచుండు వారు.

ఈ శాసనమును "లాడ రాజు" అమలు జరిపి యుండును. ఇతడు ప్రాంతీయ మాండలికుడు గావచ్చును. ఇట్టి వానిని ఆజ్ఞప్తి అందురు. శాసనమును రచించినవాడు రుద్రశర్మ.

## శాసన మూలము

### మొదటి రేకు

1. స్వస్తి [।*]జితం భగవతా శ్వాజ్ఞో (18)పురాధిష్ఠాన (నా) త్పరమ బ్రహ్మణ్యస్యస్వబాహు బ [లా]
2. ర్జితోర్జితక్షాత్ర తపోనిధే ర్విధివిహిత సర్వ మయ్యాదస్య మహారాజస్య
3. శ్రీ వీరకూర్చ వర్మణః ప్రపౌత్రో భ్యర్థితశక్తి సిద్ధి సంపన (న్న) స్యప్రతాపో (పో)-
4. పనత రాజమణ్డ్లా (ణ్డ) లస్య వసుధాతలైక వీరస్య మహారాజస్య శ్రీకరా-

### రెండవ రేకు-మొదటి వైపు

5. శవర్మణః పౌత్రో దేవద్విజగురు వృధ (ద్ధో)పచా యిన[*] ప్రవృ [ద్ధ*] ధర్మ సఞ్చయ-
6. స్య ప్రజాపాలన [ప*] రక్షస్య లోకపాల (లా) నాం ప ఞ్చమస్య లోకపాలనాం (19) సత్యా-
7. త్మనో మహారాజస్య శ్రీ స్కన్దమూల వర్మణః పుత్రో భగవత్పాదాను
8. ధ్యా (ధ్యా)తో బప్ప భట్టా.(ట్టా )రకపాదభక్త[ః*] పరమ భాగవతో భారద్వాజసగో-

### రెం. రెండవ వైపు

9. త్ర (శ్లో) యథా వరాహ్య వా(తా)నే [కా*]శ్వమేథా (ధా)నాం పల్లవనం (వానాం) పల్లవ(ః*) శ్రీ మహా రాజస్య(జః)

10. శ్రీమాన్ కుమ(మా)ర విష్ణువర్మ్మ(ర్మ్మా) ఇమ మర్థం మ(మా) జ్ఞాపయతి [1*] తద్యథా కర్మ్మ రాష్ట్రే క-

11. లిగొణ్డ నామ గ్రామ (మే) వీరి గ్రామపతే (థః) పూర్వ్వతః చుణో ప్రాళు గ్రామసీన్మ(మ్న)

12. పు (ఉ)త్తరతః కొణ్డముజునూరు గ్రామపతే [థః] పశ్చిమతః సప్పార్శయ దక్షిణత[ః*]

### మూడవ రేకు-మొదటివైపు

13. ఏత చ (చ్చ) తురవధి [దక్షిణ] సుక్షేత్రే దొనా వ(టీ) గ్రామసీన్మః(మ్నః) పశ్చిమతః చుణో (ఉ*)

14. ప్రాళు గ్రామసీన్మః (మ్న) ఉత్తరతః సప్పర్గృహే (హస్య) పూర్వ్వతః వృధ (ద్ధ) తటాకదక్షిణత ఏతః

15. చ (చ్చ) తురవధీ (ధి) దక్షిణ పూర్వ్వ సుక్షేత్రే సప్పర్గృహే (హస్య) పూర్వ్వతః మహిష శిర గ్రామే (మ)

16. సి (సీ) న్మః (మ్నః) దక్షిణత [ః*] పూల్లఊరు గ్రామే [మ] సీన్మః [సీమ్నః] పశ్చిమత [ః] కంసారి తటాక ఉత్తరతః (20)

### మూడు: రెండవవైపు

17. ఏతచ [చ్చ] తురవ [ధి] పూర్వోత్తే [త్త] రే సుక్షేత్రే త్రై భూమ్యం చౌ[ష] ష్టి నివర్తనాని కాశ్యా [శ్య]-

18. పగోత్రాయ ఇసర (ఈశ్వర) స [శ] ర్మ్మణే (దత్త వాన్)* ఆయుఃఅల

19. ప్ర [త్రాని*] స్త (త) దవగమ్య రా[జ వ]ల్లవ నైయోగిక గోపాల వత్సపాల సఞ్చర-

20. న్తకా [ః*] పరిహరై [ః*] వ [ది*] హ [ర*] న్తు పరిహ (హా) రయన్తు చ[1*]యోస్మచ్ఛాశ(స) న మతిక్రా-

### నాల్గవరేకు-మొదటివైపు

21. మే స(త్స) పాపః శారీరం దణ్డ మర్హతి [ః*] అపి చాత్రాషా[ః*] శు(శ్లో) కాఃభూమిదానా-

22. త్పరం దానం నభూతం నభవిష్యతి [1*] తస్యైవ హరన (ణా) త్పాపం నభూతం నభవిష్య

23. తి [11*] బహుభిర్వ్వసుధా దత్త [త్తా] బహుభిశ్చాను పాలితా [1*] యస్యయస్య య-

24. దాభూమి త(స్త) స్య తస్య తదాఫల [ం*] ।। [2*] స్వదత్త (త్తాం) పరదత్తజ్వా (త్తం వా) యోహరేత

### నాల్గవ రెండవవైపు

25 వసున్ధరా [ం*] [ః*]గా (గ) వాం శత సహస్ర స్యహన్తుః పిబతి కిల్వి (ల్బి) షమ్ [113*] బ్రహ్మ-

26. స్వన్తు విషం ఘోరం న విషం విషముచ్యతే [1*] విషమేకాకినం హన్తు (న్తి)

27. బ్రహ్మస్వం పుత్రపౌత్రికం(మ్) [114*] కాజ్ఞ్చ పురాధిపో దత్తం భక్తేన బ్రాహ్మ-

28. ణాయ చ (1*) రక్షనా (ణా*) త్తథాం మా (య) దాభూమి పల్లభ సదా ।(115*)

### అయిదవరేకు

29. ప్రవర్ధమాన విజయరాజ్యసంవత్సరే త్రయోదశ(శే) మహా కా-

30. ర్తిక (క) మాసే శుక్లపక్ష వ ఇచ్ఛ మ్య (మ్యాం) విశాక (ఖా) నక్షత్రే గురువ(వా) రే

31. లాడరాజ (జా) జ్ఞాప్త్యా రుద్రశర్మ్మణ (ణా) లిఖిత మిదం సాశ (శాస) నం (1) ఆచన్ద్ర

32. దా (తా) రకం కృత్వా దత్తవాన్ (1*) స్వస్తిగో బ్రాహ్మణేభ్య (ః) (11*)

## సూచనలు


1. ఎ పి. ఇం. 8, పుట 233
2. ,, 1, పు. 397
3. ,, 18, పు. 147
4. ,, 6, పు. 86
5. ,, 1, పు. 5
5a. ,, 8, పు. 143
6. ద.హి.శా.సం.2, పు. 508
7. ఎపి. ఇం. 15, పు. 249
8. ,, 8, పు. 83
9. ,, 31, పు. 130-1
10. ,, 18, పు. 258
11. ,, 27, పు. 233
12. ,, 8, పు. 23
13. కె.ఎ.యస్. శాస్త్రి; వాకాటక-గుప్త ఏజ్. పుట. 234 నే. వెంకటరమణయ్యా, చరిత్ర రచన, పు. 91, 115
14. శంకరనారాయణ, విష్ణుకుండులు, పు. 153
15. ఎపి. ఇం. 24, పు. 238
16. ,, 15, పు 253-4
17. ,, 24, పు. 141
17a. ఎపి. ఆంధ్రికా 1, పు. 13
18. మూలములో (భగవతా (1*)కాత్సోపురా........)శని చదువవలెను.
19. "లోకపాలస్య" అని చదువవలెను.
20. "తటాకోత్తరతః అని చదువవలెను.


ఇందలి గ్రామములను గుర్తించుటలోను, తేదీని గూర్చి చర్చించుటలోను కొన్ని సూచనలు ఇచ్చిన శ్రీ చీమకుర్తి శేషగిరిరావుగారికిని, శ్రీ యస్. సేతు రామన్, గారికిని కృతజ్ఞతలు తెలుపుచుంటిని.



# దేవుడు లాంటి మనిషి

శ్రీ కే. కిశోర్‌బాబు

శ్రీ. కే. అశోక్‌బాబు

ఊరక
దేవుడులాంటిమనిషని
పొగడించుకుంటున్న
మంగళారయులు
పట్టించుకుంటున్న
వ్యక్తినిచూసి
భగవంతుడు

"మల్లె మొగ్గలనవ్వు" నవ్వు
-తున్నాడట!
వీడు గూడా
నాలాగే
మనసు లేని రాయి అయ్యాడని!
నాకు ఉద్దిగా నిలిచాడని!



శ్రీ బెహరా వెంకట సుబ్బారావు

# మొక్కుబడి

తండ్రి ఆఫీసునుంచి వచ్చి వీధి వరండాలో సైకిలుకి స్టాండు వేస్తూంటే గబగబా పరుగెత్తుకుని వెళ్ళింది మూడు సంవత్సరాల రోహిణి.

"నాన్నగారూ! నా పట్టీలు చూడండి!" అంది మురిసిపోతూ. కూతురి మాటలు విన్పించుకోని భాస్కరం తిన్నగా తన గదిలోకి వెళ్ళి వాలు కుర్చీలో కూర్చున్నాడు. తండ్రి వెనుకనే గదిలోకి వెళ్ళింది రోహిణి గబగబా అడుగులు వేసుకుంటూ. పట్టీలకున్న మువ్వలు సవ్వడి చేస్తూంటే రోహిణి ఆనందానికి హద్దుల్లేవు. తండ్రి కెదురుగా నిలబడి కుడి పాదాన్ని పైకెత్తి చూపిస్తూ

"అమ్మ పట్టీలు చేయించింది!" అంది ఉత్సాహంగా.

ఆ పట్టీలను చూసి ఆశ్చర్యపోయాడు భాస్కరం. కూతుర్ని వడిలో కూర్చుండబెట్టుకొని పట్టీలను సవరిస్తూ అడిగాడు "ఎప్పుడు చేయించింది!" అని.

"నేనూ అమ్మా సాయంత్రం షాపుకెళ్ళి తెచ్చుకున్నాం. అక్కడ నెక్లెసులూ, గొలుసులూ, ఉంగరాలూ చాలా వున్నాయ్ నాన్నగారూ! నాకూ ఒక గొలుసుకొనరూ!" గారాలు పోయింది రోహిణి.

"పాత వెండిచ్చి పట్టీలు చేయించాను! బావున్నాయా!" కాఫీగ్లాసుతో గదిలో ప్రవేశిస్తూ అడిగింది భాస్కరం భార్య పార్వతి.

"పాత వెండా!" ఆశ్చర్యంగా అడిగాడు.

కోడలు వెనుకనే వస్తూ జవాబిచ్చింది భాస్కరం తల్లి అనసూయమ్మ.

"దాని తమ్ముడు పెళ్ళికి వచ్చిన వుత్తరజంజాలూ దొంగ వేలంగిన్నీ అవీ యిచ్చి చేయించిది బాబూ! ఎదు మే దింటి ప్లీడరు గారమ్మాయి పట్టీలు చేయించుకొన్న దగ్గర నుంచీ నీకూతురు ఒకటే పేచీ పట్టీలు కావాలని! నేనే చేయించమన్నా!"

గొంగ వేలాంగిన్నీ వుత్తరజంజాలూ కల్సి రెండు తులాలు కూడా వుండవ్. పట్టీలు చూస్తే నాలుగు తులాలుంటాయ్! భాస్కరానికి అనుమానం తీరలేదు. అదే అడిగాడు.

"ఆ రెండు కలిస్తే తులంన్నర కూడా వుండవు కదమ్మా!" అన్నాడు.

"మీ నాన్నగారి వుద్దరిణి కూడా వేసాం!" అని భార్య చెప్పడంతో చీకాకు వేసింది భాస్కరానికి. అసమ్మతిగా ఆగ్రహంగా కొడుకు, కోడల్ని చూస్తుంటే సర్ది చెప్పాలనుకొంది అనసూయమ్మ.

"నేనే అలా చెయ్యమన్నా బాబూ! ఉద్దరిణి అక్కడా అక్కడా పడేస్తే కొన్నాళ్ళకి మర్చిపోతాం! పోయినా కూడా తెలీదు! వెండి ధర మండి పోతోంది! పిల్ల సరదా తీరుతుంది!

"నాన్నగారి జ్ఞాపకచిహ్నంగా అదొక్కటే మిగిలిందమ్మా! ఇలా చేస్తారనుకోలేదు!"

భర్త చీకాకు పార్వతికి కోపం తెప్పించింది.

"అక్కడా అక్కడా దొర్లుతోంది, పోతుంది అని మీ అమ్మగారు చేయించమంటేనే చేయించా! అంతేగానీ మీ అమ్మాయి సింగారం కోసం కాదు!"

చురచురలాడింది.

"అది కాదు పార్వతీ! నన్నడిగితే డబ్బిచ్చే వాణ్ణి కదా! అనవసరంగా దాన్ని చెరిపించి పాడుచేశారు! దాన్ని చూసినప్పుడల్లా నాన్నగారు జ్ఞాపకాన్కి వచ్చేవారు!"

"నీ తండ్రి జ్ఞాపకాన్కి రావాలంటే అవుద్దరిణే వుండా లట్రా! పెద్ద ఫోటో గదిలో పెట్టుకొన్నావ్ చాలదూ! నేనే అలా చెయ్యమన్నా! పార్వతినేమీ అనకు!" కొడుకుని శాంతపర్చాలని ప్రయత్నించింది అనసూయమ్మ.

"పదితులాల పంచపాత్రను చెరిపించి మేనల్లుని? అన్న ప్రాసనకి వెండిగిన్నె చేయించినప్పుడు ఏమీ అనలేదు! బోడి చెంచాకు యింత రభస చేస్తారనుకోలేదు. ఆర్నెల్ల బట్టీ పట్టు పరికిణీ కావాలని పేచీ పెట్టుంటే కుట్టించలేదుగానీ వందరూపాయిలు పెట్టి పట్టీలు చేయిస్తారట!" భర్తమీద విరుచుకుపడింది పార్వతి. సహనంతో మౌనం వహించాడు భాస్కరం.

అవును! పార్వతి అన్న మాట నిజమే! దెప్పుగా అంది కాబట్టి సహించలేకుండా వున్నాడు. ఆగ్రహం వస్తోంది తన కొడుక్కి అన్నప్రాసన ముహూర్తం పెట్టి అకస్మాత్తుగా రమ్మని ఆహ్వానించింది చెల్లెలు. ఆమెకు ముగ్గురాడ పిల్లల తర్వాత కొడుకు పుట్టాడు. తనకెప్పుడూ డబ్బుకిబ్బందే! నలుగురు పిల్లల్తో చిన్న జీతంతో సంసారం చేయాలి. ఆ రోజు ఏమి చేయాలో తోచక ఆలోచిస్తూ వుంటే తల్లే సూచించింది.

"బాబూ ఆలోచనెందుకు? నీ చెల్లెలు తన కొడుక్కి మీ నాన్నగారి పేరు పెట్టుకొంది. మీ నాన్నగారి సంపాదన ఆ వెండి పంచపాత్రా వుద్దరణీ మిగిలాయ్. పంచ పాత్ర పది తులాలుంటుంది. దాన్ని చెరిపించి వెండిగిన్నె చేయించి చదివించు. తన మనవడికి తన ఆర్జన ముట్టిందని మీ నాన్న గారి ఆత్మ సంతోషిస్తుంది. మనవడు పుడ్తే వెండి కంచం చేయిస్తానని మీ నాన్నగారు నీ చెల్లిల్తో అనేవారు. వెండి గిన్నైనా యిచ్చి తృప్తి పడదాం!"

అప్పుచేసి ఏదైనా చేయాలనుకొన్న భాస్కరానికి తల్లి సూచన నచ్చింది. పంచపాత్రని చెరిపించాడు. సకుటుంబంగా వెళ్ళి నలుగురిలోనూ ఘనంగా వెండిగిన్నె చదివించాడు. రోహిణి తండ్రి ఒడిలోంచి దిగి కుర్చీచుట్టూ తిరిగి "నాన్నగారూ పట్టీలు బాగులేవా? ఘల్లుఘల్లుమంటున్నాయ్. అడిగింది అమాయకంగా. భాస్కరం పెదవిపై చిరునవ్వు తొణికిన లాడ్డంతో అత్తా కోడళ్ళ మనసులు తేలిక పడ్డాయ్.

"చాలా బావున్నాయ్ తల్లీ!" అంటూ కూతుర్ని తిరిగి వడిలోకి తీసుకున్నాడు భాస్కరం.

  

రాత్రి భోజనానికి పీటమీద కూర్చొని

"అమ్మా!" తల్లిని కేకేశాడు భాస్కరం.

"రోహిణిని నిద్రపుచ్చుతున్నారు!" భర్తకు అన్నం వడ్డిస్తూ చెప్పింది పార్వతి.

"ఏం బాబూ పిల్చావా!" వంటింట్లో ప్రవేశిస్తూ అడిగింది అనసూయమ్మ.

"అవునమ్మా! రోహిణి పడుకుందా?"

తనయుని పక్కనే కూర్చొని "పడుకొందిరా! దానిది అచ్చం నీ పోలికే! పడుకొనే ముందు కథ చెప్పమని పేచీ పెడ్తుంది. తీరా మొదలు పెట్టేసరికి నిద్రపోతుంది!" అంది.

"వచ్చే పద్నాలుగో తారీఖున తిరుపతి ప్రయాణం పెట్టానమ్మా" చెప్పాడు భాస్కరం.

"చాలా సంతోషం బాబూ! పెద్ద కొడుకు పుట్టినప్పుడు మొక్కుకొన్న మొక్కు! వాడికి పదిహేనేళ్ళొచ్చాయి! చాలా ఆలస్యం చేసావ్! నలుగురు పిల్లల తండ్రి వయ్యావ్. ఇంత సంసారంతో వెళ్ళి మొక్కు తీర్చుకోవాలంటే ఎంత ఖర్చు! వడ్డీతో సహా తన మొక్కు తీర్చుకొనేలా చేస్తాడా వడ్డి కాసుల వాడు! డబ్బుకి డబ్బు వడ్డీ అయితే సంతానానికి సంతానం వడ్డీ! పోనీ యిప్పటికైనా ఆ ఏడుకొండల వానికి అనుగ్రహం కల్గింది!" సంతోషించింది అనసూయమ్మ.

మొక్కులు తీర్చుకొనే శక్తి లేనప్పుడు మొక్కుకోవడం మానుకోవాలి!"

వ్యాఖ్యానించింది పార్వతి. కోడలు మాటలు అనసూయమ్మను చీకాకు పెట్టాయ్.

"అదేమిటమ్మా అలా అంటావ్! ఆ భగవద్దర్శనం ప్రాప్తం అయే ఘడియ వచ్చేవరకూ మనం ఎన్ని ప్రయత్నాలు చేసినా ఏదో ఒక అటంకం వస్తూనే వుంటుంది !" అంది.

"మన ప్రయాణానికి బెర్తులు కూడా రిజర్వు చేయించానమ్మా!" చెప్పాడు భాస్కరం.

"చాలా మంచి పని చేసావ్ బాబూ! మూర్తిబాబు పెళ్ళాం మళ్ళీ నెల తప్పిందట! చంకలో పిల్లాడితో చేసుకోలేక పోతుందిట. ప్లీడరుగారి పెద్దమ్మాయి పెద్దాపురం నుంచి నిన్ననే వచ్చింది. చెప్పింది. మీరు తిరిగి వచ్చేవరకూ మూర్తిబాబు దగ్గరుంటా. దారిలో సామర్లకోటలో నన్ను దింపెయ్. స్టేషన్కు రమ్మని నీ తమ్మునికి ఉత్తరం రాయి!"

"లేదమ్మా! నీక్కూడా టికెట్ రిజర్వు చేయించా! మనం అందరమూ కల్సి అలా కన్యాకుమారి వరకూ వెళదాం!"

భర్త మాటలకి ఆనందం పొందింది పార్వతి. అమితానందం పొందింది అనసూయమ్మ.

"అవునత్తయ్యగారూ! మీరుకూడా రావాలి!" అంది పార్వతి. కొడుకూ కోడలూ ప్రేమాను రాగాల్తో ఆహ్వానిస్తుంటే ఆనందార్ణవంలో మునిగి తేలింది అనసూయమ్మ. అయినా మొహమాట పడింది.

"ఎందుకు బాబూ! మనిషికి మనిషి తోడైతే బోలెడు ఖర్చు! మీరెళ్ళి రండి! ఆ భగవదనుగ్రహం నా కింకా కల్గలేదు!"

"లేదమ్మా! నువ్వు రావాలి! యాత్రాస్థలాలను చూడ్డానికి వెళ్ళినప్పుడైనా రైలు ఖర్చుల్ని నాలుగేళ్ళకో సారి ప్రభుత్వం భరిస్తుంది.... పై ఖర్చులు పెట్టుకొంటే చాలు! ఈ సంసారం, ఖర్చులూ ఇబ్బందులూ ఎప్పుడూ వుండేవే! అందరమూ కల్సి వెళదాం! కాదనకు!" పట్టు బట్టాడు భాస్కరం.

"మీరు నచ్చి తీరాలత్తయ్యగారూ! పిల్లల్తో నేను సాగలేను! కావేరిలో పుష్కర స్నానం చేద్దాం!" అంది పార్వతి.

కొడుకూ కోడలూ దైవ దర్శనానికి రమ్మని ఆప్యాయంగా ఆహ్వానిస్తూంటే వారి అనురాగానికి ముగ్ధురాలైంది అనసూయమ్మ. కానీ మరుక్షణంలో ఆమె మొహం వివర్ణమైంది. తన భర్త ఏడుకొండలవాని దర్శనం చేసుకొంటానని యిరవై సంవత్సరాల క్రితం మొక్కు కొన్నాడు- ఆ మొక్కు చెల్లకుండానే అతని కాలం చెల్లింది. భర్తతో పసుపు కుంకుమతో ఆ భగవంతుని దర్శించే మహా భాగ్యం తనకుదక్కలేదు. కష్టసుఖాల్లో పాలువంచుకుంటూ ముప్పయి అయిదు సంవత్సరాలు కల్సి జీవించిన భర్త తనను ఏకాకిని చేసి వెళ్ళిపోయాడు. ముత్తైదువుగా భర్తకన్నా ముందు పోయే భాగ్యం ప్రసాదించమని అనునిత్యం ఆ భగవంతుని ప్రార్థించేది. తన మొర వినలేదా వెంకటేశ్వరుడు ఇప్పుడు ఒంటరిగా దైవ దర్శనానికి వెళ్ళాలి. ఆమె కళ్ళు చెమర్చాయి.... ఎదురుగా భర్త లీలగా కన్పించి "వెళ్ళిరా!" అని అనుజ్ఞ యిచ్చినట్లు తోచింది. కొంగుతో కళ్ళు తుడుచుకొంది.

"ఏమ్మా? అలావున్నావేం?" కంగారుగా అడిగాడు భాస్కరం.

"చెప్పండత్తయ్యా, ఏమిటలా అయిపోయారు?"

ఆత్రుతగా అడిగింది పార్వతి.

"ఏం లేదమ్మా! మీ మావగారికొకప్పుడు పెద్ద జబ్బు చేసింది. తిరుపతి వచ్చి నీ దర్శనం చేసుకొంటామని అనాడు మొక్కుకొన్నాం. ఆ మొక్కుతీరకుండానే తన తనువు చాలించు కొన్నారు మీ మావగారు! వారులేకుండా యిలా వంటరిగా వెళ్ళాల్సి వస్తుందని ఎప్పుడూ ఊహించుకోలేదమ్మా."

దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది ఆమె.

ఆమె పరిస్థితికి ఆ యిద్దరూ బాధపడ్డారు.

"అవునమ్మా! నీ వన్నట్లు నాన్నగారికి భగవదను

గ్రహం కలుగలేదు. మనం ఏం చేయగలం!"

"ఇతర ఆలోచనలు పెట్టుకొని మనసు పాడు చేసు కోకండత్తయ్యా. మీరు కూడా వచ్చి తీరాల్సిందే. మావగా రెప్పుడో భగవంతుని సన్నిధిని చేరుకొన్నారు! ఊరడిం చాలని ప్రయత్నించింది పార్వతి.

"నువ్వు రాకపోతే ప్రయాణం మానేస్తాం." అని కొడుకు అనడంతో

"సరే బాబూ! అలాగే వెళదాం!" అని అనసూయమ్మ అనడంతో ఆ దంపతులు తృప్తి పడ్డారు.



ప్రయాణం మూడురోజులుందనగా ఆ యింట్లో హడా విడి ఎక్కువకాసాగింది. దారిలో తినడానికి పూరీలూ, జంతి కలూ, చేగోడీలూ చేశారు అత్తా కోడళ్ళు. పిల్లల హడావిడి మరీ ఎక్కువైంది తమ స్నేహితులందరితోనూ చెప్పి వచ్చారు. మర్నాడుదయం ప్రయాణం.సామాన్లూ బట్టలూ సర్దుకోవడం అయింది. సామాన్ల సంఖ్య అతి తక్కు వగా వుండాలని భాస్కరం ఎంత హెచ్చరించినా తగ్గ లేదు. సర్దిందే మళ్ళీ సర్దడం........ఆ రాత్రి మూలనున్న కర్రపెట్టిని ముందుకు లాగి అందులోని సామాన్లని ఒక్కొక్కటీ బయటకు తీసి వెతకడం ప్రారంభించాడు భాస్కరం. తాను వెతుకుతున్న వస్తువు ఎక్కడా కనబడక పోవడంతో సామాన్లన్నింటినీ చిందరవందరచేసాడు. చీకాకు ఎక్కువైంది.

"ఏవిటండీ సామాన్లన్నీ అలా బయట పారేస్తు న్నారు. మళ్ళీ ఎవరు సర్దుతారు?" గదిలో ప్రవేశిస్తూ విసుక్కొంది పార్వతి. భర్త మాట్లాడకపోవడంతో

"ఏం కావాలండి? " మళ్ళీ అడిగింది.

మొహానికి పట్టిన చెమటను పైమీది తువ్వాల్తో తుడుచు కొన్నాడు భాస్కరం.

"నాన్నగారి తిరుపతి మొక్కు వెండికడియం వుండాలి! కనబడ్డం లేదు!" అన్నాడు.

భర్త మాటలకి గతుక్కుమంది పార్వతి.

"అదా!" అని ఆగింది.

తలెత్తి భార్య వంక చూసాడు భాస్కరం.

"తీసావా?"

"ఆ!"

"ఏది? ఎక్కడపెట్టావ్? ఇలాతే! హుండిలో వేయాలి!" లేచి నుంచున్నాడు భాస్కరం.

"లేదు!" అంది పాలికగా.

భార్య జవాబుకి గతుక్కుమన్నాడు.

"లేదా? ఏమైంది?"

"నాలుగు తులాలైనా వుంటే బాగుండదని అందరూ అంటే దాన్నికూడా చేయించి మన రోహిణి పట్టీలుమీద వేసా నండి!" నానుస్తూ భయంగా చెప్పింది.

నిశ్చేష్టుడయ్యాడు భాస్కరం.



భాస్కరం తండ్రి పార్థసారధిగారు ఎలిమెంటరీ స్కూలు హెడ్మాష్టరు. నలుగురు మగపిల్లలూ యిద్దరాడ పిల్లలూ సంతానం. పెద్దవాడు భాస్కరం. ఆ రోజుల్లో పార్థ సారధిగారి జీతం వంద రూపాయలకి మించి వుండేది కాదు. సంసారం గడవడం కష్టంగా వుండేది. అయిదు మైళ్ళ దూరంలో వున్న తుని హైస్కూల్లో పిల్లల్ని చదివించారు. భాస్కరం మంచి మార్కుల్తో ఎస్సెల్సీ పాసయ్యాడు. కాలే జీలో చేరుతానన్నాడు. తండ్రి వద్దన్నాడు. ఆర్థిక పరిస్థితి బాగులేదన్నారు. కాలేజీలో చేరుతానని రెండు నెలలు పేచీ పెట్టాడు భాస్కరం. నాన్నగారు మరో రెండు సంవత్సరాల్లో

రిటైర్ కాబోతున్నారనీ తన కాలేజీ చదువు పూర్తికాదనీ, మధ్యలో ఆపేయాల్సి వస్తుందనీ తండ్రి రిటైర్ అయ్యే లోగా వుద్యోగం సంపాదించుకొని సంసారాన్ని ఈడ్చే బాధ్యత చేపట్టాలనీ నచ్చ చెప్పింది తల్లి. తన కోరికను చంపుకొని వుద్యోగాన్వేషణ ప్రారంభించాడు భాస్కరం. పెద్ద మార్కులతో పాసవడంవల్ల టెలిగ్రాఫ్ డిపార్టుమెంటులో ఏ కష్టం లేకుండా గుమాస్తావుద్యోగం లభించింది. భాస్కరం వుద్యోగంలోచేరిన సంవత్సరానికే తండ్రిరిటైర్ అయ్యాడు. ఆ సంసారాన్ని పోషించే బాధ్యత భాస్కరంమీద పడింది. సర్వీసులో వుండగానే పెద్ద కూతురికి పెళ్ళి చేశారు పార్థసారథిగారు. ఆఖరున అమ్మాయి పుట్టింది. ఆమె పెళ్ళికి అంత తొందరలేకపోయినా ఆ పెళ్ళి జరిపించే బాధ్యత భాస్కరానిదే. అందరూ విశాఖపట్నం చేరుకొన్నారు. కాలేజీవున్న పట్నంకాబట్టితమ్ముళ్ళకి కాలేజీ చదువులు చెప్పించాడు. వాళ్ళందరికీ ఉద్యోగాలయ్యాయ్. ఆఖరి చెల్లికి అన్నదమ్ములంతా సమిష్టిగా పెళ్ళి చేసారు. ఇప్పుడు ఎవరి సంసారాలు వాళ్ళవి. విశాఖపట్నం వెళ్ళిన సంవత్సరానికే పార్థసారథిగారు పోయారు. పెద్దబ్బాయి పెళ్ళి మాత్రమే చూడగలిగారు.

అందర్నీ ప్రయోజకుల్ని చేసే సరికి భాస్కరానికి సగం సర్వీసు అయింది. నలుగురు పిల్లలు పుట్టారు. ఆర్థిక స్థితి అధ్వాన్నం అయింది.

అతనికి బాగాగుర్తు...తండ్రికి టైఫాయిడ్ వచ్చింది. గ్గింది. మళ్ళీ తిరగ బెట్టింది. బ్రతుకుతాడన్న ఆశలేదు డాక్టరు కూడా పెదవి విరిచారు. అప్పుడు తల్లి మ్రొక్కుకొంది, భర్తతో తిరుపతి వచ్చి నీ దర్శనం చేసు కొంటానని. భర్తకు కుడిచేతికి వెండి కడియం వేయించింది. తానే వెళ్ళి చేయించి తెచ్చాడు. అప్పుడు తనకిపదిహేను సంవత్సరాలు. వారి మొరాలకించాడు ఏడుకొండలవాడు. పార్థసారథిగారు బతికి బయటపడ్డారు. తండ్రిచేతిని కడియం అలాగే వుండి పోయింది. మ్రొక్కు చెల్లించుకొనే శక్తి లేక పోయింది.

భాస్కరం పినమామగార్కి మద్రాసులో వుద్యోగం. పెళ్ళయిన కొత్తలో పండక్కిరమ్మని ఆహ్వానించారు. భార్యతో బయలుదేర్తూ, తల్లినీతండ్రినీ కూడారమ్మన్నాడు. అక్కడికి తిరుపతి దగ్గరేకాబట్టి మ్రొక్కు తీర్చుకోవచ్చునన్నాడు.

"కొత్త దంపతులు! మీతో మేం ఎందుకు? హాయిగా మద్రాసూ అవీ తిరిగి రండి! మరోసారి వెళ్దాం." అన్నారు పార్థసారథిగారు. తల్లిని బ్రతిమాలాడు భాస్కరం.ఆమెకూడా అలానే అంది. ఆనాడు అవకాశాన్ని చేజేతులావదులు కొన్నారు. ఆయనగతించి అయిదేళ్ళయింది. మ్రొక్కు తీరకుండానే గతించారు పార్థసారథిగారు.

ఆరోజు ఆ సంఘటన తనకింకా కళ్ళముందుకద లాడ్తూవుంటుంది. తండ్రి శవాన్ని కట్టెలమీద వుంచారు. శరీరంమీద ఒక్క నూలు పోగు కూడా లేకుండా తొలగించారు. మనిషి ఎలాపుట్టాడో అలానే దహన పరచ బడాలన్నారు అపర కర్మలు చేయించే వెంకయ్యగారు.... తండ్రి శవం మీద పుల్లలు పేరుస్తూంటే నీరు నిండిన కళ్ళతో ఆ బొందెను ఆఖరిసారిగా చూసాడు.

"ఆగండి!" అని కేకవేసాడు.

అంతా ఆశ్చర్యంగా అతనివైపు చూసారు.

"ఏం బాబూ?" అడిగారు వెంకయ్యగారు.

"నాన్నగారి చేతికి వెండి కడియం వుండిపోయింది." అన్నాడు చితికి దగ్గరగా నడుస్తూ.

"ఇంకెక్కడి నాన్నగారు బాబూ! అది వారి బొంది మాత్రమే! భార్య పిల్లలూ-అన్న మమకారాలకి అతీతులు!" అన్నారు వెంకయ్యగారు.

"అది కాదండి! అది వారి మొక్కుబడి కడియం. దాన్ని బయటకు తీయించండి! వారి మొక్కును నేను తీరుస్తా" అన్నాడు భాస్కరం.

పిచ్చివాణ్ణి చూసినట్లుగా చూసారు వెంకయ్యగారు.

"మీ నాన్నగారి ఆత్మ ఎప్పుడో భగవత్సన్నిధిని

చేరుకొంది బాబూ ! ఇక మొక్కుబడుల్తో నిమిత్తంలేదు. దాన్ని కూడా ఆ బొందితోనే భస్మంగానీ!" అన్నారు.

భాస్కరం ఒప్పుకోలేదు. అతనితో వాదించి లాభం లేదని గ్రహించారు వెంకయ్యగారు. వేసిన కట్టెలను తొలగించి కడియాన్ని తీయించి భాస్కరానికి అందించారు. ఆ కడియాన్ని జాగ్రత్తగా దాచాడు భాస్కరం. అది యిప్పుడు లేదు. తండ్రి మొక్కును తాను తీర్చలేడు. మనసు బాధ పడింది. అర్ధాంగి మీద అమితమైన ఆగ్రహం వచ్చింది. పోయిన కడియం ఎలాగూ తిరిగి రాదు. నిగ్రహించుకొని ఆగ్రహాన్ని దిగమింగుకొన్నాడు అతి కష్టంమీద.

"ఊ ! సరేలే !" అన్నాడు బరువుగా.

ఏ తుఫాను చెలరేగుతుందోనని భయపడ్డ పార్వతి తేలిగ్గా నిట్టూర్పు విడిచింది.

శుక్రవారం రాత్రి ఎనిమిది గంటలకల్లా ఎగువ తిరుపతి చేరుకొన్నారు. కాటేజిని బుక్ చేసాడు భాస్కరం. వారి అదృష్టం కొద్దీ పుష్కరణి కెదురుగా గుడికి దగ్గరగా దొరికింది. తెల్లవారుఝామున నాలుగ్గంటల కల్లావెళ్తే భక్తుల క్యూ అంత పెద్దదిగా వుండదని ఎవరో చెప్పారు. నాలుగ్గంటలకి ముందుగానే వెళ్ళాలని నిశ్చయించు కొన్నారు. ప్రయాణపు బడలికవల్ల తల్లీ, భార్యా పిల్లలూ ఆదమరచి నిద్రపోయారు. భాస్కరానికి మాత్రం నిద్ర రాలేదు. పెళ్ళాన్ని లేపి తలుపు వేసుకోమని చాపతో వీధి అరుగు మీదకు వచ్చాడు.

ఎదురుగా వెంకటేశ్వరుని గుడిగోపురం రంగురంగుల దీపాలతో కాంతులను విరజిమ్ముతోంది. ఆ గోపురాన్ని చూస్తే చాలు భక్తిభావం పుట్టుకొస్తుంది. భగవంతుని విగ్రహం లీలామాత్రంగా దర్శన మిస్తుంది. ఎప్పుడు దర్శించి తిరిద్దామా అని ఎద తొందర చేస్తుంది. చాప వేసు కొని కూర్చున్నాడు భాస్కరం. అతనికి ఒకటే విచారం. తండ్రి మొక్కు తీర్చలేని తనయుడు తాను. అవకాశం వచ్చి కూడా ముడుపు చెల్లించలేని పుత్రుడు. ఆ కడియానికి బదులుగా వంద రూపాయలు హుండీలో వేసినా మొక్కు చెల్లించానన్న తృప్తి వుండదు. నిద్రరాక ఆ గోపురాన్ని దర్శిస్తూ ఎంతో కాలం గడిపాడు. ఎప్పుడు నిద్ర పట్టిందో తెలీను.

రెండు గంటలకల్లా అత్తా కోడళ్ళిద్దరూ లేచారు పిల్లల్ని లేపారు. పుష్కరణిలో స్నానానికి బయలుదేరారు. గదికి తాళం వేసి భాస్కరాన్నిలేపారు. నిద్రపోతూన్న రోహిణిని భర్త పక్కలో పరుండబెట్టింది పార్వతి.

"పిల్లలూ మేమూ స్నానంచేసివస్తాం. మేం వచ్చాక మీరూ రోహిణీ వెళుదురు గాని." అంటూ భర్త చేతికి గది తాళాలు అందించింది పార్వతి. తాళాలు అందుకొన్నాడు భాస్కరం. నాలుగడుగులు వేసి వెనక్కు వచ్చి భర్తను మరోసారి హెచ్చరించింది. తాళాలు జాగ్రత్త! రోహిణి కాళ్ళకు పట్టీలున్నాయ్. నిద్రపోకండి."

తల్లీ భార్యా పిల్లలూ వెళుతున్న వైపే చూస్తూ వుండి పోయాడు భాస్కరం. నిద్ర మత్తులో రోహిణి తన కాళ్ళను తండ్రి వడిలో పెట్టింది. పట్టీలకున్న మువ్వలు గల్లు మన్నాయ్. పట్టీలను చేత్తో తడిమాడు భాస్కరం.

ఎంత పిచ్చివాడుతను. తండ్రి మొక్కుబడి కడియం అదే. ఆ కడియమే చెరిపించబడి ఆకారం మార్చబడింది.

వడ్డీకాసులవాడు సార్థక నామము. వడ్డీతో సహా తన మొక్కు చెల్లింపబడేలా చూస్తాడు. తులం కడియం నాలుగు తులాలుగా వృద్ధి పొందింది. తన తల్లి అన్నట్టు డబ్బుకి డబ్బు, సంతానానికి సంతానం వడ్డీఅయినట్టు వెండికి వెండి వడ్డీ. అసలు వృద్ధులు కలిసి నాలుగు తులాలు.

నాలుగ్గంటలయ్యే సరికి అంతా ఆలయప్రాంగణంలో అడుగు పెట్టారు. భక్తుల క్యూ వున్నా అంత పెద్దదిగాలేదు. కొంతసేపు తనతో వుంచుకొని కూతుర్ని భర్తకు అందించింది పార్వతి. కూతుర్ని భుజాన వేసుకొన్నాడు భాస్కరం. పదేసి రూపాయి కాసుల్ని పొట్లాలుగా కట్టి ఒక్కొక్కరికి ఒక్కో పొట్లాం అందించాడు హుండీలో వేయమని. భాస్కరం ఒక పొట్లాన్ని అదనంగా వేసి తండ్రి మొక్కు చెల్లించాడు.

దైవ దర్శనం ముగించుకొని తెలతెల వార్తుండగా కాటేజీ చేరుకొన్నారు. భుజంమీద నిద్రపోతున్న కూతుర్ని క్రిందకి గించి తాళం తీసాడు భాస్కరం. కూతురి పాదాలు పట్టీలు లేకుండా బోసిగా వుండటంచూసి గొల్లుమంది పార్వతి.

"అయ్యో! పిల్ల పట్టీలు పోయాయండి."

"ఎలా పోతాయే. గదిలో పక్కలోపడిపోయాయేమో చూడు" అంది అనసూయమ్మ కంగారు పడ్తూ.

"క్యూలో మీ అబ్బాయిగారి కందించిచవప్పుడున్నా యండి. ఎవరో కాజేసారు. అసలే వదులుగా వున్నాయి వంద రూపాయలు. ముచ్చట పడితే చేయించా! రెండు వారాలు కూడా కాలేదు."

రాగాలు తీయనారంభించింది.

తనయుడు ఏమీ మాట్లాడక పోవడంతో అడిగింది అనసూయమ్మ.

"ఏరా బాబూ! పట్టీలు తీసి దాచావా?"

"అవి మనవి కాదు! మన నుంచి పోయాయ్! అదీ ఒక మొక్కుబడే! తీరిందను కొందాం!" అని నిశ్చింతగా వేదాంతిలా భర్త అంటూంటే అచ్చెరు వొందింది పార్వతి.

"మీకేం! దాని హంగు పోయిందని నేనేడుస్తూంటే! మళ్ళీ చేయించు కోవాలంటే ఎన్ని జన్మలెత్తాలి?"

"అక్కర్లేదు పార్వతీ! ఈజన్మలోనే ఈరోజే కొండ దిగ్గానే యిక్కడే కొంటా! సరా?" అని భర్త భరోసా ఈయడంతో రాగాలు కట్టింది పార్వతి.

ఆ సాయంత్రం పరిక్రొత్త డిజైన్‌లో క్రొత్త పట్టీలను కొంది.



డా. ఆర్. శ్రీహరి

# పునర్ముద్రిత సూర్యరాయాంధ్ర నిఘంటువు - ఒక పరిశీలన

ఆంధ్రప్రదేశ ప్రభుత్వ ఆర్థిక సాహాయ్యంతో సూర్య రాయాంధ్రనిఘంటువు పునర్ముద్రణానికి ఏర్పాట్లు జరగడం, ఆం. ప్ర. సాహిత్య అకాడెమీ బాధ్యతలో ఇప్పటికి నాలుగు సంపుటాలు వెలుగులోనికి రావడం చాలా సంతోష దాయకం.

నిఘంటువు శబ్దస్వరూపాన్ని నిర్దుష్టంగా చూపవలసి ఉంటుంది. కావ్యాల్లోనో, నవలల్లోనో అక్షరదోషాదులున్నప్పుడు పరిత సవరించడానికి అవకాశముంటుది. కాని నిఘంటువులో చూపబడ్డ ప్రతిశబ్దస్వరూపమూ ప్రామాణిక మనే గాఢమైన విశ్వాసం జిజ్ఞాసువులకు ఉంటుంది. ఆ దృష్టితో సూర్యరాయాంధ్ర నిఘంటువు మలిముద్రణాన్ని చూసినప్పుడు అనేకస్థలాల్లో శబ్దరూపాలు అసాధురూపాల్లో దర్శనమిస్తూ నిరాశను కలిగిస్తున్నాయి.ఐతే వీటినన్నింటినీ అచ్చుతప్పులని తేలికగా తీసివేయడం సబబుకాదేమో!

పూర్వముద్రణంలోని అనుబంధభాగాన్ని మలిముద్రణంలో ప్రధానగ్రంథభాగంలో చేర్చడం, అచ్చుతప్పులను తొలగించడం – ఈరెండూ పునర్ముద్రణంలో జరిగిన మార్పులని మలిద్రణంలోని తొలివలుకువల్ల తెలుస్తుంది. ఐతే పూర్వముద్రణంలోని అచ్చుతప్పులెంతవరకు సవరింపబడ్డవో కాని కొత్తతప్పులు మాత్రం పునర్ముద్రణంలో ఎన్నో చోటుచేసుకోవడం చాలా బాధను కలిగిస్తుంది.

మలిముద్రణాన్ని ఆయాసందర్భాల్లో సంప్రదిస్తున్నప్పుడు ఎన్నో దోషాలు కనిపించినాయి. ఈవ్యాసంలో నేను పేర్కొన్న దోషాలన్నీ పూర్వముద్రణంలో లేనివే. మే ఇవి నిర్దుష్టమైన శబ్దస్వరూపాన్ని తెలుసుకోదలచుకునే జిజ్ఞాసువులను వెడత్రోవపట్టించేవిగా ఉన్నాయి. కనుకవాటిని సాహిత్యాభిమానుల దృష్టికి తేవడం నా విధిగా భావిస్తున్నాను. అంతే కాని పురోభాగితాదృష్టితో మాత్రం కాదు

ఇక మలిముద్రణంలోని దోషాలను పరికించండి.

లింగాది నిర్దేశంలో దోషాలు

మొదటి వాల్యూమ్

| పేజీ | ఆరోపం | చూపబడ్డ లింగాది నిర్దేశం | చూపవలసిన లింగాది నిర్దేశం |
|---|---|---|---|
| 20 | అంజలి | అ. పుం. | ఇ పుం |
| 48 | అంభోధి | అ. పుం. | ఇ. పుం. |
| 74 | అగ్రపాణి | ఈ. పుం. | ఇ. పుం. |
| 76 | అచతురము | అ. ఈ. అ. | అ ఆ. అ. |
| 117 | అతివక్త్రము | ఇ. పుం. | అ. పు. |
| 119 | అతిమోద | ఇ. స్త్రీ. | ఆ. స్త్రీ. |
| 143 | అధ్యవసాయము | అ. న. | అ. పుం. |
| 144 | అధ్యాహరణము | ఇ. న. | అ. న. |
| " | అధ్వరకల్ప | ఇ. స్త్రీ. | ఆ స్త్రీ. |
| 158 | అనీతి | ఆ. స్త్రీ | ఇ. స్త్రీ |
| 166 | అనునాదము | ఇ. పుం. | అ. పుం. |
| 179 | అనౌచిత్యము | ఇ. న. | అ. న. |
| 215 | అభివత్తి | ఆ. స్త్రీ. | ఇ స్త్రీ. |
| 218 | అభిరక్ష | ఇ. స్త్రీ. | ఆ. స్త్రీ. |

| | | | |
|---|---|---|---|
| 212 | అభిఘాతి | ఆ. పుం. | స. పుం. |
| 224 | అభూతి | ఆ. స్త్రీ. | ఇ. స్త్రీ. |
| 225 | అభ్యర్థ్గణ | ఇ. స్త్రీ. | ఆ. స్త్రీ. |
| 230 | అమరి | ఇ. స్త్రీ. | ఈ. స్త్రీ. |
| 235 | అమృతప్రసవ | ఇ. స్త్రీ. | ఆ. స్త్రీ. |
| 246 | అరణ్యషష్ఠి | ఊ. స్త్రీ. | ఈ. స్త్రీ. |
| 253 | అరుణసారథి | ఉ. పుం. | ఇ. పుం. |
| 288 | అవగమము | ఇ. పుం. | అ. పుం. |
| 306 | అవబోధము | ఉ. పుం. | అ. పుం. |
| 308 | అవరుద్ధి | ఈ. స్త్రీ. | ఇ. స్త్రీ |
| 337 | అసుర సంధ్య | ఇ. స్త్రీ. | ఆ. స్త్రీ. |
| 388 | ఆనిలి | అ. పుం. | ఇ. పుం. |
| 328 | అష్టపదిక | ఈ. స్త్రీ. | ఆ. స్త్రీ. |
| ” | అష్టమూర్తి | అ. పుం. | ఇ. పుం. |
| 388 | ఆనీతి | అ. స్త్రీ | ఇ. స్త్రీ. |
| 429 | ఆలాపిని | ఆ. స్త్రీ. | ఈ. స్త్రీ. |
| 431 | ఆలుంచితము | అ. ఆ. అ. | అ. ఈ. అ |
| 433 | ఆలోచన | ఇ. స్త్రీ. | ఆ. స్త్రీ. |
| 437 | ఆవర్తమణి | అ. పుం. | ఇ. పుం. |
| 447 | ఆశ్వయుజి | ఇ. స్త్రీ. | ఈ. స్త్రీ. |
| 566 | ఉత్తరదోఃకరము | ఇ. న. | అ. న. |
| 581 | ఉదరిణి | ఇ. స్త్రీ. | ఈ. స్త్రీ. |
| 536 | ఉద్ఘట్టము | అ. స్త్రీ. | అ. పుం. |
| 553 | ఉజ్జయిని | ఇ. స్త్రీ. | ఈ. స్త్రీ. |
| 620 | ఉపశ్రుతి | ఆ. స్త్రీ. | ఇ. స్త్రీ. |
| 626 | ఉపాయము | ఇ. పుం. | అ. పుం. |
| 627 | ఉపాసన | ఇ. స్త్రీ. | ఆ. స్త్రీ. |
| 627 | ఉపానహము | హ్. పుం. | హ్. స్త్రీ. |
| 643 | ఉరశ్ఛదము | ఉ. పుం. | అ. పుం. |

రెండోవాల్యూమ్

| | | | |
|---|---|---|---|
| 75 | కనకప్రసవ | అ. స్త్రీ. | ఆ. స్త్రీ. |
| 103 | కప్యాఖ్యము | ఉ. పు. | అ. పుం. |
| 122 | కరశాఖ | అ. స్త్రీ | ఆ. స్త్రీ. |
| 156 | కలాదుడు | ఇ. పుం. | అ. స్త్రీం. |
| 203 | కాకువు | ఉ. స్త్రీ. | ఊ. స్త్రీ |
| 219 | కామవల్లభుడు | ఇ. పుం. | అ. పుం. |
| 294 | కుదారము | ఇ. పుం. | అ. పుం. |
| 527 | క్లిష్టి | ఈ. స్త్రీ. | ఇ. స్త్రీ. |

మూడో వాల్యూమ్

| | | | |
|---|---|---|---|
| 338 | జతుమణి | అ. పుం. | ఇ. పుం. |
| 607 | తర్జన | ఈ. స్త్రీ. | ఆ. స్త్రీ. |

నాలుగో వాల్యూమ్

## స్త్రీలింగరూప నిర్దేశంలో దోషాలు

మొదటి వాల్యూమ్

| పేజీ | ఆరోపం | చూపబడ్డ స్త్రీలింగ రూపం | చూపవలసిన స్త్రీలింగ రూపం |
|---|---|---|---|
| 151 | అనాకారి | అనాకారినీ | అనాకారిణీ |
| 165 | అనుదరుడు | అనుదరీ | అనుదరా |
| 176 | అనుషంగి | అనుషంగినీ | అనుషంగిణీ |
| 177 | అనుసంధాయి | అనుసంధాయిణీ | అనుసంధాయినీ |
| 211 | అభికాంక్షి | అభికాంక్షినీ | అభికాంక్షిణీ |
| 256 | అరోచకి | అరోచకిణీ | అరోచకినీ |
| 305 | అవనామి | అవనామిణీ | అవనామినీ |
| 577 | ఉత్సాహి | ఉత్సాహిణీ | ఉత్సాహినీ |
| 624 | ఉపహారి | ఉపహారినీ | ఉపహారిణీ |

రెండో వాల్యూమ్

| | | | |
|---|---|---|---|
| 248 | కాష్ఠి | కాష్ఠిణీ | కాష్ఠినీ |

నాలుగో వాల్యూమ్

| | | | |
|---|---|---|---|
| 340 | దేశి | దేశిణీ | దేశినీ |
| 340 | దేశాంతరి | దేశాంతరినీ | దేశాంతరిణీ |

## ఆరోపంలో దోషాలు

### మొదటి వాల్యూమ్

| పేజీ | ఉన్న రూపం | ఉండవలసినరూపం |
|---|---|---|
| 29 | అంతఃపురి | అంతఃపురి |
| 32 | అంతర్ధాత | అంతర్ధాత |
| 59 | అక్షరము | అక్షరము |
| 72 | అగ్నిదీప్త | అగ్నిదీప్తి |
| 104 | ఆడియాలము | ఆడియాలము |
| 114 | అణువ్రీహి | అణువ్రీహి |
| 143 | అధ్యస్థ | అధ్యస్థి |
| 144 | అధ్యాఘ్ని | అధ్యాఘ్ని |
| 154 | అనావృత్తి | అనావృష్టి |
| 156 | అనిర్వచనీయుడు | అనిర్వచనీయము |
| 161 | అనుకర్షము | అనుకర్షణము |
| 169 | అనుమాత్ర | అనుమాత |
| 170 | అనుయూత | అనుయాత |
| 212 | అభిఘూణము | అభిఘూణము |
| 220 | అభివిశ్రుతుడు | అభివిశ్రుతుడు |
| 220 | అభివిక్షించు | అభివీక్షించు |
| 221 | ఆభిషంజనము | అభిషంజనము |
| 221 | ఆభిష్యంది | అభిష్యంది |
| 255 | అరుషము | అరుసము |
| 321 | అవోషము | అవోదము |
| 328 | అష్టమానము | అష్టమానము |
| 328 | అష్టపదిక | అష్టపది |
| 333 | అపదద్వైతి | అసదద్వైత |
| 446 | ఆశౌషము | ఆశౌచము |
| 474 | ఇక్షుధర్భ | ఇక్షుదర్భ |
| 478 | ఇచ్ఛ | ఇచ్ఛ |
| 479 | ఇచ్ఛగించు | ఇచ్ఛగించు |
| 480 | ఇచ్ఛగింత | ఇచ్ఛగింత |
| 481 | ఇచ్చోటు | ఇచ్చోటు |
| 481 | ఇచ్చోటు | ఇచ్చోటు |
| 490 | ఇందతనుడు | ఇదంతనుడు |
| 491 | ఇధ్మప్రవృశ్చనము | ఇధ్మప్రవశ్చనము |
| 512 | ఇష్టాపతి | ఇష్టాపత్తి |
| 549 | ఉచ్ఛంధ్రము | ఉచ్ఛంద్రము |
| 550 | ఉచ్చారము | ఉచ్చారము |
| 550 | ఉచ్చారణీయము | ఉచ్చారణీయము |
| 550 | ఉచ్ఛింగటుడు | ఉచ్ఛింగటుడు |
| 549 | ఉచ్ఛగిత్త | ఉచ్ఛగిత్త |
| 549 | ఉచ్ఛనీచము | ఉచ్ఛనీచము |
| 552 | ఉచ్ఛేధనీయము | ఉచ్ఛేదనీయము |
| 554 | ఉద్చలము | ఉచ్ఛలము |
| 554 | ఉజ్వలనము | ఉజ్వలనము |
| 564 | ఉత్క్రోషము | ఉత్రోశము |
| 586 | ఉఘటము | ఉద్ఘటన |
| 587 | ఉద్ఘాటము | ఉద్ఘాటకము |
| 588 | ఉద్ధరి | ఉద్దరి |
| 587 | ఉడుకె(వె)కెత్తు | ఉడుకెత్తు |

### రెండో వాల్యూమ్

| | | |
|---|---|---|
| 118 | కరఠాంభస్సు | కరకాంభస్సు |
| 126 | కరువర్వలిము | కరువలి |
| 201 | కాకముద్ధ | కాకముద్గ |
| 328 | కులిశుడు | కులికుడు |
| 231 | కార్ష్ణము | కార్ష్ణ్యము |

ఇంతవరకూ పూర్వముద్రణంలో లేకుండా పునర్ముద్రణంలో చోటు చేసుకున్న దోషాలను పేర్కొనడం జరిగింది. పూర్వ ముద్రణంలోనూ, మలి ముద్రణంలో ఉన్నన్ని కాక

పోయినా-కొన్ని దోషాలు అక్కడక్కడా లేకపోలేదు. వాటిని మలిముద్రణంలో యథాతథంగా గ్రహించడంకంటె సంస్కరించి చూపి ఉంటే బాగుండేది.

అటువంటి పదాలను కొన్నింటిని దిగువ పేర్కొంటున్నాను.

ఒకటో వాల్యూమ్

| పేజీ | ఆరోపం | పూర్వముద్రణంలోని నిర్దేశం | మలిముద్రణంలో చూపవలసిన నిర్దేశం |
|---|---|---|---|
| 30 | అంతరగ్ని | అ. పుం. | ఇ. పుం. |
| 306 | అశ్మకేతువు | అ. పుం. | ఉ. పుం. |
| 325 | అశ్రుపాతము | అ. న. | అ. పుం. |
| 367 | ఆజి | ఇ. స్త్రీ. | ఇ. పుం. |
| 411 | ఆరివ్స | ఉ. స్త్రీ. | ఆ స్త్రీ. |
| 610 | ఉపనగరము | అ. పుం. | అ. నపుం. |

నాలుగో వాల్యూమ్

| | | | |
|---|---|---|---|
| 191 | దధి | ఇ. పుం. | ఇ. నపుం. |
| 324 | దృషత్ | త్. స్త్రీ. | ద్. స్త్రీ. |
| 405 | ధర్మువు | ఉ. పుం, | అ. పుం |

ఆధునిక కాలంలో ముద్రణ సౌకర్యాదులెన్నో పెరిగినప్పటికీ పునర్ముద్రణంకంటె పూర్వ ముద్రణమే మెరుగు అనే భావం కలిగేట్టుగా ప్రాచీన గ్రంథాలు ప్రకటింపబడుతున్నాయి. అందులోనూ నిఘంటువుల ముద్రణ ఈ రకంగా సాగితే జిజ్ఞాసువులకెంత ప్రమాదమో సహృదయులు ఊహించవచ్చు.

కనుక కనీసం రాబోయే భాగాల్లోనైనా పైన పేర్కొన్న దోషాలవంటి దోషాలకు చోటులేకుండా నిఘంటువు నిర్దుష్టంగా ఉండేట్లు చూడడం అవసరమని సవినయంగా మనవి చేసుకుంటున్నాను.



# పూజారిని!

శ్రీ. ఎస్. సంజీవ్

నా హృది
గతమనే కన్నీటికి
తడిసి,
నిశ్శబ్దపు
నిశరాతిరికి
జడిసి,
నువ్వున్నావనే
భావనకు
భ్రమసి,
నీటిపైని అలలైన
నీ ఊసులకై
అన్ని అడియాసలైన
మన బాసలకై
కన్నీళ్ళు ఇంకిపోయేలా విలపించి.,
విలాపంలోనూ
వలపును వెదజల్లే
నీ కనుదోయికై
ఎడదలోని అలజడిలోనూ
నాకు ప్రశాంతతనిచ్చే
నీ సాన్నిధ్యానికై
దోసిట సిరిమల్లెలు పోసి
కౌగిట కౌముదిని చేసి
అనుభూతుల మాలను
నీ మెళ్ళోవేయాలని,
స్పందనల గంధాలతో
నీ పూజ చేయాలని
కనులు కాయలు కాచినా,
నీకై కాచుకుని..
వేచి చూస్తోన్న అభిసారిని
నీ పూజారిని



# "ఒక్క నిశార్థమందు...."

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

ఉ॥ నాటి నిశార్థమందుతెలినవ్వులునవ్వుచునాకుటీర మం
దేటికొవచ్చిసామి! శయనించుచునుంటివియింతలోనపెన్
పేటులురేగునట్టిదగు పేరలు కంగనులందు నిప్పుకల్
కోటులుజారగాయెడదఘూర్ణిలరయ్యని నేనువచ్చితిన్!!

నేనుకృధామతిన్ నిలిచి నిన్గని గుండెలు మండిపోవగా
పూనిన కర్కశత్వమునఁబోరున తిట్టితి నప్డు నంతసే
పీ నను జాలిఁగన్గొని రహించెడు సన్నని నవ్వుతోడనే
నానవమాధురీ ప్రణయ! నాప్రభు! నిల్చితివీవుమౌనివై !!

నాపాండిత్యము, నాకవిత్వరచనా వై పుణ్యమున్, నాసుధా
శ్రీపాటచ్చరమైన వాఙ్మహిమ, రాశీభూతమై మాయమై
నో! పాపోహలుదట్టమైఁగవిసెనో! యోస్వామి! నిన్నెంతగా
కోపోద్దీపితుడౌచు గ్రుచ్చితినొ! వాగ్రూపాగ్నిశస్త్రంబు
లన్!!

కారణమేదిలేక యొక గాథ కృధావిల గర్వభావనా
వారిధిలోన తూగి బహుభంగులదూరితి దూఱిదూఱి క్రాం
జీరయువారు గొంతున వచించెడువల్కులుగద్గదంబుగా
మార, మహాభి మానమున మళ్లగఁగన్నుల నీరు,
వెక్కుచున్!!

భోరున యేడ్చనాడు భుజముల్ కుదిలెంచెడు నాత్మ
గేహినీ
సారమృదూక్తులందెలిసి స్వాప్నిక దారుణదుఃఖభావనం
దేలితి, నెంతకున్ తిరుగదీయగరాని మనంబు, బాష్పవాః
పూరితమైన నేత్రములు, పొర్లిన సిగ్గులుముంచి
యెత్తగన్ !!

నాప్రభు, నాదుస్వామి, మరినాదయితుండు, గురుండున్
మిత్రుడు..

నాప్రథమాప్తుడున్ మరియు నాహృదయాంతర కాంతి
వీచియున్

నాపృథుభావనా విమల నాక నదీ చల దూర్మికావసం
తీప్రియరాజహంసమును తెంపరినై యెటునొవ్వనాడితో!

ఏమి యపరాధమునకు నాకింత శిక్ష
నిచ్చితివి ప్రభు! నాచేతనిట్లునిన్ను
తిట్టగాఁజేసితివటంచు దీర్ఘచింత
అలమగా మీదు మిక్కిలి యలమటింప.

అమిత విచికిత్స బరువెక్కి నట్టి గుండె
లోని శాంతమ్ము జాగరమ్మైనిలంగ
ఆత్మగేహిని గుండెతోనవ ధరించి
ఇచ్చె సాంత్వన మృదువచోఽహీన మధువు.

ఓరటనొంది యొంది, నిజయోషయొసంగిన సాంత్వ
నంబుతో
లోరహియించు నెవ్వగయులుత్తముగాగ ప్రభాతవేళన
వ్యాకుణ పాదపద్మతల మందున నే శిరసంటి నిల్వగాఁ!
గూరిమిఁజేరదీసికనుగోనలునా కనులందు గ్రుచ్చుచున్!

పరమనవశైత్యమలయ జరసమైన
నిండు కౌగింట నన్బట్టి నీ కరాగ్ర
మునను మూర్ధంబుతాకి, ప్రేమను ఫలింప
జేసితివి! స్వామి! ధన్యునిఁజేసినావు!!



శ్రీ చేకూరి రామారావు

# పద నిర్మాణంలో భాషా దృష్టి

## (అన్నమాచార్యుల సంకీర్తనల పరిశీలన)

సర్వ భాషా వ్యవహారమూ వాక్య, వాక్యాంశాల ద్వారా జరుగుతుంది. సాహిత్య వ్యవహారంకూడా అంతే. అందరూ వాడేవి తెలుగు వాక్యాలయినా, అందరూ వాడే తీరు ఒకటికాదు. సాహిత్య భాషా భేదాలుకూడా సాహిత్య ప్రక్రియా భేదాల్ని బట్టి ఉంటాయి. అభిరుచి భేదాన్ని బట్టి వక్త వాచికంలో వక్రీకరణ భేదాలు వచ్చినట్టే సాహిత్యకారుని వ్యక్తిత్వాన్నిబట్టి కూడా శైలీ భేదాలు ఉంటాయి. అన్నమాచార్యులు వాడినవి తెలుగు వాక్యాలే అయినా అవి సాహిత్య వాక్యాలుగా మారిన తీరులో గుర్తించదగిన నిర్మాణ భేదం ఉంది.

అసలు మాట్లాడే భాషకూ రచనా భాషకూ కొన్ని భేదాలు ఉంటాయి. రచనా భాషలో ఉండే వాక్యాల క్రమ సంబంధం మాట్లాడే భాషలో ఉండకపోవచ్చు. రచనా భాష విషయంలో పదాల ఎన్నికలో, కూర్పులో, వాక్య క్రమ విన్యాసంలో రచయిత జాగ్రత్త వహిస్తాడు. దీన్నే 'ఎడిటింగ్' అంటారు. (తెలుగులో ప్రచురంగా ఉన్న 'సంపాదకుడు, సంపాదకత్వం' వంటి మాటలకూ దీనికీ సంబంధం లేదు.) ఈ ఎడిటింగ్ ప్రయోజనాలు చాలా ఉన్నాయి. సంక్షిప్తత, స్పష్టత వైశద్యం, సౌందర్యం, వీటిలో ఏ ప్రయోజనాలయినా సాధించటానికి ఎడిటింగ్ ప్రధాన మార్గం. ఇది సౌందర్య దృష్టితోచేస్తే సాహిత్యం అంటాం. అంటే, సౌందర్య దృష్టితో చేసే భాషా ప్రయోగం సాహిత్యం అవుతుంది. సాధారణ వ్యవహారం ప్రధానంగా నిత్య జీవితానికి పరిమితమై ఉంటుంది. అందువల్ల ఇది సాధారణ భాష. సాహిత్య భాష సాధారణ వ్యవహార ప్రయోజనాన్ని అధిగమిస్తుంది. ఈ అధిగమనం వాక్యాల నుంచి ధ్వనులవరకు, తాత్పర్యం వరకూ ఉండొచ్చు.

అందువల్ల సాహిత్య భాష సాధారణ వ్యవహారాతిరిక్తమైన భాష. సాహిత్య భాష సాధారణ భాషనుంచే పుడుతుంది. నిజానికి సాహిత్యభాష సాధారణ భాషకన్నా మౌలికంగా వేరుకాదు. అవే ధ్వనులు, అవే మాటలూ, అవే వాక్యాలు రెండిట్లలోనూ ఉండొచ్చు. కాని వాటికూర్పులో భేదం ఉంటుంది. ఈ భేదమే సాధారణ భాష నుంచి సాహిత్య భాషను వేరు చేస్తుంది. ధ్వనుల కూర్పువల్ల సాధించే అసాధారణతను చాలా సాహిత్యాలు గుర్తించినై. వాటిని వింగడించి రకరకాల శబ్దాలంకారాలుగా పేర్లు పెట్టుకొన్నారు. వాటినిక్కడ విస్తరించటం అనవసరం.

అట్లాగే చెప్పదల్చుకున్న అంశాలకు తెచ్చుకున్న పోలికలు మొదలైన వాటిలో అసాధారణతను రకరకాల అర్థాలంకారాలుగా ప్రాచీన సాహిత్య శాస్త్రాలు గుర్తించినై. ఇవి కాక శబ్దాలకూర్పు వల్ల వచ్చిన అసాధారణతను రీతులు, శయ్యలు, పాకాలు వంటి లక్షణాలుగా విశ్లేషించారు. శబ్దార్థాలకున్న సంబంధాల్ని అభిద, లక్షణ, వ్యంజన వంటి శక్తులుగా వర్ణించారు.

ఇవన్నీ సాహిత్య విద్యార్థులకు చిరకాలంగా సుపరిచితాలు. అందువల్ల వాటినిక్కడ వివరించటం లేదు.

వేరే పేర్లు పెట్టక పోయినా సాధారణ భాషలో కనిపించని శబ్దరూపాలు సాహిత్యంలో వాడి అసాధారణత సాధించవచ్చు. ఈ అసాధారణ శబ్దాలు ఇతరుల వ్యవహారం నుంచి కానీ, ఇతరభాష నుంచికాని, ప్రాచీన భాషనుంచికాని వస్తాయి. మనకు సాంప్రదాయికంగా వస్తున్న కావ్య భాష ఇట్లాంటిదే. ప్రాచీన కావ్యభాషకూ ఆధునిక వ్యవహార భాషకూ ప్రధాన భేదం ఇక్కడే ఉంది. వాక్య నిర్మాణంలో భేదాలున్నా అవి చాలా కొద్ది. ఈ భేదం ప్రధానంగా కొన్ని విభక్తుల ప్రయోగంలోనూ, కొన్ని పదాల క్రమంలోనూ ఉంటుంది. ఆధునికులు గ్రాంథికంగా వ్యవహరించే భాష ఇదే. భాషా ప్రయోగంలో తొట్టతొలుత నే మామూలు ప్రపంచంనుంచి భిన్న ప్రపంచంలో పెట్టే ప్రయత్నం ఈ గ్రాంథిక భాష ద్వారా జరుగుతుంది. అయితే సాధారణ భాషకు ఇది మరీ దూరమయితే అర్థబోధ కష్టంకావచ్చు. స్ఫూర్తి కలక్కపోవచ్చు. ఈ విషయంలో అన్నమాచార్యుల మార్గాన్ని భాషా మాధ్యమిక వాదం అనొచ్చు. సాంప్రదాయికంగా వస్తున్న కావ్యభాషను సంపూర్ణంగా అనుసరించిన వాడు కాదు. అట్లా అని సంపూర్ణంగా వ్యవహార భాష రాసిన వాడు కాదు.

ఆధునిక నాగరికత మూలంగా వ్యాప్తికి వచ్చిన ఒక రకం రచనా భాషను మనం వ్యావహారిక భాష అంటున్నాం. వ్యవహారం నుంచి ఉత్పన్నమైన భాష కనుక మాట్లాడే భాషకూ దీనికీ సాన్నిహిత్యం ఎక్కువ. ఈ రకమైన రచనా భాష 20 శతాబ్దిలో, మరీ ఇటీవలే ఏర్పడింది. మనకు దొరుకుతున్న ప్రాచీన కాలపు రచనా వ్యాసంగం (జానపద గేయాల్ని మినహాయించి) ప్రాచీన కావ్య భాషనుంచి ఉత్పన్నమయిందే. రచయితలు ఆశించిన ప్రయోజనాన్ని బట్టి అది మాట్లాడే భాషకు సన్నిహితంగా ఉండొచ్చు. అన్నమాచార్యులవారు కూడా, కావ్య భాషను మూలంగా చేసుకొని తన సంకీర్తనలను కూర్చారు. అయితే కావ్యభాషా సంప్రదాయంలో ఇమడని పదరూపాలు వాడటానికి ఆయన వెనుకాడలేదు. ముఖ్యంగా ఆయన వాడిన ప్రథమ, మధ్యమ పురుష రూపాలు కావ్య భాషలో కన్పించవు. 'సిగ్గయ్యీని, ప్రతి వచ్చీనా ? మాటవచ్చీ, జుమ్మీ, వీదులవెంట తిరిగీనని, అట్టే వుండీనా, నీళ్ళ గారీని తల్లడించీనే_ అనే రూపాలు అభూతకాల బోధలో ప్రథమ పురుషైక వచన రూపాలుగానూ, బొంకేవు, పెనగేవు బిగిసేవు, వంటి రూపాలు మధ్యమ పురుషైక వచన రూపాలుగానూ కనిపిస్తున్నాయి.

ఈ రూపాలు పద సాహిత్యంలోనూ, యక్షగానాల్లో మాత్రమే కన్పిస్తున్నాయి. ఈ రూపాలు ఏ ప్రాంతపు వ్యవహారంలో ఉండేవో తెలీదు. పద సాహిత్యపు శైలికి గుర్తులుగా పద కర్తలందరిలోనూ ఇవి కన్పిస్తున్నాయి.

కావ్య భాషా చట్రంలోనే అన్నమాచార్యుల వారు పద రచన చేశారనటానికి ఆయన ప్రయోగించిన ఈ పద రూపాలు సాక్ష్యమిస్తాయి. ఉదాహరణకు పైన పేర్కొన్న 'మాట వచ్చీ' 'జుమ్మీ' అనే ప్రయోగం కావ్య భాషా వ్యాకరణంలో ద్రుత కార్యాల మూసలో తయారయినట్టు గుర్తించటం కష్టంకాదు. పద సాహిత్యంలో భాష శైలీకృతం కావటానికి ఉపయోగించిన భాషాంశాలు ప్రత్యేకంగా పరిశోధించాల్సిన విషయం. అందుకు అన్నమాచార్యుల సాహిత్యాల్ని మొదట పరిశోధించాలి. ఒక రకం వ్యవహారంలో తదితర వ్యవహారాలకన్నా భిన్నమైన భాషాంశాలు కాని, కొన్ని అంశాల ఆధిక్యం కాని ఉంటే దాన్ని శైలీకృతభాష అంటారు. మనకు దొరుకుతున్న ఆధారాలను బట్టి అన్నమాచార్యుల వారే తొలి పద కర్త కనుక ఆయన మీద చేసే పరిశోధన వల్ల రచనా సంప్రదాయాలు, ఏర్పడే పద్ధతులు గురించి కొత్తవిషయాలు తెలుస్తాయి.

కొన్ని కీర్తనలను అన్నమాచార్యులవారు పూర్తిగా పామర భాషలో కూర్చటానికి సందేహించలేదు. ఉదాహరణకు శృంగార సంకీర్తనల్లో (సం. 12. పే. 11, కీర్తన 14) 'సిన్నవాడవని నమ్మనెల్లదు నిన్ను' అనే కీర్తన అట్లాంటిది. అందులో 'బాల కిసున రాయడు', 'లకిమమ్మ' వంటి రూపాలున్నాయి. కాని ఆ పాటలోనే పోయను (పోయెను), సొక్కెను అని కావ్య భాషా క్రియా రూపాలు కూడా వాడారు. కావ్య భాషా చట్రంలోనే అన్నమాచార్యుల వారి పద రచన సాగిందనటానికి ఇది ఇంకొక ఆధారం. అన్నమాచార్యుల వారి కవితా రచనలను సంకీర్తనలనీ పదాలనీ వ్యవహరిస్తున్నాం. అవి రెండు మాటలూ వస్తు భేదాన్ని సూచిస్తున్నాయి. నిర్మాణ దృష్ట్యా భేదం లేదు. వీటి నిర్మాణాన్ని గురించి గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు (అధ్యాత్మ సంకీర్తనలు పీఠిక పే. 14) సూక్ష్మంగా ఇట్లా చెప్పారు. "ఈ వాఙ్మయమున సాధారణముగ ఏ పాదమున కాపాదము అన్వితమై, ఒకొక్క చరణమంతయు ఒక వాక్యముగ ఏర్పడి పల్లవిలోని సంగ్రహ భావము పోషించుచుండును." దీన్నిబట్టి ఈ పాటలకు పల్లవి అనే ప్రారంభం, 'చరణాలు' అనే విస్తారం ఉంటుందని తెలుసుకోవచ్చు. పల్లవి రెండు పాదలుంటుంది. చరణం నాలుగు పాదలుంటుంది. ఎనిమిది పాదాల చరణాలు కూడా ఉన్నాయి. (చూ. శృంగార కీర్తనలు పే 121-122, సంఖ్య 177) చాలా కీర్తనల్లో మూడు చరణాలుంటాయి. కొన్నిట్లో మూడు కన్నా ఎక్కువ తక్కువ లుండొచ్చు.

'పల్లవి' పాటలోని వస్తువును, ఛందస్సును ప్రవేశ పెడుతుంది. ఆ భావమే ఆ ఛందస్సే చరణాల్లో ప్రస్తారమవుతుంది. ఒక్కొక్క చరణంలో ప్రాసనియమం, పాదంలో యతి నియమం ఉంటాయి.

పల్లవి రెండు పాదాలు కలిపి ఒక వాక్యం కావచ్చు. లేక ఏ పాదాని కాపాదమే ఒక వాక్యం కావచ్చు.

అట్లాగే చరణాల్లోకూడా నాలుగు పాదాలకూ కలిపి ఒకే వాక్యం ఉండొచ్చు. అంతకన్నా ఎక్కువ వాక్యాలూ ఉండొచ్చు.

ఈ వాక్యాల పేర్పులో అన్నమయ్య రకరకాల పోకడలు పోయారు. వాక్యాల మధ్య భిన్న సంబంధాలను పాటకో తీరుగా ఏర్పరచుకొన్నారు. ఉదాహరణ ప్రాయంగా కొన్ని రకాల పాటలను విశ్లేషించి చూపిస్తాను.

కలగన్న చోటికిని గంప యెత్తినయట్లు
అలవు మీఱిన చెట్ల నమ్మా !
ఎలయింపుఁగడకంట నెన్నఁడో వొకనాఁడు
చెలఁగి తనునతడు చూచిన వాడట

పొలితి యది దలచి యిప్పుడు మదన వేదనల-
నలసీనిక నెట్లునమ్మా
ఎలుకయును మలపుగా నేటికో వొకనాడు
కెలలి తను నొవ్వ బలికిన వాడట
తీలినదియె చెలియిపుడు దలచి పరితాపాగ్ని
నలగీనిక నెట్లనమ్మా
ఇయ్యకోలుగ గలసి యెప్పుడో యిదినేడు
నెయ్యమున చెలిగోన నెలకొనెనట.
తియ్యముల నటకాడు తిరు వేంకటేశ్వరుడు
అయ్యో ! యికనెట్ల నమ్మా !
(శృంగార సంకీర్తనలు : పే 41, కీర్తన 64)

పల్లవి ఖండగతి ఛందస్సుగు, సంబుద్ధ్యంత సంప్రశ్నను ప్రవేశపెట్టింది. ఇవి అన్ని చరణాల్లోనూ సమంగా పాటించబడ్డయ్. మేరమీరిన వలపు తాపంకూడా పల్లవిలో సూచించబడింది. చరణాల్లో విస్తరించబడింది.

పాదాల్లో రకరకాల పద్ధతుల్లో రూపసమత్వం పాటించారు. ప్రతిచరణంలోను మొదటి పాదాంత శబ్దంకాల బోధకం రెండో పాదాంతంలో కిలార్థక శబ్దాంశమైన ధాతకాల బోధక క్రియలు, నాలుగో పాదాంతం ఇంతకు ముందు చెప్పినట్టుగా సంబుద్ధ్యంత సంప్రశ్నం. ఇవన్నీ కలిపి పాటను వివిధాంశల్లో సమత్వమున్న ఏకరూపికగా చేస్తున్నాయి. ఇది కాక ఉన్న మూడు చరణాలోనూ మొదటి రెండింట అధిక సమత్వం, ఆఖరి చరణంలో భిన్నత్వం గమనించ దగినవి.

మొదటి రెండు చరణాలు 'ఎ' అనే అచ్చుతో మొదలయితే, చివరి చరణం అదే జాతికి చెందిన 'ఇ' అచ్చుతో ప్రారంభమయింది. మొదటి రెండు చరణాల మొదట పాదాంత కాల బోధక శబ్దం 'వొకనాడు' అయితే, చివరి చరణానికి పాదాంత శబ్దం 'నేడు' మొదటి రెండు చరణాల ద్వితీయ పాదాంతాల ధాతకాలిక క్రియలు చూచిన వాడట, పలికిన వాడట - అనేవి క్రియా జన్య విశేషణం మీద తచ్ఛబ్ద 'వ' కారం లోపించని క్రియా పదాలు వాడితే, మూడో చరణంలో 'నెలకొనెను' అనే వేరే రకపు ధాతకాలపు క్రియ ఉంది. మొదటి రెండు చరణాల్లో 'చూచు, పలుకు' క్రియలు ఇంద్రియ వ్యాపార బోధక క్రియలు. చివరి చరణంలో 'నెలకొను' అధికరణ బోధక క్రియ. మొదటి రెండు చరణాల్లో తృతీయ పాదాల్లో 'వేదనలన్, పరితాపాగ్నిన్' సప్తమ్యంత పదాలుంటే ఆఖరి చరణంలో 'తిరువేంకటేశ్వరుడు' అనే ప్రథమాంత పదం ఉంది. మొదటి రెండు చరణాల్లో 'అలసీను', అలగీను' అనే క్రియలతో చతుర్థ పాదాలు మొదలయితే, మూడో చరణపు చతుర్థ పాదంలో వాక్యంతో అంతస్సంబంధంలేని 'అయ్యో !' అనేశబ్దంతో మొదలయింది.

ఇన్ని రకాలుగా మొదటి రెండు చరణాల్లో సమత్వం చూపించి, మూడో చరణంలో భిన్నత్వం చూపించారు.

ప్రతిపాటకు ప్రారంభం ఉన్నట్లే ముగింపు ఉంటుంది. పాట ప్రారంభం పల్లవితో అవుతుంది. వేరు ప్రాసతో పాద సంఖ్యలో చరణాలకన్నా పల్లవి భిన్నంగా ఉంటుంది. ఇది ఆటోమేటిక్‌గా ప్రారంభంలో వచ్చే భిన్నత్వం. మిగతా చరణాల మొత్తంలో సమత్వం, మళ్ళీ మొదటి రెండు చరణాల్లో అధిక సమత్వం, ముగింపులో భిన్నత్వం—ఇది కీర్తనల నిర్మాణంలో అన్నమాచార్యులు అవలంబించిన పద్ధతి.

ఇది వర్ణాలద్వారాకానీ, శబ్దాలద్వారాకాని, వాక్యాలద్వారాకానీ, వాక్యాంశాలద్వారాకాని, వీటన్నింటి ద్వారాకాని సాధించబడుతుంది.

తరువాత పాటలో (పే 45. కీర్తన 65) అంతా ఇక్కడ ఉదాహరించటం లేదు—మొదటి రెండు చరణాల మొదటిపాదాల్లో 'చనవిచ్చేవు మెచ్చేవు' అనీ 'ఏగేవు, దాగేవు' అనీ ధ్వని సమత్వం ఉన్న క్రియలను వెనువెంటనే వాడి ముగింపు చరణంలో 'పారవేసేవు' అని ఒకే క్రియ వాడారు.

ఇంకోపాట (పే. 120-121, సంఖ్య 174) చూడండి.

వెక్కసమగు గుచ విభవములు
జక్కవ పులుగుల జగడములే !
చింత చేతనిదె చెలియ నుదుటిపై
చింతల చెదరిన చిరునెరులు
కాంత కన్నులను గండు మీలకును
కంతుడు వేసిన గాలములే.
తమకంబున గాంతకు గరమూలపు
చెమటల తావుల చెలువములు
మమతల బెంచిన మరుని కొంతముల
జమళి తీగెలకు జలకములే
తిలమోవిపై తిరు వేంకటపతి
గుఱుతులు సేసిన కురుబసలు
బలిగి వివశతల నుండగ సురతపు
మలపులు తెలిసిన మర్మములే.

ఇందులో పల్లవి విషయాన్ని ఛందస్సునూ, వాక్యరీతినీ ప్రవేశపెడుతుంది. తరుణి సౌందర్యాంశాలు- వాటి పోలికలూ విషయం. రెండు నామబంధాల ఏకతను తెలియపరిచే "ఈ క్వేటివ్ క్లాజెస్"ని ఎన్నుకున్నారు. ఉపమానోపమేయాలకు అభేదాన్ని చెప్పటానికి సమాపక క్రియ తరవాత నామ బంధ వాక్యాలు బాగా ఇముడుతాయి. పాట అంతా ఇదే రీతిలో ఉంది. చరణాల్లో ఈ వాక్యాలు మామూలు నామబంధాలు కాక క్రియాజన్య విశేషణాల నుంచి నిష్పన్నం చేసిన నామ బంధాలు అంటే ఒక్కో నామ బంధం వాక్య మూలకం అన్నమాట. దీన్ని బొమ్మలో ఇట్లా చూపించవచ్చు.




ప్రతి చరణాంతంలోనూ ప్రత్యయతుల్యమైన 'లే' అనే శబ్దాన్ని చరణ సమత్వం కోసం వాడింది.

ముగింపు చరణంలో నాయకుని పేరు చెప్పటం మిగతా చరణాలతో భిన్నత్వాన్ని సాధించటానికి చేసిన పని.

ఇట్లా కీర్తనలన్నీ విశ్లేషించి చూపటం నాధ్యేయం కాదు. కాని ఇది యాదృచ్ఛికం కాదు అని చెప్పటానికి ఇంకా ఒకటో, రెండో చూపించటం అవసరం అనుకుంటాను.

శృంగార సంకీర్తనలలోనే ఇంకోటి చూడండి—

తగిలిన మునులే యాతని గందురంటా
మగువ యెవ్వరితోడ మాటాడదిపుడు.
అతుల నిరాహారుల తనికిప్రియులంటా
అతివ నిన్నటినుండి యారగించదు.
తతి నడవుల నుండే తపసులే యతనికి
హితులంటా వనములో నెడయదీ తరుణి.

[పే. 5., కీర్తన 6]

ఇందులో కారణం-కార్యం క్రమంలో వాక్యాలున్నై. కారణ వాక్యం నిశ్చయార్థకం. కాని 'అంట' అనేది చేరటంతో నిశ్చయానికి న్యూనత వచ్చింది. కార్యవాక్యం వ్యతిరేకార్థకం. చివరి చరణంలో చివరి వాక్యం-అంటే ముగింపు వాక్యంలో ఈ వరస భేదించింది.

అట్లాగే ఇంకో పాటలో—[పే. 7, పా. 10]

అతి రాజసపు మాటలాడకురా ; యే
కతమైన నాచేత గడు నొత్తువోరి
ఇతరుల వలె నన్ను నెంచకురా నీ
మతి చొచ్చి నీమేను మలపింతునోరి

ఇక్కడ ఒక్కో చరణంలో నిషేదార్థకం—నిశ్చయార్థకం జంటలుగా వాడబడ్డయ్. రెండువాక్యాలు సంబుద్ధ్యంతాలు. ఒక చోట 'రా' అంటే ఇంకోచోట 'ఓరి' ఉంది. ఈ వాక్యాల జంట అంతస్సంబంధాన్ని 'చేత్సంబంధం' అనొచ్చు. అంటే పూర్వ క్రియల చేదర్థక రూపాలను అనుసంధించుకోవాలి.

ఇట్లా ఎన్నో పాటలనుంచి ఉదాహరణలీయొచ్చు. ప్రతి పాటనూ విశ్లేషించి చూపించవచ్చు. కాని ఇది ఒక వ్యాసంలో కాని పని. పరిశోధక గ్రంథాల్లో చెయ్యాల్సిన పని. అన్నమాచార్యుల కీర్తనల్లో నిర్మాణ పరంగా ఈ స్థూలమైన అంశాలు చెప్పుకోటాని కిక్కడ వీలవుతుంది.

పల్లవి విషయాన్ని, ఛందస్సును, వాక్యరీతినీ ప్రవేశపెడుతుంది. చరణాల్లో అవి విస్తారమవుతై. వివిధ భాషాంశాల ద్వారా- అంటే వర్ణ, శబ్ద, వాక్య, వాక్యాంశాల ద్వారా-సాధించిన సమత చరణాల్లో ఉంటుంది. మొదటి రెండు చరణాల్లో ఆఖరి చరణం కన్నా, అధిక సామ్యం ఉంటుంది. ఆఖరి చరణంలో కొన్ని ప్రత్యేకాంశాలుంటై. కీర్తన ముగింపును సాధించటానికి అవలంబించిన ప్రత్యేక పద్ధతి ఇది.

ఈ పద్ధతిలో అన్ని పాటలను విశ్లేషించి చూసుకుంటే ఎన్నిరకాల వాక్య భేదాలను, ఇతర భాషాంశాలను కీర్తనలకు ఆకృతిని కల్పించటానికి అన్నమాచార్యులు వాడు కొన్నారో లెక్కగట్టవచ్చు. విస్తృత పరిధిలో చేసే పరిశోధనలో ఇట్లాంటివన్నీ చెయ్యాల్సుంటుంది, అందుకీ వ్యాసం సూచన ప్రాయం.

మనకు కథా కావ్యాలున్నై. వాటిల్లో భాషాంశాలపై ఇంత దృష్టి పెట్టటం కుదరదు. అక్కడ కథా కథన ప్రధానంగా రచన సాగుతుంది. ఎక్కడో అరుదుగా భాషాంశాలను ఈ విధంగా వాడుకుంటారు. కీర్తనలు సాధారణంగా కథా విరహితాలు. ప్రతి కీర్తనా ఇక్కడ ముఖ్యమైనదే. అందువల్ల కథాకావ్యాల కన్నా కీర్తనల్లో భాషా దృష్టి ఎక్కువ. భాషాంశా సమ విషమత్వాల సంయోజన ద్వారా కీర్తనలకు ఆకృతి లభిస్తుంది. పద్య కావ్యాల్లో అరుదుగా ఉండే అంశం కీర్తనలకు నిత్యమైపోయింది. అయితే

అధ్యాత్మరామాయణ కీర్తనల మాటేమిటి ? అవీ కథా కావ్యాలే కదా ! అధ్యాత్మరామాయణ కీర్తనలలో కథా కథనం ప్రధానం కాదు. కీర్తనల పరిధిలో విడగొట్టబడిన కథ అది. కథా కావ్యాల్లో కంటిన్యుయిటీ ప్రధానమైతే కీర్తన సాహిత్యంలో డిస్‌కంటిన్యుటీ ప్రధానం.

ఆధునిక సాహిత్యంలో కథా విరహితంగా Poem అనే ప్రక్రియ ఉంది. దీనికీ కీర్తనకీ కొన్ని పోలికలున్నాయి. రెండింట్లోనూ చరణాలుంటాయి. ముగింపు ప్రత్యేకతలు సాధారణంగా గుర్తించవచ్చు. చరణాల వాక్య నిర్మాణంలో సమత్వం ఉంటుంది. ఆధునిక నాగరికత మూలంగా పత్రికలద్వారా ప్రచారంలో కొచ్చిన Poem అనే లఘు కృతికి కీర్తన మూలం. ఇంగ్లీషు సాహిత్యం ప్రేరణ, పత్రికలు స్థైర్యం ఇచ్చి ఉంటాయి. భావకవుల పాటలనుబట్టి ఈ విషయాలు చెప్పొచ్చు. ఎంకి పాటలవంటి పాటల్లో ఈ కీర్తనల లక్షణాలను గమనించగలం.

వాక్య, వాక్యాంశాలను కవితా రూప నిర్మాణానికి వాడుకోటం సంకీర్తనల పద్ధతి. అందుకు దారి చూపించినవారు అన్నమాచార్యులవారు.

[తిరుపతి దేవస్థానంవారు 1981 మే నెలలో జరిపిన అన్నమాచార్య సాహిత్య సమాలోచనలో ఒకనాడు చదివిన వ్యాసం. ఆ సమావేశాల్లో చురుగ్గా పాల్గొని, ఆ తరువాత కొద్ది రోజుల్లోనే మరణించిన ప్రసిద్ధ పరిశోధకులు తిమ్మావఝుల కోదండ రామయ్యగారి స్మృతి కంకితం]





13

# కలగూర గంప

## విష్ణుకుండినుల కాలం నాటి "అసనపురము" రాజమహేంద్రవరమా?

శ్లో॥ సామాన్యోయన్ధర్మన్ సేతున్నృణ్ పాణాం
కాలేకాలేపాలనీయోభవద్భిః
సర్వాన్ నేతాన్భావినః పార్థివ్ వేంద్రా
న్భూయో భూయో యాచతే రామచంద్రః ॥

శ్లో॥ బహుభిర్వన్ సుధాదత్తా బహుభిశ్చానుపాలితా
యస్య యస్యయదా భూమి స్తస్య తస్య తదా ఫలం ॥

శ్లో॥ స్వదత్తాం పరదత్తాం వాయోహరేత వసుంధరాం
షష్టి వర్షణ్ సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః ॥

శ్లో॥ స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనమ్
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

సర్వ సామాన్యముగా పై శ్లోకాలు ప్రతి దానశాసనాంతాన ప్రత్యక్షమవుతూ వుంటాయి। ఇవి శాసన దాతల అభ్యర్థనాల్ని వ్యక్తీకరించడమే కాకుండా, వారి భయ సందేహాలను కూడా వ్యక్తీకరిస్తూ వుంటాయి। కారణం? మానవ నైజాన్ని ఆ మూల చూడంగా యెరిగివుండడమే। గుడిలోని లింగాన్ని మ్రింగేవాడొక డుంటే, గుడినే మ్రింగే ఘనుడింకొకడుంటాడని మన పూర్వులకు బాగా తెలిసి యుండడమే। అందుకే తాము చేసే దానం పదికాలాల పాటు నిలిచియుండి, దాన గ్రహీతకు, దాతకుకూడా ఇహ పరాదుల కల్పించి, ఉభయతారకంగా పర్యవసింపవలెననే ఆకాంక్షతో దాన శాసనాల్లో దాతలు ఇల్లాంటి అభ్యర్థనలను చేస్తూ ఉంటారు। ఒకరు యిచ్చిన ధర్మాన్ని పాటించి, పాలించి, ఆదాన ఫలాన్ని ప్రతి గృహీత అనుభవించుటకు తోడ్పడమనే వేడికోలు ఈ శ్లోకాల్లో ద్యోతకమవుతూ ఉంది। స్వదత్తమైనగాని, పరదత్తమైన గాని ధర్మాన్ని భంగింపయత్నించేవాడు అనేక వేల సంవత్సరాలు కీటకయోని సంభవుడై, భ్రష్ట జీవితం గడుపుతాడనే సూచనగూడ గర్హేకృతం చేయబడ్డదీశ్లోకాల్లో। స్వదత్తమైనదిగానీ, పరదత్త మైనదిగానీ యేధర్మాన్ని (దానాన్ని) అయినా హరించినా, ఇతరు లిచ్చిన దాన ఫలం విఫలం అగుటయేగాక, తానిచ్చిన దానఫలం నిష్ఫలం అవుతుందన్న హెచ్చరిక కూడా చేయబడదీశ్లోకాల్లో।

ఇంతకు చెప్పవచ్చినదేమంటే-తాను స్వయంగా దానం చేయకపోయినా, ఇతరులొసంగిన దానాన్ని హరింపక, ప్రతి గృహీత తత్ఫలం అనుభవింప దోహదం చేస్తే ఆ పుణ్యం శత గుణితం అవుతుందనీ, అట్లుగాక దానిని హరించినచో తాను యిచ్చిన దానంకూడా కొరగాకుండా పోతుందనే ధర్మ సూక్ష్మం ఉద్బోధింపబడినదీశ్లోక పరంపరలో।

అట్టి సందర్భాలలో ఎపుడో కొన్నియేండ్ల క్రిందట, ఏ మహాదాతయో గావించిన దానం, కాల ప్రభావమున ఉత్పన్నమై, దానగృహీతల కక్కరకు రాకుండ పోయిన సందర్భంలో దానిని ఉదారమతితో పునరుద్ధరించి, తద్ధర్మోద్ధరణ గావించుటెంటిమహో త్కృష్ట కార్యం। అందునా తన శత్రు పక్షీయులొసంగిన దాన ముల నదే గృహీతలకు పునర్దత్త మొసంగుట మహోత్కృష్ట కార్యములలో తలమానికమని వేరుగా చెప్పనవసరము లేదు।

అట్టి మహత్కార్యమును చాళుక్య జయసింహ వల్లభుడు రెండు పర్యాయములొనరించి, మాన్యయశుడైనాడు. ఒకటి-పొల మూరు దానవిషయమున, రెండు-నిడుమ్రు దాన విషయమున.

ప్రస్తుతమున పొలమూరు దాన విషయమును గూర్చియే ప్రస్తావించుకొందము. పొలమూరు గ్రామము తొలిసారిగా జనా శ్రయ విష్ణుకుండిన మాధవవర్మ IV (మాధవవర్మ III అని కొందరి మతము)చే కమ్మ రాష్ట్రనివాసి, వేదవిదుడు "కుఁద్రూరు" (కొండూరు) వాస్తవ్యుడైన "దామశర్మ" కుమారుడు "శివశర్మ"కు సర్వకర పరిహారముగ దానమొసంగబడెను. మాధవవర్మ తూర్పు దేశమును జయింప నిచ్చగించి గోదావరి నుత్తరించియున్న సంద ర్భమున నొక చంద్రగ్రహణ పుణ్యకాలమున నీ దానమిచ్చెను. దత్త గ్రామమైన "పొలమూరు" "దళియవాయి" నదీతటమున నున్నది. ఈ దానములోపాటు, జనాశ్రయ మహారాజు "గుద్దవాడి విషయము"లోని "మహేంద్రవాటిక" గ్రామములో నాలుగు నివర్తనముల నివేశనస్థలమును "పొలమూరు" గ్రామముతో బాటొసంగెను. "గుద్దవాడి విషయము" నేటి రామచంద్రపురము తాలూకాకు సరిపోవును. అందు "దళియవాయి" నది ప్రవహించు చుండుట చరిత్ర ప్రసిద్ధి సందినదే। "మహేంద్ర వాటిక" నేటి "మహేంద్రవాడ"యేగాని వేరొండుగాదు. "పొలమూరు" "మహేంద్రవాడ"లున్న స్థలముల వర్ణనలబట్టి, అవి నేటి రామ చంద్రపురము తాలూకాలో నున్నవనుట స్పష్టము. దాన గృహీత

శివశర్మ గౌతమస గోత్రుడు. తైత్తిరీక సబ్రహ్మచారి. ఈ దానము విష్ణుకుండిన మాధవవర్మచే క్రీ॥ శ॥ 594వ సంవత్సరమున చేయ బడినది.

ఈదానగృహీత శివశర్మనేటి గుంటూరుజిల్లాలోని కొండూరు గ్రామవాసియై యున్నాడు. జనాశ్రయ మహారాజిచ్చిన దాన గ్రామము తూర్పు గోదావరి జిల్లాలోని రాజమహేంద్రపురం తాలూకా "పొలమూరు" ఇది యెట్లు తటస్థించినది? విజయార్థియై బయలు దేరిన ప్రభునకు సన్నిహితుడు, హితుడు అయిన వానికిగాని అట్టి గౌరవము లభించుట సాధ్యపడదు. కావున మాధవశర్మ తన రాజధానిని "దెందులూరు"నకు మార్చినపుడీతడు గూడ ప్రభునకు గూర్చు వాడైయున్న కారణమున, తన నివాసమును గూడ మార్చు కొని యుండవలెను. ఎచటకు మారెనో చాళుక్య జయసింహుని "పొలమూరు" శాసనమువలన తెలియనగును. విష్ణుకుండిన మాధవ వర్మచే "పొలమూరు" గ్రామదానము నందిన శివశర్మ కుమారుడు, జయసింహ వల్లభునిచే నదే గ్రామమును తిరిగి పరిగ్రహించు నపుడు "అసనపుర" వాస్తవ్యునిగా వర్ణింపబడినాడు. అనగా శివశర్మ "పొలమూరు" దానమును పరిగ్రహించిన పిదప తన నివాసమును "కొండూరు" నుండి "పొలమూరు"నకు దగ్గరగా నున్న "అసనపురము"నకు నివాసమును మార్చి యుండవలెను. లేకున్న "శివశర్మ" తనయుడు "రుద్రశర్మ" అసనపుర" వాస్తవ్యునిగా నభివర్ణింపబడుట పొసగదు. ఈ పై సంపర్కములబట్టి, జనాశ్రయ మహారాజున కాశ్రితుడు, ఇష్టుడు, వేదవిదుడునగు శివశర్మ "పొలమూరు" గ్రామ దానమును స్వీకరించిన పిదప, తన కుటుంబ ముతో తరలివచ్చి "పొలమూరు" గ్రామ పరిసరమున నున్న "అసనపురము"ను నివాసముగా నేర్పరచుకొని యుండవలెను.

ఇటనొక ప్రశ్న యుదయింపవచ్చు. "కొండూరు"ను విడిచివచ్చిన శివశర్మ తానగ్రహారముగా పొందిన "పొలమూరు" లోనే వాసమునరింపక, "అసనపుర" వాసమేల నభిలషించెను? నను నదీ ప్రశ్న. దీ కి సదుత్తర మిచ్చినగాని "శివశర్మ" పుత్రుడు "రుద్రశర్మ" "అసనపుర" వాసియని పేర్కొనబడుటలోగల ఔచిత్యము విశదముగాదు.

జయసింహ వల్లభుడీ శాసనమును తన "విజయస్కంధా వారము" నుండి యొసంగెను. అనగా యుద్ధభూమినుండియేయని స్పష్టము. ఇది అతని తొలివిజయమై యుండి యున్నందున, హర్షాతిరేకముచే నీ దానమును ప్రకటించెను. జయసింహ వల్లభుడీ దానమును క్రీ॥ శ॥ 646వ సంవత్సరమున అనగా తాను రాజ్యాధిపత్యము వహించిన 5వ సంవత్సరమున నీదాన మొసంగి యుండెను. ఇదియే అతని తొలి విజయము. ప్రత్యర్థులు విష్ణు కుండిన మాధవవర్మయు నాతని తనయుడు మంచన భట్టారకుడును. అందువలననే తొలివిజయము సాధించిన వెంటనే రణస్థలి నుండియే తానే శత్రురాజన్యు నోడించెనో నాతనిచే నొసంగబడి, ఉత్పన్న మైన గ్రామదానమును పునరుద్ధరించి, పూర్వ అగ్రహారీకులకిచ్చుటే సమంజసమని తలంపున నటులొనర్చెను. ఆ సమయమునకు "రుద్రశర్మ" (పూర్వ అగ్రహారీకుడైన శివశర్మ తనయుడు) అసనపుర వాసియైయుండెను. కాన జయసింహుని శాసనమున్నట్లు పేర్కొనుట సంభవించినది.

దాన గృహీతలు "శివశర్మ"గాని, అతని తనయుడు "రుద్ర శర్మ"గాని తమ కొసంగబడిన "పొలమూరు అగ్రహారము"నందు స్థావరమేర్పరచు కొనక "అసనపురము"న కేలవచ్చిరి? అన్న ప్రశ్నకుత్తర మీయవలసియున్నది. "పొలమూరు" గ్రామదానము నందిన "శివశర్మ" తన నివాసమును "కొండూరు" నుండి "పొలమూరు"నకు మార్చియేయుండును. అటు పిమ్మట సంభవిం చిన రాజకీయ కల్లోల పరిస్థితులలో నా ప్రాంతమంతయు, యుద్ధ జ్వాలల చిక్కి, శాంతి భద్రతలు లేక రాజకీయ కుహకములకు, కుట్రల కాలవాలమై, అగ్రహారీకుల బ్రతుకులు దినదిన గండము లుగా పర్యవసింపనప్పుడు వాసి, భద్రతకొరకు తప్పరిసరముల వేద వేదాంగ వేత్తలగు పండితోత్తములకు, కవులకు, శాస్త్రపారం గతులకు నిలయమైయున్న "అసనపుర ఘటికాస్థానము"నకు దన నివాసమును మార్చియుండును. ఆ కారణముననే "శివశర్మ" దానము పరిగ్రహించిన పిదప యాబది వత్సరముల కాతని తనయుడు "రుద్రశర్మ" "అసనపురవాసి"యై యుండి "పొలమూరు" గ్రామమును తిరిగి దానము గ్రహించెను. ఈ విధమున "అసనపురము" "పొలమూరు" గ్రామ పరిసరముననే యుండి యుండవలెనని యూహింపదగుచున్నది.

చాళుక్య జయసింహుని శాసనములలో పెక్కింటిలో ఈ "అసనపుర" ప్రసక్తి చేయబడినది. ఆ వర్ణనలబట్టి "అసనపుర" మొక మహా పట్టణమనియు, అందు "మూల ఘటికా స్థానము" ండెననియు ఆ ఘటికా స్థాన మనకాచార్యుడు దివి నిర్దేశించిన వానిని "ఘటికా సామాన్య"డ (Rector of Asanapur Ghatika Sthanam) పేర్కొందురని, అందు వేద వేదాంగవేత్తలు, శాస్త్ర పండితులు, ఇతిహాసక బ్రహ్మలు, పౌరాణిక శ్రేష్ఠులు, కవి పుంగవులు మొదలగు వారలు సభ్యులై, గోష్ఠుల నిర్వహించుచు, శిష్యుల ద్వారా విద్యల బోధింపుచు, మత ప్రచారమును కుదురించుచు, రాజకీయములకు దూరముగానుండి ఆధ్యాత్మిక జీవనము నెరపు

మహా మనీషుల కాలవాలమై యుండెననియు, కావుననే ఆ ఘటికా స్థానములనున్న ప్రజ్ఞావంతులైన ఆచార్య దేవులనే ప్రభువులు హెచ్చుగా నభిమానించుచు వచ్చిరనియు తెలియవచ్చెడిని. చాళుక్య జయసింహ డొక్కొక్కయె''డ నీ అసనపురము'' నుండియే తన అగ్రహార ప్రదాన ప్రకటనల గావించుచుండెడువాడని తెలియుచున్నది. అయినచో ''అసనపురము'' రాజధానియో లేక ప్రభువుల వేసవి విడిదియో లేక రాజ ప్రతినిధులుండు స్థావరమో అయి యుండవలెను. శాసనములలో గోచరించిన విషయములబట్టి ''అసనపురము'' పై వాటిలో నేదో యొకటియై యుండునా ? యను సందేహము కలుగుచున్నది ; ఇందులకు తోడు చాళుక్య జయసింహుని ముప్పది రెండేండ్ల పాలనా కాలము నిత్య ఘర్షణలతోనే గడచిపోయెను. ఆకారణముచే నాతని రాజధానులు పదేపదేమారుట తప్పనిసరియాయెను. వేంగీపురము, ఉదయపురము, సర్వసిద్ధి మొదలగు పట్టణము లాతని రాజధానులుగ నుండినట్లు కన్పట్టుచున్నవి. కాని-అసనపురమా తని రాజధానిగానెందును పేర్కొనబడి యుండలేదు ; అయితే అతని దాన శాసనము లెక్కుడుగా అసనపురము నుండియే ఈయబడినవి. అందుచే దీనికెక్కుడు ప్రాధాన్యత వచ్చినది. అట్టి ప్రాధాన్యత సంతరించుకొన్న అసనపురమేదియో నిర్ధరించుటే ఈ వ్యాస ముఖ్యోద్దేశము.

ఒకదాని వెనుక నొకటిగా సుమారు యాబది సంవత్సరముల కాల వ్యవధిలో ఒకే కుటుంబమునకు చెందిన తండ్రి కొడుకులకు భిన్న రాజవంశములకు చెందిన ప్రభువుల ఆదరాభిమానములవలన, ఒకే గ్రామము అగ్రహారముగా నీయబడుట చరిత్రలో నొక అపూర్వ విషయమే ; సహజముగ నట్టి పరిస్థితియే సంభవింపవలసి వచ్చుచో, గ్రామ నామము మార్పు చెందుటో లేక ప్రతి గృహీతలు వేరగుటో సంభవించుచుండును. కాని-యట్టిది జరుగకుండ నొకే కుటుంబమునకు చెందిన వారి కొకే నామమున (పూర్వ నామమున) నున్న గ్రామము ప్రత్యర్థులగు ఇర్వురు వేర్వేరు ప్రభువులచే దాన మొసంగబడుట నిజముగ నాశ్చర్యకర విషయమే ;

ఈ రెండు దాన ప్రశస్తులను విశ్లేషించి చూచితిమేని, ఇందొక విశేషము గోచరించును. తండ్రి ''కొండూరు'' వాసికాగా, తనయుడు ''అసనపుర'' వాసియైనాడు. తండ్రికాలమున సంపాదింపబడిన అగ్రహారము, కొడుకు కాలము నాటికి కుటుంబ స్వాధీనము నుండి చేజారిపోయినది ; ప్రత్యాను గ్రహమున తిరిగీ లభ్యమైనది. అటుల చేజారి పోవుటకు కారణము తద్గ్రామ ప్రాంతములన్య రాజన్య ప్రభుత్వాధికారము క్రిందకు వచ్చుటయేయగును. ప్రసక్త విషయములో విష్ణుకుండిన, చాళుక్య రాజన్యుల మధ్య నడచిన రణ వ్యాపారములే ''పొలమూరు'' అగ్రహారము ''శివశర్మ'' చేజారి పోయి, తిరిగీ అతని కుమారుడు ''రుద్రశర్మ'' కాలమున పునర్దత్తమగుట సంభవించినది.

ఇటనింకొక విశేషముగలదు. ''శివశర్మ'' కమ్మ రాష్ట్రము లోని''కొండూరు''వాసిగా పేర్కొనబడగా''రుద్రశర్మ'' అసనపుర వాసిగా పేర్కొనబడినాడు. ఆయన అసనపుర మే రాష్ట్రములో నెక్కడ నున్నదో శాసన ముట్టంకించుటలేదు. తండ్రి, కొడుకు లొకే రాష్ట్రమునకు, ఒకే గ్రామమునకు చెందియుండుట సహజము. తగిన కారణమున్నగాని వారికుటుంబము వేరొక చోటికి వలస బోయి, నివాస మేర్పరచు కొనుట సంభవింపదు. జనాశ్రయ మాధవవర్మ నృపతిచే నగ్రహారము పడసిన పిదప శివశర్మ కొండూరు విడిచి పొలమూరు జేరి, యందు నివాస మేర్పరచు కొని యుండ, ఉద్ధతులగు ప్రత్యర్థ నృపాలుర మధ్య సాగిన రణ వ్యాపారములో నా కుటుంబము తమ నెలవు విడిచి, అసనపురమును జేరి, తన్నివాసస్థులుగా నున్న తరుణమున చాళుక్య జయసింహ వల్లభుడు గుద్దవాడి విషయ ప్రాంతము నాక్రమించి, సుస్థిర ప్రభుత్వమును స్థాపించి, యుద్ధ భూమినుండియే పూర్వాగ్రహారీకుడగు శివశర్మ కుమారుడు రుద్రశర్మ కాగ్రామమునే అగ్రహారముగా దాన మొనరించి యుండునని ఈ వసకే స్పష్టీకరింపబడినది. ఈవిధిని ''అసనపురము'' రుద్రశర్మాదులకు పూర్వ ఆవాసమై యుండిన పొలమూరు చెంత నుండినదే యని యూహింపవలసి వచ్చుచున్నది.

అసనపుర మొక ఘటికా స్థానము. అశోకునికంటె ముందుగానే ఆంధ్రలో బౌద్ధమతము వ్యాప్తినందియుండి నటుల నా పిదప జైనము, దాని ననుసరించి ప్రజాసామాన్యములో ప్రచారమంది యుండి నటుల చరిత్ర తెలుపుచున్నది. బౌద్ధ, జైన మత ప్రభావము కులోన్నై ప్రజలు, వారి నేలు కొంతమంది ప్రభువులుకూడ బౌద్ధ, జైన మతావలంబులై, తన్మతముల వ్యాప్తి నొందింప శ్రమించిరి. ఆ కారణమున ప్రజలా రెండు మతముల కాకర్షితులై, వేద మతదూరులై పోవుట సంభవించెను. హిందూ మతాభిలాషులగు రాజన్యాధికారములోనికి వచ్చినప్పు డీ దుస్థితిని బాపి, వేద మతోద్ధరణ మొనరింప కృషి సాగించుచు వచ్చిరి. ఈ వచ్చినవారిలో ''విష్ణుకుండిన వంశీయులు'' అగ్రగణ్యులు. వీరిలో కొందరు బౌద్ధ మతాభినివేశము గల్గియున్నను, హిందూ మతము నెడల గూడ నభిమానము చూపుచు, మత సామరస్య దృష్టిలో, సర్వమతముల ప్రోత్సహించుచు వచ్చిరి. విష్ణుకుండిన గోవిందవర్మ

(క్రీ॥శ॥ 398-435) సంవత్సరముల మధ్యకాలమున శాలంకాయనుల నుండి రాజ్యము నొడిసికొని, కృష్ణా-గోదావరి నదులమధ్య ప్రాంతము ఉన వేయిలుబడిలోనికి తెచుకొని, నలుబది సంవత్సరములు పాలించెను. ఇతడు బౌద్ధమతానుయాయి. ఈతని కుమారుడు రెండవ మాధవవర్మ హిందూ మతాభిమానియై, రాజసూయ, అశ్వమేధ, ఏకాదశాశ్వమేధ, వాజపేయ, పౌండరీక క్రతు సహస్రముల నొనర్చి, వేద మతోద్ధరణ గావించెను. ఈతని కాలమున బౌద్ధ మతము క్షీణించెను. ఈతని కుమారుని దేవవర్మ కాలమునకూడ యజ్ఞములు, క్రతువులు నిర్విఘ్నముగా సాగెను. అటులనే ఈ వంశీకుడైన మూడవ మాధవవర్మ, విక్రమేంద్రవర్మల కాలమున గూడ వేద మతమునకు రాజావలంబనము లభించెను. విక్రమేంద్రవర్మ కుమారుడు ఇంద్ర భట్టారకవర్మ "స్ఫురన్నిసిత నిస్త్రింశ ప్రభావ భాసితా శేష జగన్మండలాధిష్ఠితస్య, ప్రభూతంగకారవినిర్ధూర సమగ్ర దాయాదస్య, అనేక చతుర్దంత సమర సంఘట్ట ద్విరదగణ విపుల విజయస్య, యథావిధివిర్యాపిత ఘటికా వాప్త పుణ్య సంచయస్య, సత భూమి, కన్యా, గో, హిరణ్య ప్రదాన ప్రతిలబ్ధ పుణ్య జీవితోప భోగస్య, పరమ మాహేశ్వరస్య, మహారాజస్య శ్రీ ఇంద్రభట్టారక వర్మణః" అని కీర్తింపబడినాడు. ఈతని కాలమున పెక్కు ఘటికా స్థానములు నెలకొల్పబడి, అగ్రహార ప్రదానములచే వేద పండితుల కాశ్రయము, వేద విద్యలకు ప్రోత్సాహము కల్పింపబడెను. అటుల పరమ మాహేశ్వరుడైన విష్ణుకుండిన నృపాలుర కొందరు పూనుకొని, వేద మతోద్ధరణకై తమపాలనలో క్రీస్తుశక మూడవశతాబ్ది ప్రారంభమున ఘటికా స్థానముల (Residential Colleges) నెలకొల్పి, అందు వేద విదులగు పండితుల నమీకరించి, ప్రోత్సహించి, అగ్రహార ప్రదానములొసంగి, నిర్విచార జీవయాత్ర సాగింప సదుపాయముల గల్పించుచు వేదవిద్యల శిష్యకోటికి బోధించి, నిష్ణాతులజేయతగు అవకాశము కల్పించిరి. ఈ ఘటికా స్థానములు సామాన్యముగా మహాగ్రామములందో, పట్టణములందో స్థాపింపిరి. ఈ ఘటికా స్థానముల నిర్వహించు ఆచార్యులు, అందు నివసించు పండితులు ద్వివేదులు, త్రివేదులు, చతుర్వేదులై యొక్కలి ఖ్యాతిగాంచి యుండిరి. శాస్త్రవేత్తలు, తత్త్వచింతకులు, మత ప్రచారకులు పెక్కు సంఖ్యాకులు తద్ఘటికా స్థానములలో నివాసము లేర్పరచుకొని, శిష్యగణములకు బ్రాహ్మణధర్మములు, యజ్ఞయాగాది క్రతు నిర్వహణ జ్ఞానసంపత్తి, వేదా ధ్యాయము, హిందూ మతోద్ధరణ మాదిగాగల సకల విషయముల బోధించుచు, సంఘములో మరల వేద మతము నందానక్తి, భక్తి శ్రద్ధలు ప్రోదిచేయు యుద్యమము సాగింప దీక్ష వహించి కృషి చేసిరి. ఒక్కొక్కయెడ నీ ఘటికా స్థానములందుండు ఆచార్యోత్తములు, ప్రభువులొనర్చు యజ్ఞయాగాది క్రతువులలో యజ్వలై, ప్రభువుల అభ్యున్నతికి, ఆధ్యాత్మిక పుష్టికి బాటలు వైచుచు, సంఘములో విశిష్ట స్థాన మాక్రమించుకొనిరి. అట్టివారికే సాధారణముగా ప్రభువు లగ్రహారముల నొసంగి సత్కరించుచువచ్చిరి.

అట్టి ఘటికా స్థానములలో చాళుక్య యుగమున అసనపురము అగ్రేసరమై మూల ఘటికా స్థాన ఖ్యాతి (University) నార్జించుకొనెను. దేశములో నలదెసలయున్న ఘటికా స్థానములకు కేంద్ర స్థానమై, అనుబంధ ఘటికా స్థానముల పర్యవేక్షణ, క్రమబద్ధీకరణ, సమన్వయ సాధనముల జేయుచు, వానియాధిపత్యము వహించుచువచ్చెను.

అట్టివిశిష్ట స్థానమునాదికొన్న "అసనపుర"మెక్కడనున్నది

అసనపుర స్థల నిర్ణయమును గూర్చి యిప్పటికెన్నియో వాదోపవాదములు జరిగి, ఇదమిద్ధమని తేలక, ఆహంశము వివాదాస్పదమైనదిగనే నిలిచిపోయినది ! అయితే స్వర్గీయ శ్రీరాళ్ళబండి సుబ్బారావుగారు మాత్రము పేలగా దీని ఉనికి నేటి రామచంద్రపురం తాలూకా దాక్షారామ ప్రాంతముననే యున్నదన్నారు.1 అట్లనినారేగాని అసనపురము ప్రస్తుత మే పేరున వ్యవహరింపబడుచున్నదో, యెచటనున్నదో మాత్రము వివరింపలేదు. శివ సాన్నిధ్య వర్తులగు శ్రీ భావరాజు వేంకటకృష్ణారావు పంతులుగారు మాత్రము "If (Ghatika of Asanapur) might have stood in the vicinity of Kanteru in the modern Guntur District" అని అభిప్రాయపడినారు. ఆకారణముచే నీ సమస్య అపరిష్కృతముగనే యుండిపోయినది !

ఈ విషయ చర్చనే ప్రధానాంశముగా దీసికొని శ్రీ కె. సూర్యనారాయణగారు బెజవాడలో జరిగిన మూడవ ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెసు మహాసభలలో నొక పరిశోధన వ్యాసమును సమర్పించినారు. అందువారు చాళుక్య జయసింహ వల్లభుడిచ్చిన అమ శాసనములలో సుప్రాహ్యాత్తమైన అసనపుర

1. Siva Sarma, who received Polamuru by the grant of Madhava Varma is said to be a native of "Kunduka" - a village in Kamma Rastra, While his son Rudra Sarma, who regained the same village is said to be a native of Asanapura, a village close by Polamuru (Ramachandra PurTk) in Guddavadi Vishaya. The village of Asanapura is still found a few miles off Draksharama in the East Godavari Dt-J. A. H. R. S. Vol VI.

ప్రశంసలను, దానమొసర్చబడిన గ్రామ ప్రశంసలను దెచ్చి, అసనపురస్థల నిర్ణయము చేయ యత్నించినారు. వారి మతానుసారము అసనపురము యలమంచిలి తాలూకాలోని సర్వసిద్ధి-అచ్చెల్లపుర ప్రాంతమే అయియుండవలెనని తెలుచున్నది. ఇంకను స్పష్టముగా చెప్పవలసివచ్చుచో నది అచలపురాగ్రహారమనియే చెప్పనగును.2 అందులకు వారు చూపిన ఉపపత్తు లేమియో పరిశీలింతము.

పూర్వ 'ప్లకి' విషయముగా ప్రసిద్ధిగన్న నేటి యలమంచిలి తాలూకాలోని సర్వసిద్ధి గ్రామము (ఈ గ్రామము సర్వసిద్ధి బిరుదాంకితుడగు చాళుక్య ప్రథమ జయసింహ వల్లభుని పేర నాతనిచే నిర్మింపబడినది) దగ్గరలోనున్న అచ్చెల్లపురాగ్రహారమే (అచ్చెల్లపాలెం) అసనపురమని చెప్పవీలున్నది. ఈ అగ్రహారము నకు పురాతన కాలమున చెప్పుకోతగిన ప్రశస్తిగలదు. ఇందు దొరికిన మృణ్మయపాత్రలు, ఉన్న పాటి దిబ్బలు ఆ అగ్రహారపు పురాతనత్వమును, శోభను వ్యక్తీకరించుచున్నవి. అందులకుతోడు అసనపుర ప్రశంసలుగల శాసనములు పెక్కు చాళుక్య జయసింహునిచే నీయబడినవే: ఆ జయసింహ వల్లభునకు సర్వసిద్ధి యను బిరుదమున్నది. ఈతని పేరుననే సర్వసిద్ధి గ్రామము వెలసినది. అది బహుశః జయసింహుని చేతనే నిర్మింపబడియుండవలెను. లేదా-అతని తరువాతి చాళుక్య నృపాలురచే నాతని పేరున నిర్మింపబడియుండ వలెను. ఈ సర్వసిద్ధి గ్రామము అచ్చెల్లపురాగ్రహారమునకు చాల దగ్గరలోనున్నది. అందుచే జయసింహ వల్లభుని శాసనములలో నుదహరింపబడిన అసనపుర మీ అచ్చెల్లపురాగ్రహారమై (సర్వసిద్ధి గ్రామమునకు చేరువగుటచే జయసింహ వల్లభునకు ప్రీతిపాత్రమై) యుండవలెను. అట్లుగాకున్నచో అసనపురము లో నొక భాగమును విడదీసి, తనపేర సర్వసిద్ధి నామముంచి, తద్గ్రామమును దన రాజధానిగ జేసికొని యుండవచ్చును. ఏ విధిని చూచినను సర్వసిద్ధి-అచ్చెల్లపురాగ్రహారమే అసనపురమని నిర్ధరింపవచ్చును.

శ్రీ సూర్యనారాయణగారిట్టి ఊహ చేయుటలో ముఖ్యమైన యొక ప్రాథమిక విషయమును విస్మరించినారు. అదే మన-జయసింహ వల్లభుడు తనపేర సర్వసిద్ధి గ్రామమును స్థాపించుటకు యెంతో కాలము ముందుగనే అసనపుర గ్రామమున్నట్లు గ్రహింప కుండుట: అసనపురము అగ్రహారముకాదు. ఘటికా స్థానము. అందు వేద వేదాంగ వేత్తలగు బ్రాహ్మణ పండితులనే కులావాస మేర్పరచుకొని యుండిరేగాని ఆ పురమెవ్వరికినియే ప్రభువు అగ్రహారముగా జేసి దానమొసంగినదిగాదు. అయితే అందువసించు అనేకమంది అష్టాశైన పండితోత్తములకు ప్రభువు లితరగ్రామముల నగ్రహారముల జేసి దానమిచ్చి యుండిరేగాని, అసనపురమునట్లు గావించి యుండలేదు. అందువలన శ్రీ సూర్యనారాయణగారూహించినట్లు అచ్చెల్లపురాగ్రహారమే అసనపురమని యనుటయెంత మాత్రము చెల్లదు. జయసింహ వల్లభుడు అచ్చెల్లపురాగ్రహారము లోని కొంతభాగమునుగాని 'అసనపురము' లోని కొంత భాగమును గాని విడదీసి, తనపేర సర్వసిద్ధి గ్రామమును నిర్మించెననుట గూడ పొసగదు. ఏలనన దాన మొసంగబడిన అగ్రహారములో కొంత భాగము విడదీసి, తనపేరున వేరొక గ్రామముగా యేర్పరించుట, అట్లేర్పరచిన గ్రామమును అగ్రహార ప్రతిపత్తితో నుంచక తప్పుట ధర్మవిరుద్ధమును, మహాపచారము నగును. అట్టి అధర్మవర్తనకు చాళుక్య ప్రభువులు పాల్పడిరని యూహించుట సాహసమేయగును. కావున చాళుక్య జయసింహుడు అచ్చెల్లపురాగ్రహార భాగమును విడగొట్టి, తనపేర సర్వసిద్ధి గ్రామమును నిర్మించినాడనుట సమంజసముగాదు. అదియునుగాక యలమంచిలి ప్రాంతమున ఘటికాస్థానము లేవియు నెలకొని యుండినట్లు కానరాదు.

జయసింహ వల్లభుడు క్రీ॥ శ॥ 641వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చునప్పటికి "పిష్టపురము" రాజధానిగనుండెను. అతనికి కళింగగాంగులు, వేంగిపాలకులు, విశ్వాసహీనులైన సామంత మండలేశ్వరులు శత్రుకోటిలోనివారై సిలుగుల కల్పించిరి. వేంగిపాలకులప్పటిలో విష్ణుకుండిన వంశీయులే: వారిని జయించిన గాని వేంగీ రాజ్యమున జయసింహుని ఆధిపత్యము సుస్థిరముగాదు. కావున ప్రథమముగా జయసింహుడు వేంగిపాలకులపై దండెత్తిపోయి, వారలనోడించి, తన స్థానమును సుస్థిర మొనరించుకొనదలచెను. అట్టి సంకల్పముతో నాతడు వేంగిభూమిపై తన రణ వ్యాపారము ప్రారంభించి, తదుద్యమములో జయము సాధించెను. జయసింహ వల్లభుడు తొలివిజయము సాధించిన ప్రదేశము పిష్టపుర-వేంగీపుర మధ్యస్థ భాగమై యుండవలెను. అందుచే అది గోదావరి తూర్పుననున్న జనావాసమై యుండెననుట కెట్టి సందేహముమలేదు. అకారణముననే తొల్లి విష్ణుకుండినులపరమై యున్న గుద్దవాడి విషయమీ విజయముతో చాళుక్యపరమై, యందుండు గ్రామములపై నాధిపత్యము సంక్రమించెను. ఈ విజయ మాతడు రాజ్యమునకువచ్చిన 5వ వత్సరమున ననగా క్రీ॥శ॥ 646వ సంవత్సరములో లభించెను. విజయము సాధించుటయే తడవుగా

2. After a Consideration of identifying Asanapura with so many places mentioned, the most possible thing appears to be to identify it with the Present Achalapura agrahara. Many Pottery pieces and Patilands in Sarvasiddi - Achala Puragrahara vicinity still remain as the heritage of Sarvasiddi Jayasimha's Asanapura.

విజయ స్కంధావారమునుండియే విష్ణుకుండినులిచ్చిన పిదపవచ్చిన రాజకీయకల్లోల పరిస్థితులలో "శివశర్మ" కుటుంబమునుండి చేజారి పోయిన ఆ 'పొలమూరు" అగ్రహారమును, పూర్వ అగ్రహారీకు డై నట్టియు, అసనపుర వాస్తవ్యుడైనట్టియు "రుద్రశర్మ"కు దాన మొసంగుట ఔచితీసహము, సమంజసమని నమ్మి జయసింహుడట్లొనర్చెను. ఆ విజయానంతరమే జయసింహ వల్లభుడు తన రాజధానిని వేంగీపురమునకు మార్చుకొనెను. అప్పటికి "సర్వసిద్ధి" గ్రామము వెలిసియుండలేదు. అనిన అసనపురము గాని అచ్చెల్ల పురాగ్రహారము గాని విభాగింపబడలేదనియు, జయసింహ వల్లభుడు కళింగ దేశపు రాజులతోను, తత్ప్రాంత సామంతులతోను తలపడి యుండలేదనియు స్పష్టపడుచున్నది. కళింగమును శత్రుహస్తముల నుండి జయించి, స్వాధీనము చేసికొనకుండగనే, ఆ ప్రాంత మందున్న అచ్చెల్ల పురాగ్రహారమునుగాని, అసనపురమునుగాని జయసింహుని తలంపునకు తెచ్చుకొనుటయైన వీలులేదు. అట్టి పరిస్థితులలో పొలమూరు గ్రామ దానమునాటికేయున్న అసన పురము జయసింహుని కళింగ దేశ విజయానంతరము ప్రసక్తింప బడవలసిన అచ్చెల్లపురాగ్రహార, అసనపుర ప్రశంసలు, సర్వసిద్ధి గ్రామ నిర్మాణ వృత్తాంతములుత్పన్నముగావు.

వేంగీ విజయానంతరము తనకు మిగిలిన శత్రుప్రబలగు గాంగరాజుల నిర్జింప నుద్యమించి, కళింగముపై దండెత్తిపోయి, విజయము సాధించిన పిదపనే కావలయు జయసింహ వల్లభుడు తనపేర యలమంచిలి, తాలూకాలో సర్వసిద్ధి గ్రామమును నిర్మింప జేసి, దానిని పాలనా సౌకర్యముకొరకు తనరెండవ రాజధానిగ జేసికొని, కళింగ ప్రాంతమున రాజద్రోహము తలయెత్తకుండ కట్టుదిట్టమొనరించి, తదనంతరమా గ్రామమున దన ప్రతినిధిని నిల్పి పాలనము సాగించెను. కావున జయసింహుడు రాజ్యమునకు వచ్చుసరికే విష్ణుకుండిన నృపాలురచే స్థాపింపబడి, పోషింపబడు చున్న ఘటికా స్థానములలో మేటియైన అసనపుర ఘటికాస్థానము వేద వేదాంగ విదులగు పండితోత్తములకాటపట్టమై, ప్రఖ్యాతి వహించి యుండెనని స్పష్టమగుచున్నది. ఈ కారణమున అసనపుర స్థల నిర్ణయమై శ్రీ సూర్యనారాయణగారి సిద్ధాంత మసంగతమని పొలమూరు అగ్రహారమును తిరిగిపొందిన రుద్రశర్మ నివాస మైన అసనపురము పిష్టపుర—వేంగీపుర మధ్యస్థమై, పొలమూరు సమీప గ్రామమై యుండవలెనని లుచున్నది.

ఏతావత తేలిన విషయమేమన నిక్కరణ వ్యాపారియగు జయసింహవల్లభునకు శాశ్వతమైన రాజధానీ నగర మొకటియని నిర్దిష్టముగా నుండక, పాలనా సౌలభ్యమును బట్టి, యుద్ధ తంత్ర నిర్వహణ కొరకు సమయానుకూలముగా మారుచు వచ్చెనని తెలియగలదు. రాజధాని పిఠాపురమునుండి వేంగీనగరము, అట నుండి ఉదయపురము, అటనుండి సర్వసిద్ధి మొదలగు తావులకు మారుచు వచ్చెను.

జయసింహ వల్లభుని తర్వాత అసనపుర ప్రశంస రెండవ విష్ణువర్ధనుని (క్రీ॥శ॥ 673-682) కాలమున వినవయ్యెడిని. క్రీ॥ శ॥ 668వ సంవత్సరమున నీతిపిచ్చిన పల్లివాడ (పట్టెవాడ) గ్రామ దాన శాసనములో గృధ్రవాడి విషయములోని "అరుంత కూరు" ఆశ్రయ ప్రాంతములోగల ఈ గ్రామమును "కందేరు" (కంతేరు) వాటి విషయములోని "అసనపురనగర" వాస్తవ్యుడు "ధృవశర్మకు" యిచ్చినట్లు టంకింపబడినది. ఆవిధిని "అసనపుర" మొకనగరమని, అది కంతేరువాటి విషయము లోనిదని స్పష్టమగు చున్నది. కందేరు నాటి విషయము, గండేరు వాటి విషయము, కంతేరు వాటి విషయము లొక్కటే ! అందువలననే శివసాన్నిధ్య వర్తులగు శ్రీ భావరాజు వేంకటకృష్ణారావు పంతులుగారు అసనపురము నేటి గుంటూరు జిల్లాలోనుండి యుండవలెనని అభిప్రాయపడిరి.

కందేరు, గండేరు, కంతేరు వాటి విషయములు నేటి గుంటూరు జిల్లాలోనే యుండి వేరొకచోట లేవన్నవాదముతో నేనేకీభవింపను. ఏలనన - గుంటూరు మండలములోని వానిగా గుర్తింపబడిన నిడుబ్రోలు, కంటేరు (కంతేరు) గ్రామములు గోదావరీ మండలములోగూడ నున్నవి. ఇదిగాక అసనపుర వాస్తవ్యులగు కొందరకు కొంబర్రు మరికొందరకు పెణకపర్రు అను గ్రామములలో కొంతభూమి దానము చేయబడి, శాసనము లొసంగ బడెను. ఈ గ్రామములన్నియు తూర్పుగోదావరిజిల్లాలోనివిగా కూడ కన్పట్టుచున్నవి. చాళుక్య జయసింహుని తమ్ముని కుమారుడగు రెండవ విష్ణువర్ధనుడు 'అసనపుర' వాస్తవ్యుడగు 'ధృవశర్మ'కు గుదవ్రిహార విషయములోని 'పల్లెవాడ' (పట్టెవాడ)లో కొంత భూమిని దానమిచ్చెనని పైన పేర్కొన్నాను. ఈ 'ధృవశర్మ' 'అధీత వేదద్వయు' డని పేర్వడసినవాడు. గుద్రహార విషయము నేటి 'రామచంద్రపురము' తాలూకాకు వర్తించునని సర్వజన విదితము. 'పొలమూరు' గూడ నీ గుదవ్రిహార విషయమని మున్ను గానే తెలుపబడినది. ఈ విధిని చూచిన 'అసనపురము' గోదావరి జిల్లాలో నొక మహానగరమై, వేదవేదాంగ విద్యలయందు నిష్ణాతులైన పండితోత్తములకాలవాలమై, దేశమేలు ప్రభువుల కభిమాన పాత్రమై విటసిల్లుచుండెడిదని స్పష్టమగుచున్నది. దాక్షారామము చెంతనే 'అసనపురము' న్నట్లు కీ॥ శే॥ శ్రీ చాగంటి శేషయ్య గారభిప్రాయపడిరిగాని, యిదమిత్థమని నిర్ధారింపలేక పోయిరి !

ఇంతవరకు నడచిన చర్చవలన 'అసనపుర' స్థలనిర్ణయ సమస్య శేష ప్రశ్నగానే నిలిచిపోయినది.

ఆంధ్రదేశములో ఘటికాస్థానములు సర్వశాస్త్ర పారంగతులు, వేదవేదాంగ వేత్తలు, పురాణేతిహాస విజ్ఞాన కోవిదులు, ధర్మశాస్త్ర ప్రవీణులు, తత్త్వజ్ఞులు, పౌరాణికులు, మంత్రవేత్తలు, యజన, యాజనాదికర్మ దీక్షాపరులు, కవిప్రకాండులు సభ్యులుగా నుండు విద్వజ్జన సమాజములు. ఈ విషయమును 'ఆంధ్రుల సాంఘిక' చరిత్రమున కీ॥ శే॥ శ్రీ సురవరపు ప్రతాపరెడ్డిగారు ప్రస్తావించి యున్నారు. ఈ సమాజములలో పలుతావుల నుండి వచ్చిన పండితులు తామెరిగిన విద్యలనందు ప్రదర్శించి, ప్రశంస లందుకొని, సమ్మానింప బడుచుండిరి. విశేష శేముషీ విభవ సంపన్నులగు వారిలో మిన్నలుగా మన్ననలందుకొన్నవారు ఆయా ఘటికాస్థానములందాచార్య పదవు లందుకొని, ఘటికా సామాన్య బిరుదవిరాజమానులగుచుండిరి. కవులు తమ కావ్యగానమున స్వీయ ప్రతిభావ్యుత్పత్తుల వెల్లడించి, పండితుల ప్రశంస లందుకొను చుండిరి. విద్యావిషయకశాస్త్ర చర్చ లోహరి సాహిరిగసాగింపబడి, అపోటీలలో విజయము సాధించినవారు కీర్తి ప్రతిష్టల సంపాదించు కొనుచుండిరి. ఘటికాస్థానాచార్యులు శిష్యకోటికి విద్యాభిక్షపెట్టుచు వారిని ఆయాశాస్త్రములందు నిష్ణాతులుగ బచరించుచుండిరి. ప్రభువుల అభిమానపాత్రములై, దినదినాభివృద్ధినందుచున్న ఈ ఘటికా స్థానములు రాజకీయముల జోలికిపోక, స్వతంత్ర స్వతంత్ర సంస్థలుగా ప్రవర్ధమానములు చుండుటచే ప్రతిభావంతులగు పండితుల నా దేశ ప్రభువు లత్యాదరణమున సంభావింపచు, గౌరవము నెఱపు చుండెడివారు. ఈ ఘటికాస్థానములకు తత్కాల పతులే అధ్యక్షత వహించి, కార్యక్రమముల నిర్వర్తింపుచుండెడి వారు. కన్నడదేశము ప్రభువే అట్టి సమాజమున కధ్యక్షత వహించెడువాడు. ఇట్టి సభలే తమిళ దేశమున 'సంగరాజము'లని పేరన ఆంధ్రలోని ఘటికాస్థానములకుద్దియై విలసిల్లెను. అవి పదవశతాబ్ది ప్రారంభము నాటికే రూపటిపోయెను.

ఇట్టి మేటి లక్షణములు కలిగిన ఘటికా స్థానములకెల్ల నాయకమణియై విలసిల్లిన 'అసనపుర ఘటికాస్థానము'' 'నేటి' రాజమహేంద్రవరమ''నియే ఘంటాపథముగ జెప్పవచ్చును. క్రమశః 'అసనపుర' ప్రశంస 'రాజమహేంద్రి' నామ ప్రశంసలో నణగి పోయియుండును. ఘటికాస్థానములకెల్ల ముఖ్యలక్షణమైన పాండితీ ప్రకర్షణలు, శాస్త్రచర్చలు, కవితాగోష్ఠులు, అవధానాది కవితా ధోరణులు, వేదాంత చర్చలు, మత ప్రసక్తులు మొదలగునవియెల్ల రాజమహేంద్రి (పూర్వము అసనపుర ఘటికాస్థానము) విద్వజ్జన సమాజములో ప్రతిబింబించి, రాజరాజ నరేంద్రుని కాలమున నన్నయ భట్టారకుని కవితా ప్రాగల్భ్యమున పతాకస్థాయినందుకొని అక్షర రూపముదాల్చి వెలార్చినవి. అసనపుర ఘటికాస్థానమున కున్న లక్షణములెల్ల 'రాజమహేంద్రి' కవి సమాజమునకు ఆ నగరమునకు సరిపోవుటచేతను, ఇతర ఘటికాస్థానములీలక్షణము లన్నింటిని కలిగియుండుటకు కారణము చేతను, పూర్వపు అసనపుర ఘటికాస్థానము 'రాజమహేంద్రి'మైనదని చెప్పసాహసము కలుగు చున్నది. ఈ నిర్ణయము పూర్వచరిత్రకారుల అభిప్రాయములకను గుణముగానున్నదని భావించుచున్నాను.

చాళుక్య రాజ రాజ నరేంద్రునిచే నన్నయ భారతాంధ్రీకరణ మహోద్యమమున కభ్యర్థింపబడినపుడు ''దేవా! నీ యనుమతంబున, విద్వజ్జనంబుల యనుగ్రహమునంజేసి, నానేర్చు విధంబున నిక్కావ్యంబు రచియించెదనని'' తొడంగినప్పుడు నన్నయ మనో భావమున నీ ఘటికా స్థాన సాంప్రదాయమే గోచరించి, ఆ ఘటికా స్థానములందుండు విద్వజ్జనుల యనుగ్రహమే తన కావ్యసృష్టికి తుష్టి, పుష్టి నిచ్చునను విశ్వాసమును ప్రకటింపజేసెను. అంతతో తృప్తిపడక, ఘటికాస్థానమందలి కవిసమాజముల స్వరూప స్వభావ ముల దన మనమున చిత్రించికొని ఇట్లు వెల్లడించినాడు;

చ॥ పరమ వివేక సౌరభ విభాసిత సద్గుణ పుంజ వారిజో
త్కరరుచిరంబులై, సకలగమ్య సుతీర్థములై, మహా మనో
హరసు చరిత్ర పావనపయః పరిపూర్ణములైన సత్సభాం
తరసరసీవనంబుల ముదంబొనరం గొనియాడి వేడుకన్॥

అని ఘటికా స్థానములకుద్దియైన విద్వజ్జన సభావర్ణనము చేసినాడు. ఇట్లొనర్చుటలో నాటి ఘటికా స్థానాంతర్గత కవి, పండిత సమాజములకెట్టి ప్రాశస్త్యముగలదో కన్నులకట్టినట్లు గోచరింప జేసినాడు. తన్ను పోషించు ప్రభువునుగాని, ఆతని పేరోలగ శోభనుగాని నన్నయ వర్ణింపక, ప్రాముఖ్యమెల్ల విద్వజ్జన సభా మంతలి కొసంగుట నాటి ఘటికా స్థాన విశిష్టతను చెప్పకయే చెప్పుచున్నది. అట్టి ఘటికా స్థాన శోభను ''రాజమహేంద్ర'' మున రాజ రాజు కాలమువరకు కవి సమాజములు పుణికి పుచ్చుకొన్నవని చెప్పుటతిశయోక్తి కానేరదు. అందుచేతనే పూర్వ ''అసనపురము'' ''రాజమహేంద్రము''గా పిదప కాలాన నామ పరివర్తన మొందిన దని చెప్ప సందియ పడనవసరము లేదు!

విష్ణుకుండిన ప్రభువులచే స్థాపింపబడి, క్రీ॥ శ॥ 920లో అమ్మరాజ విష్ణువర్ధనిచే రాజధానీ నగరముగా జేయబడునంత వరకు ''అసనపుర ఘటికా స్థానము'' గా వ్యవహరింపబడి, రాజధానీ నగరమునకు కావలసిన హంగులన్నియు గూర్చుకొన్న యాస్థానము ''రాజమహేంద్ర''మను నామకరణమున చరిత్రకెక్కు వరకు దిన దిన ప్రవర్ధమానమై, తనపేరు ''రాజమహేంద్రము''గా పరివర్తనమందు వరకు బహుఖ్యాతి గాంచి మించినది. ఏతావత ''రాజమహేంద్రమే'' పూర్వ అసనపుర మన్నమాట!

"చరిత్ర విద్యాధర" శ్రీ తురగా కృష్ణమూర్తి
పిట్టల వేమవరం.

# ఆర్థికాభివృద్ధి - కొన్ని ఆలోచనలు

ఆర్థికాభివృద్ధిపై మార్చి 1981 "భారతి"లో వెలువడిన వ్యాసం సందేశాత్మకంగా ఉండడమే కాకుండా ఆలోచనలను రేకెత్తింపజేసే అంశాలను పొందుపరచుకొని ఉండడం చాలా సంతోషించదగ్గ విషయం. వ్యాస రచయితలు అభినందనీయులు. అయితే ఆర్థికాభివృద్ధిని పారిశ్రామికీకరణం సాధించడంతో సమానంగా వెలువరించిన కారణాలు మాత్రం సమంజసంగా లేవు. ఆ విషయాన్ని వివరించడమే ప్రస్తుత వ్యాస ప్రధానోద్దేశ్యము.

"ఒకదేశంలోని ప్రజలలో ఎక్కువశాతము వ్యవసాయ దారులుగా ఉండడమనేది పేదరికం యొక్క ఫలితంగా దానికి కారణం మాత్రం కాజాలదు"-అని మొదటి కారణంలో వ్యాసకర్తలు సెలవిచ్చి ఉన్నారు. వ్యావసాయిక దేశాన్ని పేదదేశంగా భావించడం సబబనిపించుకోదు. పైగా వారు చెప్పిన రెండో కారణం చూడండి.

"పారిశ్రామికాభివృద్ధి అనేది వ్యవసాయ రంగం యొక్క అభివృద్ధిపైన ఆధారపడి యున్నది. వ్యవసాయ రంగం అభివృద్ధి చెందకపోతే పారిశ్రామిక రంగానికి కావలసిన ముడిపదార్థాలు మరియు ఆహారధాన్యాలు సమృద్ధిగా లభ్యం కాకపోవడంవల్ల పారిశ్రామికాభివృద్ధి కుంటుపడుతుంది"-ఇదీ వ్యాఖ్య. అంటే వ్యవసాయి రంగంలో అభివృద్ధిని సాధించి ఉంటేనే తప్ప పారిశ్రామిక ప్రగతిని సాధించడం దుర్లభమనే అర్థాన్ని ఈ వివరణ స్ఫురింపజేస్తొందని అనుకోవడంలో పొరపాటు ఉండదు. అది సరియైనదనే భావాన్ని కనబరచినప్పుడు వ్యావసాయిక దేశాన్ని పేద దేశంగా గుర్తించడమనేది వివేకవంతమయిన చర్య అనిపించుకొంటుందా ? అసలా విధంగా అనడం ఎంతవరకు న్యాయం ?

అవలా ఉంచితే ఎకనమిక్ గ్రోత్‌ను "ఆర్థిక వృద్ధి"గాను, ఎకనమిక్ డెవలప్‌మెంట్‌ను "ఆర్థికాభివృద్ధి" గాను నిర్దేశించడం ఆమోద యోగ్యంకాదని భావిస్తు న్నాను. ఆ రెండు తెలుగు పదాలకు ఏ విధమైనభేదమూ లేదనే నేననుకొంటున్నాను. ఎకనమిక్ గ్రోత్‌ను "ఆర్థికోత్పత్తి" గాను, ఎకనమిక్ డెవలప్‌మెంట్‌ను "ఆర్థికోన్నతి" గాను గుర్తిస్తే నిర్దుష్టంగా ఉంటుందని స్పష్టంగా కూడ అర్థమవుతుందని నా సూచన. ఉత్పత్తి పెరగడంవల్ల ఉన్నతి ఏర్పడుతుంది. లేదా ఒక వ్యవస్థ యొక్క ఉన్నతి ఆ వ్యవస్థలో రూపొందబడే అనేక వస్తువుల ఉత్పత్తి శాతంపైన ఆధారపడి ఉంటుందని అర్థం చెప్పుకోవచ్చు. ఈ పదాలు స్వయంగా విశదపరచు కోవడమే కాకుండా ఏ విధమైన అర్థ విభేదాలకూ తావివ్వవు. వీటిని ఉపయోగించడం శ్రేయస్కరమని నా అభిప్రాయం. వ్యాస రచయితలు పరిశీలించగలరు.

ఇకపోతే "ఆర్థికోన్నతి" ద్వారా- "సంప్రదాయాచారాలకు, కట్టుబాట్లకు ప్రాముఖ్యత తగ్గి, ప్రజలలో శాస్త్రీయమైన దృక్పథం ఏర్పడుతుంది." _ అని అనడం ఏమి సాధించడానికో నా కర్థం కాలేదు. సంప్రదాయాలకు, ఆచారాలకు, కట్టుబాట్లకు "శాస్త్రీయ దృక్పథం" లేదని అర్థమా ? నవీన ఆర్థిక శాస్త్రానికే "శాస్త్రీయ దృక్పథం" ఉందని అర్థమా ? ఎలా అర్థం చేసుకోవాలి ? ఏ శాస్త్రరీత్యా తెలుసుకోవాలి ? చాణక్యుని అర్థశాస్త్రంలో సంప్రదాయాలకు, ఆచారాలకు, కట్టుబాట్లకు—ఆర్థిక వ్యవస్థకు మధ్యనున్న సామాజిక అవగాహనకు ఎంత ప్రాముఖ్య ముందో రచయితలకు తెలియదా ? శాస్త్రీయతకు సరియైన నిర్వచనమేమిటి ? గణాంక విశేషణా ? కాక భావ సంశ్లేషణా ? వ్యాసకర్తలు ఆలోచించెదరు గాక !

"ఆర్థికోన్నతి" జాతి ప్రగతినే నడపగలుగుతుందని అనడం భావ్యం కాదు. జాతి ప్రగతిని సుస్థిర పరచడంలో "ఆర్థికోన్నతి" అనేది కేవలం ఒక అంశం మాత్రమే. శ్రామిక సామర్థ్యం, గమనశీలత, ఉదమత్వం మొదలైనవి పెరగడానికి "ఆర్థికోన్నతి" మాత్రమే కాదు, ఇంకా చాలా చాలా కావాలి ! వాటిని గుర్తించవలసిన అవసర ముంది.

ప్రకృతిని తమ అవసరాల కొరకు సక్రమంగా ఉపయోగించుకొనే సామర్థ్యం భారతీయులలో లేదనడం సాహసం. పైగా ఎవరో కోన్‌కిస్కాలన్న "భారతదేశం సంపన్న వంతమైనది, కాని భారతీయులు పేదవారు"- అనేమాటను అదే పనిగా తెలియజేయడం బాధపడవలసిన విషయం. నిజంగా మనమాస్థితిలో ఉన్నామా ? రాజకీయంగా దిగజారినమాట నిజమే ! నైతికంగా దిగజారు

తున్న మాట నిజమే ! నియతి తప్పుతున్నాము. నిజా యితీ మరచిపోతున్నాము. కాని మన మేధాసంపత్తి చెక్కుచెదరలేదు. సమస్త విశ్వానికీ ఎంతో చెప్పగలిగే స్థితిలో ఉంది. అయితే దాన్ని వెలుగులోకి తీసుకొని రావాలి ! ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా ! అప్పుడు మనం అందరికన్నా మెరుగ్గా ఉండగలం !

ఎవరు కాదనగలరు ?

"ఆర్థికోన్నతి" అనేది ముఖ్యంగా వ్యక్తిపైనే ఆధారపడి ఉంటుంది. కాబట్టి వ్యక్తిస్థాయిలో అభివృద్ధిని సాధించ గలిగినట్లయితే వ్యవస్థ స్థాయిలో అభివృద్ధి అదంతట అదే సాధ్యమవుతుంది. వ్యక్తిగత వికాసానికి దారితీయ వలసిన అవసరముందని, దారి చూపవలసిన అవసరంకూడ ఉన్నదని విజ్ఞులైన శాస్త్రజ్ఞులు గుర్తించాలి.

డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

తి రు ప తి

# భొట్టు

1980 డిశంబరు 'భారతి' కంగూరగంపలో శ్రీ రావి రంగారావుగారు గురజాడ వారి 'భొట్టు' అను కవితను వచన కవిత అని నిరూపించడానికి ప్రతిపాదించిన అంశములు సమంజసమైనవికావు. గురజాడవారు తమగేయాలలో అక్కడక్కడ ఛందోభంగాలు చేయడం పరిపాటి. అంతేకాదు, కొన్నిచోట్ల వారు ఛందస్సు కనుకూలించేటట్లు లఘువులను గురువులుగా సాగదీయడం కూడా జరిగింది. ఇంకా కొన్నిచోట్ల ఛందోనుకూలమునకై వారు గ్రామ్యాన్ని కూడా వాడడానికి వెనుదీయలేదు.

'దేశాభిమానం నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయ్.
పూని ఏదైనాను ఒకమేల్
కూర్చి జనులకు చేయవోయ్.'

అన్న గేయంలో మొదటి పాదంలో 'దే' అన్న అక్షరం ఛందస్సు ప్రకారం అధికమైందని చెప్పనవసరంలేదు. మూడవ పాదంలో 'ఏదైనను' పదం ఛందస్సు కనుకూలించేటట్లు 'ఏదైనాను'గా మార్చబడింది. ఇక్కడ 'న'నాగా సాగదీయబడిందనడం ప్రత్యక్ష సత్యం.

పుత్తడి బొమ్మను పూర్ణమ్మను ఒక
ముదుసలి మెగుడికి ముడివేస్త్రీ.

అన్న గేయ భాగంలో 'ముడివేసిరి' అన్న క్రియాపదం గ్రామ్య రూపమైన 'ముడివేస్త్రీ' గా కుంచించబడింది. ఇదికూడా ఛందోను కూలానికై చేసిన ఒకరకపు వికారమే.

గురజాడవారు పైన చూపిన ఛందోభంగేత్యాదులు తమ కవితలలో చేయడం వారికి తెలియకుండానూకాదు, చేతకాకుండానూ కాదు. వారు ఆంగ్లభాషలో ఉద్దండ పండితులై ఆభాషలో కవిత్వం కూడా వ్రాస్తూ ఉండేవారని మనకు తెలుసు. కాన ఆంగ్ల ఛందస్సం ప్రదాయాలను కొన్నింటిని తెలుగులోకి దిగుమతి చేసుకున్నారు. ఆంగ్ల ఛందస్సంప్రదాయాను సారం కొన్ని మాత్రలు కానీ, గణాలు కానీ ఒక పద్యపాదంలో ఎక్కువ తక్కువ లుండవచ్చు. మనకున్నట్లు ఆంగ్లేయులకు ఛందస్సు విషయంలో కఠిన నియమాలు లేవు. పద్యంలోకానీ, గేయంలో కానీ మొత్తానికి ఒక ఛందోగమనమున్నట్లు మన అనుభూతి కందాలి. అంతే, ఛందస్సు కనుకూలించేటట్లు కొన్ని అక్షరాలను సాగదీయడమూ, కొన్ని అక్షరాలను కుంచించడమూ కూడా ఆ భాషలో మామూలుగా జరిగే పద్ధతే. కాన గురజాడ వారి గేయాలను మన ఛందస్సం ప్రదాయానుసారం గణవిభజన చేసి చూడడం అంత సరియైన పద్ధతికాదు.

భాషాచ్ఛందో విషయాలలో గురజాడవారు పాటించిన పై ఆంగ్లచ్ఛందోసంప్రదాయ సూత్రాల ప్రకాశంలో వారి 'భొట్టు' గేయాన్ని పరిశీలిస్తే, అది అచ్చమైన మాత్రాచ్ఛందో గేయంగా భాసించడం తథ్యం. మనం చేయవలసినదంతా - 2, 4, 5 పాదాల్లో ఒక్కొక్క లఘువును గురువుగా సాగదీయడం, 6వ పాదంలో ఒక అక్షరాన్ని కుంచించడం, 7వ పాదంలో ఒక అక్షరాన్ని కలపడం, 3వ పాదంలో 'నోటన్న' అనే పదాన్ని గురజాడ వారే ఛందస్సు కనుకూలించేటట్లు 'నోటావ'అని సాగదీసి వాడుకున్నారు. మనం చేసే మార్పులేవీ అప్పారావుగారి భాషా స్వభావానికి ప్రతికూలములైనవి కావని, వారు చేసిన పైమార్పే చెప్పక చెబుతుంది. పైన నేను ప్రతిపాదించిన కొద్ది మార్పులను చేస్తూ 'భొట్టు' గేయాన్ని క్రిందపొందు పరుస్తున్నాను. సాగదీయబడిన అక్షరాలనూ, కురుచపరచిన అక్షరాలనూ, అదనంగా చేర్చిన అక్షరాలనూ కుండలీకరణాలలో ఉంచాను. గణవిభజన కూడ చేశాను.

నూగుమీ । సపుకట్టు ।
కానరా । (నీ) బొట్టు ।
నోటావ । సిగరెట్టు ।
కోటువిం । (తా) కట్టు ।

చేకర్ర । జిలుగుపెం । (డీ) కట్టు ।
నీ (ల్) గిరికొ । లనుగట్టు ।
పై (న) విహ । రించుపై । ష్ణవబొట్టు ।

ఇప్పుడు 'భొట్టు' గేయం నడక అచ్చమైన ఖండగతి. ఇది పాడడానికి వ్రాయబడిన గేయంగా నాకు తోస్తోంది. పాటలలోలఘువులను గురువులుగా సాగదీయడమూ, గురువులను లఘువులుగా కుంచించడమూ, కొన్ని అక్షరాలను తేలికగా పలకడమూ సర్వ సామాన్యముకదా? కాన, 'భొట్టు' అను గురజాడవారి కవితను, వచనకవిత అని భ్రమపడి అది తొలివచన కవిత అని శ్రీ రంగారావుగారు చెప్పడం తప్పు.

ఆధునికాంధ్ర సాహిత్యంలో అన్ని నవ్యతలకూ ఆద్యుడు గురజాడ అని నిరూపించ ప్రయత్నించడం అంత మంచిదికాదు.

## శ్రీ శంకరగంటి రంగాచార్యులు

# "ది హవుండ్ ఆఫ్ హెవెన్" శీర్షికానువాద సమస్య

భారతి (ఫిబ్రవరి 1982) లో శ్రీ శ్రీ గారి "స్వర్గభైరవం" రావడం ఒక మైలురాయి—ఒకటి కన్నా ఎక్కువ కారణాలవల్ల. ఈ కవిత ఇంగ్లీషులో ఫ్రాన్సిస్ థాంప్సను క్రీ. శ. 1893లో ప్రకటించిన "ది హౌండ్ ఆఫ్ హెవెన్" అనే శీర్షికగల మార్మిక తాత్విక కవితకు తెలుగుసేత.

"ది హౌండ్ ఆఫ్ హెవెన్" అనేదానికి "స్వర్గభైరవం" అనే అనువాదం ఎంతవరకు సమంజసం అనే ప్రశ్న వేసికొని వ్రాస్తున్నాను.

1. వివిధ భాషలలో "హౌండ్" పదరూపాలిట్లున్నాయి.

పాతఇంగ్లీషు : హున్‌డ్; గ్రీకు: కున్, కునోస్;
డచ్చి : హౌన్‌డ్; లాటిను; కానిస్
సంస్కృతము : శున, శునక, శ్వాన

ఈపదాలన్నీ సమాన శాబ్దికాలు, సమానార్థకాలు. ఇట్టి వానిని భాషా శాస్త్రజ్ఞులు కొగ్నేట్ పదాలంటారు. కావున "స్వర్గ శ్వానం" అని తెనిగించివుంటే, కుక్క సంగతి సరే సరి అయి వుండేది. "భైరవం" హౌండ్‌కు సరైన తెలుగుసేతకాదు.

2. "భైరవ" శబ్దానికి వ్యుత్పత్తి ఇట్లా చెప్తుతారు. భైః అని అరచేది (రవం చేసేది) భైరవం. ఇది అనుమానాస్పదమే. కుక్క భౌభౌ అని అరుస్తుంది. కనుక కుక్క భౌరవం కావలెను కానీ భైరవం అనికాదు. భైరవశబ్దానికి రకరకాల అర్థములున్నాయి. అష్టవిధ భైరవులున్నారు. అసితాంగ, రురు, చండ, క్రోధ, ఉన్మత్త, భీషణ, సంహార, ఆకాశ. వీరు ఈశ్వరుని తామసాంశ స్వరూపులు. కాశీలో కాల భైరవుడుంటాడు. "కాశికాపురాధినాథ కాలభైరవం భజే" అనే స్తోత్రం ఉంది. భైరవాలయాలున్నాయి. ("భైరవ కొండ" - ఆంధ్రపత్రిక ఫిబ్రవరి 21, 1982)

భైరవి అంటే పార్వతి చండ రూపం. భైరవి, భైరి అంటే జుట్టుగల డేగ. హిందూస్తానీ శాస్త్రీయసంగీతంలో భైరవి, సింధు భైరవి, భైరవ రాగాలున్నాయి. భైరవి, సింధుభైరవి కోమల మంజుల మధుర మనోహర రాగాలు. ఇందులో భైః అనే రవం ఉండదు. గ్రోటెస్క్‌గా ఉన్న తమ నవల "స్వర్గానికి నిచ్చెనలు"ను విశ్వనాథవారు సుందరమైన సింధుభైరవి రాగాలాపన వర్ణనతో ముగిస్తారు. భైరవ రాగం శివుని పశ్చిమ ముఖం (శివునికి అయిదు మొగములు) నుండీ పుట్టిందట. దీనికి "ఆది రాగం" అని పేరు. పరమ గంభీరం. శివేతరక్షతం.

3. "స్వర్గభైరం" సమాసం వ్యాఖ్యేయం. ఇందులో "స్వర్గధేనువు" (కామధేనువు)లోవలె రూఢ్యర్థం లేదు. స్వర్గభైరవ సమాసంలోని రెండుపదాలు పరస్పర సంబంధం లేనట్టివి- "శాక పార్థివుడు" లోవలె. స్వర్గం ఇలా ఖాలో ఏకుక్కా మన పురాణాలలో చెప్పలేదు. పాశ్చాత్యుల మృతాత్మలు పోయే పాతాళలోకం "హడెస్" ద్వారంలో కావలివుండే సెర్బెరస్ అనే మూడు తలల కుక్క సంగతి పాశ్చాత్య పురాణాలు చెప్తుతాయి. ఋగ్వేదంలో శ్రాద్ధ మంత్రంలో యమదూతలుగా రెండు సారమేయాలు వర్ణించబడ్డాయి. సరమ అనే కుక్క కొడుకులు సారమేయాలంటారు. ఈ యముడు గరుడ పురాణం యముడుకాడు. ఋగ్వేద యముడు సూర్యుడే. ఇతనిది భయంకర నరకంకాదు. స్వర్లోకం, జ్యోతిర్లోకం. యమదూతలంటే మార్కండేయుని బెదిరించే మొరటాకారాలుకాదు. ఋగ్వేదయముడు సత్యధర్మ ప్రవర్తకుడు. అతని దగ్గరికిపోయే మానవాత్మలకి దారిచూపుతూ వుండే ప్రయాణ పరి రక్షకములీ రెండు సారమేయాలు. హెవెన్లీ ఎస్కోర్ట్‌డాగ్స్ అనవచ్చును. "శ్వానౌ యమ రక్షితారౌ చతురక్షౌ పథిరక్షి నృచక్షసౌ" (ఋగ్వేదం). అజస్ర జ్యోతిర్లోకానికి దారి చూపించే ఈ కుక్కలని వేదం "శ్వాన" పదం వాడింది.

4. ఇంగ్లీషు శీర్షిక : ది హౌండ్ ఆఫ్ హెవెన్
తెలుగు శీర్షిక : స్వర్గ భైరవంల అర్థం విచారిస్తాము.

హౌండ్ = వేటకుక్క, హెవెన్ = భగవంతుడు లేదా భగవంతుని లోకం.

హవుండ్ అఫ్ హెవెన్ అంటే హెవెన్‌యొక్క హవుండ్ అని అర్థం కాదు. హెవెన్ అనే హవుండ్ అని అర్థం. తెలుగులో చెప్పవలెనంటే, భగవంతుని లోకం యొక్క, లేదా భగవంతుని యొక్క కుక్క అని అర్థంకాదు. భగవంతుడనే వేట కుక్క అనైనాకానీ, లేదా వేటకుక్క లాంటి భగవంతుడనైనా కానీ అర్థం. ఈ ఇంగ్లీషు సమాస నిర్మాణం "ఫూల్ అఫ్ అస్," "యాన్ అపాలజీ అఫ్ కాంపెన్సేషన్" వంటిది. ఫూలూ, ఆసూ రెండూ ఒకడే. అపాలజీ, కాంపెన్సేషనూ రెండూ ఒకటే. అటులనే హవుండూ, హెవెనూ రెండూ ఒకడే. తెలుగులో ఇటువంటి సమాసం "కుమార సింహం" = సింహంలాంటి కుమారుడు = కుమారుడనే సింహం.

"స్వర్గభైరవం"లో ఈ అర్థ పుష్టిలేదు. స్వర్గమునకు చెందిన భైరవం, స్వర్గమనే భైరవం, భైరవమనే స్వర్గం, స్వర్గం లాంటి భైరవం, భైరవం లాంటి స్వర్గం-ఇలాగు ఎట్లా చెబితే కూడా ఈ పదాలలో అర్థం లేకపోవడమేకాక, మూలంలోని అర్థం ఏ మాత్రమూ వచ్చుట లేదు. స్వర్గం, భైరవం అనే రెండు వస్తువులు పెరుగు, వరిపొట్టు వలె విడి విడిగా ఉన్నాయి. స్వర్గం ఒకచోటు, భైరవం ఒక జంతువు.

5. నేను "నిగమశర్మ అక్క-పరమ పద సోపానము" అనే వ్యాసం (ఇది జూన్ 1980 "భారతి"లో ప్రకటితం) దాదాపు పది ఏండ్ల క్రితం వ్రాసేటప్పుడు నిగమశర్మ పలాయన పరం పరను ది హవుండ్ అఫ్ హెవెన్‌లోని మానవుని పరుగుతో పోల్చేందుకు, ఇంగ్లీషు శీర్షికకు రకరకాల తెలుగు తర్జుమాలు చేసి వున్నాను. తుదకు "వేలుపుజాగిలము" అని స్థిరపరచినాను. జాగిలం అంటే హవుండ్-వేటకుక్క. అల్లసాని పెద్దన "మనుచరిత్ర"లో స్వరోచి వేటకుక్కల వర్ణించేటప్పుడు జాగిలము అనే పదాన్నే అనేకసార్లు వాడినాడు. నా అనువాద ప్రకారం అర్థం ఇలాగుంటుంది: జాగిలం వంటి వేల్పులేదా వేల్పు అనే జాగిలం. ఇది మూలాంగ్ల సమాసార్థ సమానం. శ్రీ శ్రీ గారి సమాసం అందుకే తప్పు.

6. భైరవం" పదం నపుంసకలింగం. అయినా, శ్రీ శ్రీ గారు దీనిని "అతడు" అని పుల్లింగంలో ప్రయోగించినారు. మన భాషలో జంతువులకు నపుంసక లింగమే వాడుతాము. జంతువులే పాత్రలుగా ఉండే కథలలో లింగ భేదం పాటిస్తాము. ఉదా : పింగళకుడు జాతివాచాకానికి "డు" చేర్చినప్పుడు కూడా పుల్లింగ మవుతుంది. ఉదా : మృగేంద్రుడు. ప్రస్తుతం "భైరవుడు" అని ఉంటే రచనలోని పుల్లింగాని కన్వయమై ఉండేది. స్వరోచి వేట కుక్కల్లో ఒకదాని పేరు "భైరవుడు" అయ్యా భైరవాన్నే గోపాలం, రామం వలె పుల్లింగమను కొంటేసరిపోదా అంటారేమో సరిపోదండీ. ఎందుకంటె గోపాలం, రామంల విషయంలో పుల్లింగ నామం ఉండి వుంటుంది. భైరవం విషయంలో అట్లు కాదే!

ఆంగ్ల మూలంలో "అతడు" అనే ఉంది. మూలకవి ప్రకారం హవుండ్ భగవంతుడే కాబట్టి. భగవంతుడు పుల్లింగం కాబట్టి హవుండ్ పుల్లింగమే. మూలకవి హెవెన్ అనే పదాన్ని భగవంతుడు అనే అర్థంలోననే వాడినాడు. క్రైస్తవులు భగవంతుని సామ్రాజ్యము అనుటకు కింగ్‌డం అఫ్ హెవెన్ అని అంటుంటారు. హెవెన్ అంటే స్వర్గంకాక, భగవంతుడనడానికి ఆంగ్లమూలకవి "అతడు" అని ప్రయోగించుట అదనపు సాక్ష్యం. రెండూ నపుంసకలింగాలు కాబట్టి, కవితలోని "అతడు"తో సరిపోయేందుకు "స్వర్గభైరవుడు" అని ఉండాల్సింది.

7. అసలుకు శ్రీ శ్రీ గారు "భైరవం" అనే శబ్దాన్ని ఎందుకు వాడినారో అర్థం కావడం లేదు. భైరవం కాశీపుర కాపలి కుక్క అని అనుకొంటే అర్థం సరిపోదు. ఎందుకంటే కవితలో నుండే కుక్క వేటకుక్క కాని కావలికుక్క కాదు. ప్రస్తుత కవితలో, పట్టేసే కుక్క ఉద్దేశింపబడిందేకాని, భౌ అని అరచే కుక్కకాదు. కాబట్టి "భైరవం" పదం అసమంజసం. భైరవ పదం నోటినిండా పలుకవచ్చు. శ్రీ శ్రీ గారికి ఉండే సంస్కృత పదాడంబరతపైని సమాజాభిలాషే ఆయన్ని భైరవశబ్దాన్ని ఎంపిక చేసేందుకు పోత్సహించి వుంటుందని నా ఊహ. జాగిలం పదం శ్రీ శ్రీ గారికి తెలియదని కాదు. ఆమాట ఆయన వాడలేదనీ కాదు. ఆ మాటను వారు వారు వేరేచోట తస్పుటర్థంలో ("నరక లోకపు జాగిలమ్ములు, కొలుసు త్రెంచక ఉరికి పడ్డాయి-" మహా ప్రస్థానం) వాడినందువల్లనే జాగిలం అంటే భౌగత్యమై, శివ సంబంధపదం భైరవం వాడివుంటారని అనుమాంచవచ్చు.)

శ్రీ శ్రీ గారు "స్వర్గం" అనే పదాన్ని ఎందుకు వాడినారో అర్థం కావటం లేదు. ఆంగ్లమూలం "హెవెన్" అంటే భగ వంతుడనీ లేదా ఆయనలోకం అనీ రెండు అర్థాలున్న. ప్రకృతార్థం భగవంతుడనే అన్వయించుకోవలె. అయినప్పుడు దానికి తెలుగులో

"స్వర్గం" ఎట్లు సరిపోతుంది ? ఒకవేళకు హెవెన్ అంటే భగవంతుని రాజ్యం అని అనుకొన్నా స్వర్గం పదం సరిపోదు. స్వర్గంలో భగవంతుడుండడు కదా. కావ్యనాయకునికి కలిగింది భగవత్సాయుజ్యమే కాని, స్వర్గలోక ప్రాప్తికాదు. మన ఇద్దరు భగవంతుళ్లు-ఒకరు వైకుంఠంలోనూ, ఇంకొకరు కైలాసంలోనూ ఉంటారు. అప్పుడు వైకుంఠ భైరవం, లేదా కైలాస భైరవం అని వ్రాయవలసి వస్తుంది. భైరవపదం ఏలాగూ వాడినారు కాబట్టి శ్రీ శ్రీ గారిది కైలాస భైరవమే అనుకోవలె. మూలాంగ్ల పదం హెవెన్ అంటే భగవంతుడని అర్థం చేసుకోక పోవడంవల్ల ఇంత అనర్థం జరిగింది. కవితలోని హవుండ్ కనుక కుక్క అయితే, అది పారిపోతున్న 'హీననరుణ్ణి' పట్టుకొని ఈడ్చుకొని స్వర్గంలో వుండే తన యజమాని ముందర పడవేసి వుండవలసింది. కాని కవితలో అట్లుకాదు. హవుండ్ మాట్లాడుతుంది. మానవుణ్ణి అక్కున జేర్చుకుంటుంది. ఇదెలా సాధ్యం, అంటే అది కుక్క కాదు కాబట్టి, అది భగవంతుడే కాబట్టి, వేటకుక్క వలె వెంటాడి పట్టుకొనే భగవంతుడు కాబట్టి.

8. మానవాత్మని సత్య మార్గానికి త్రిప్పే దివ్యశక్తిని కుక్కగా రూపించడం ఋగ్వేదంలోనే ఉంది. అరవిందుల వ్యాఖ్యానాన్ని నాకర్థమయినంత వట్టు చెబుతాను. అరవిందులు ఋగ్వేదంలో అచ్చటచ్చటా వచ్చే "సరమ" ను ది హవుండ్ ఆఫ్ హెవెన్ అంటారు. అరవిందుల ప్రకారం మానవాత్మలో దాగియున్న శక్తులను సత్యస్థానానికి ("సదనం ఋతస్య") చోదనంచేసే దైవీయ అంతర్ జ్ఞానమే (డివైన్ ఇంట్యూషన్) సరమ. ఋగ్వేద సరమను, ఫ్రాన్సిస్ థాంప్సన్ "ది హవుండ్ ఆఫ్ హెవెన్" కూ గల సామ్యాన్ని 1976లో ఇండియన్ ఎక్స్ ప్రెస్సు దినపత్రికలో రేఖా రూపంలో వివరించినాను. ఫ్రాన్సిస్ థాంప్సన్ ఋగ్వేదం లోని ఇమేజరీ ని వాడినారు. అసలు అక్కడ కుక్కలేదు. దేవుడనే వ్యక్తిలేడు. జరిగే నాటకమంతా మానవాంతరంగంలోననే. యోగ వాసిష్ఠంలో జరుగుతుంటాయే అద్భుతాలు-అలాగు. ఫ్రాన్సిస్ ఇమేజరీలో ఉండే ప్రత్యేకత ఇది. సరమకానీ, సారమేయాలుకానీ పరమాత్మకాదు. కానీ ది హవుండ్ ఆఫ్ హెవెన్ లోని హవుండ్ సాక్షాత్తు పరమాత్మయే.

"త్రి"

# లేఖలు

## అసలు ఏమన్నారు ?

ఆర్యా,

మొదుపారు వేమనయోగి జయంతి స్వర్ణోత్సవాల సమీక్షతో వ్యాసం ప్రారంభించి మధ్య శ్రీ ఎస్. ఎస్. సుందరేశ్వరరావు జనవరి 82 భారతిలో రాసిన వ్యాసాన్ని విమర్శిస్తూ వేమన్నను "పామరకవి అని ఈసడించిన 'విశ్వదాత' కాశీనాధుని నాగేశ్వర రావు గారి" అని పంతులుగారిని సుపరిచయం చేశారు, (25-4-82 ఆదివారం అనుబంధంలో 6వ కాలమ్) శ్రీ గుర్రం వెంకటరెడ్డి. పంతులుగారు శతక వాఙ్మయానికి చేసిన సేవ పండితులు, పరిశోధకులు, భాషా సాహిత్య ప్రియులయిన వారికి తెలిసిందే. వారు వంగూరి సుబ్బారావుగారి శతక కవుల చరిత్ర అచ్చొత్తించి ఈయడమే కాక పంతులుగారే స్వయంగా పీఠికలు వ్రాసి అనేక శతకాలను సుపరిష్కృతంగా ప్రచురించారు. శతక సంపుటం వెలువరించారు. శతకాలను గూర్చి ఇంత శ్రమపడిన పంతులుగారు వేమన్న వంటి లోకోత్తర కవిని ఈసడిస్తారా అని అనుమానంవేసి పంతులుగారు వేమన్నను గూర్చి ఏమన్నారో వెదకి పాఠకుల ముందు పెడుతున్నాను.

**పంతులుగారు :**

"వేమన విరచితంబైన వేమన శతకము సకలవిధముల శ్లాఘ్యముగ నున్నది. వేమన మహాయోగి, మహాకవి, వేదాంతి, సత్యవాది.

"వేమన పద్యములు జడమయములైన వైదికకర్మ మార్గములను, దురాచారములను పరిహాస పాత్రముగ చిత్రించుచున్నవి. వర్తమాన కాలమునందు గాంధీ మహాత్ముని వలెనే యా కాలమునందు మతమును, సంఘమును నావరించిన మహా జాడ్యములను పరిహాసమునను, ఖండనమునను బాలుచేసి ప్రజావికాసము చేయుటకు వేమన చేసిన ప్రయత్నము ప్రశంసనీయముగ నున్నది. ఆ కాలము నందు పండితాదరణము లేకుండినను మనోహరమైన వేమన శతకము నాంధ్ర వాఙ్మయమునందు స్థిరమైన స్థానము గలిగినది" (ఆంధ్ర వాఙ్మయసూచిక (1929) పీఠిక 9వ పుట, పంతులుగారు వేమన్నను "పామరకవి" అని కాని "ఈసడించి" నట్లుగాని ఆధారం చూపగలిగితే యథార్థం బయటపడుతుంది.

ఎస్. ఎస్. సుందరేశ్వరరావు,
2-2-1137/5, న్యూ నల్లకుంట,
హైదరాబాదు - 500 044

# గ్రంథ విమర్శలు

## విశ్వ మీమాంస

[రచయిత : కావ్యకంఠ వాసిష్ఠ గణపతిముని (నాయన). వ్యాఖ్యాతః-శ్రీ అయ్యలసోమయాజుల నరసింహశర్మ. ప్రాప్తిస్థానం: కార్యదర్శి, కావ్యకంఠ భారతి, అనకాపల్లి. వెల: రు. 18/- లు]

ఎనిమిది పరిచ్ఛేదాలు, ఏభై అధికరణాలు, మూడు వందల తొంభైరెండు శ్లోకాలుగల యీ గ్రంథం విశ్వస్వరూప స్వభావాలను చెపుతుంది. స్వతస్సిద్ధమైన అంతరదృష్టితో సృష్టి స్వరూపాన్ని గుర్తించి జన్మసిద్ధమైన భావసంపదతో ప్రాచీన తత్వ విద్యను సమన్వయించి వైరుద్ధ్యాన్ని పరిహరించి సమతాదృష్టితో ఉపనిషత్తులుగా (భగవద్గీతాదులను) శ్రుతిస్మృతులనూ సమన్వయించి సుకుమారమైన వాణితో విశ్వమును విశ్వవేద్యముగా చెప్పిన విశ్వవంద్యుడు గణపతిముని.

'కుటుంబ భూతాన్ సూర్యస్య
గ్రహానేవ భువో విదుః
ఇయం చ పృథివీ యోనిః
అస్మాకం కశ్చన గ్రహః'

సూర్యునకు కుటుంబము వంటి గ్రహములనే భూములందురు. అట్టి వానిలో మనకు కారణమైన యీ భూమి ఒకానొక గ్రహము.

'ఏతం చంద్రమసం ప్రాహుః
భూమ్యా యత్త ముపగ్రహం
చంద్రాః పరోక్షా అన్యేపి
గ్రహనిఘ్న ఉపగ్రహాః

ఈ చంద్రుడు భూమ్యాయత్తముగ దానిచుట్టు తిరుగు ఉపగ్రహము. ఇట్టివి గ్రహనిఘ్నములగు గ్రహములు అనేకములు పనకగపడనివియు కలవు. (ఉపగ్రహములన్నమాట)

భూమి చుట్టూ చంద్రుడు తిరుగుతూ ఉంటాడు. చంద్రుని చుట్టూ భూమి తిరుగుతుంది. ఇది ఒక గ్రహం, అది ఉపగ్రహం-అని ఆధునిక వైజ్ఞానికులేమేమో అంటూ ఉంటారు. వారికి నాయనకు సరియైన జవాబు చెప్తుంది.

'భక్తియోగం' నాయన నిర్వచనం ఇది:

'సమర్ప్య భారమీశస్యమస్తకే భజనం సదా
అనన్యాధీనమనసా భక్తియోగ ఉదాహృతః'

భారమీశు నందర్పించి ఏకాగ్రమగు మనసుతో ఈశ్వరుని పూజించుట భక్తియోగమగును.

'నిష్కామం కర్మ యజ్ఞస్స్యాత్ తేన కర్తా న బధ్యతే
యజ్ఞేశ్వరాయ సంపన్నం తస్య కర్మైవ తద్భవేత్'

నిష్కామకర్మయే యజ్ఞము. అది కర్తను బంధించదు. యజ్ఞేశ్వరున కర్పితమై అది వాని కర్మ అగును.

కర్మవాదాన్ని అంగీకరించని వారికి ఇది చక్కని సమాధానం. ఏ విధంగానైనా కర్మాచరణం తప్పదు. దానిని ఈ శ్లోకం సమర్థిస్తుంది.

భూమి విద్యాధికరణం అందరూచదివి అంతర్యం గ్రహించవలసేదని నా అభిప్రాయం.

ప్రాణవిశిష్టత, వాగ్రీతి - ఇంతస్పష్టంగా చెప్పే గ్రంథం ఇదే అని అంటే అతిశయోక్తికాదు.

నాయన గ్రంథాలలో ఇది తల మానికం. దీని నింతకు ముందు సామాన్యమైన తెలుగుతో పూజ్యులు కీ॥ శే॥ గుంటూరు లక్ష్మీకాంతంగారు అచ్చువేయించారు. ఇది నాయనకి పుత్రప్రాయుడైన శ్రీ నరసింహశర్మ వ్రాసిన సరళ వ్యాఖ్యతో ముద్రితమై వెలుగులోకి వచ్చింది. కావ్య కంఠ భారతి ఘనకార్యం చేసిందని సర్వాత్మనా ప్రశంసిస్తున్నాను. తెలుగువారియింటింటా ఉండవలసిన "అరవాణి" - ఇది.

## శ్రీ శ్రీనివాస కథా సుధాలహరి

[కృతికర్త : శ్రీ వడ్డూరి అచ్యుతరామకవి. ప్రాప్తిస్థానం : కృతికర్త పేర, కన్నాపురం, పోలవరం తాలూకా, ప॥ గో॥ జిల్లా. వెల : రు. : 12-50 లు]

శ్రీనివాసావిర్భావము, శ్రీనివాస కళ్యాణము, శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యము - అనే మూడు వృత్తాంతాలు సవివరంగా తెలిపే భక్తి భావ సంభావ్యమైన కృతిరత్నం ఇది.

ఆదిత్య పురాణం, వరాహ పురాణం, బ్రహ్మాండ పురాణం, పద్మపురాణం - ఆధారంగ వ్రాసినట్టు కృతికర్త వాక్కు.

అచ్యుతరామకవి అమాయిక భక్తికి ఈ కృతి ఆదర్శాకృతి. పద్యరచన హృద్యంగా ఉందంటే మరి నా మాటో అంటుంది గద్య రచన. సున్నితమై మధుర భావాలతో మన్ననగా నడిచింది గద్యరచన కూడా. ఆమాత్రం ఈమాత్రం అక్షరజ్ఞానం ఉన్న చదువరికి చక్కగా అర్థం అవడం మాట అలా ఉండగా నాస్తికునకు కూడా శ్రీశ్రీనివాసుని పై నిశ్చలమైన భక్తిని కలిగిస్తుందని స్వభావోక్తిగా చెప్పవచ్చు.

పద్మావతీ శ్రీనివాసుల కళ్యాణ ఘట్టం పరమానందకరంగా ఉంది. మిగిలిన కథాభాగంకన్న ఇది అచ్యుతరామకవి రచనకి సర్వోత్తమ పట్టం కట్టిందని నా అభిప్రాయం. ఒకటికి రెండు మార్లు చదవవలసేది.

ఈ చక్కని కృతి కన్యను శ్రీనివాసునకే అర్పగించి శ్రీ అచ్యుతరామకవి ధన్యుడైనాడని వేరే చెప్పనక్కరలేదు.

తిరుపతి వేంకటేశ్వరునకు సంబంధించి తెలుసుకోవలసే కథాభాగానికి ఇది అతి ప్రామాణరూపమైన కృతి అని నిష్కర్షగా చెప్పవచ్చు.

శ్రీరాముడన్నా శ్రీనివాసుడన్నా తెలుగువారికి ఏదో వెర్రి అభిమానం. మరి అందరూ ఈ కృతిని చదివి ఆ కథాసుధా లహరిలో ఓలలాడండి, అలరండి, సాటివారిని అలరించండి.

## సాహిత్య సుధ

[కృతికర్త : డా॥ ఎస్. గంగప్ప, ప్రతులకు : శశి ప్రచురణలు, C - 13, శ్రీనివాసనగర్, గుంటూరు - 6. వెల : రూ. 15/-]

పలు పత్రికలలో ప్రకటితమై పలువురు పాఠకుల మన్నన లకు పాత్రమై ప్రశంసింపబడిన ఇరవై వ్యాసాల సంపుటీకరణమే యీ సాహిత్య సుధ.

పొగడడం తెగడడం విమర్శకి అర్థం - అని నా ఉద్దేశం. రెండూ ఉండాలి. ఏదో ఒక్కదానినే అవలంబించడం ఏకాక్షిన్యా యమవుతుంది. అయితే ఏదీ 'అతి'గా ఉండకూడదు.

కొందరు విమర్శకులు కావ్యమునందలి ఇతివృత్తాన్ని ప్రధానంగా చెప్తూ అక్కడక్కడ భాష గురించో, భావ ప్రకటన గురించో అంటీ అంటని రెండు మాటలు చెప్తారు. కొందరు ఇతి వృత్తాన్ని, సంగ్రహంగా చెప్తూ పాత్ర పోషణ, కవితా చమత్కృతి లక్షణ సంపన్నత ప్రదర్శిస్తారు. కొందరు "చక్కని రచన, ధార ధారాళముగా నున్నది - నిర్దుష్టమైన కవిత. అచ్చు ముచ్చటగా నున్నది". అనే ధోరణిలో స్వస్తి పలుకుతారు. డా. గంగప్ప విమర్శ రెండో త్రోవ నుంటుంది, అది చదివితే విమర్శకి విఘ్నేశ్వర పూజ చేసేవారికి మంచి మార్గం కనిపిస్తుంది.

నిగమశర్మ భార్యను గురించి నిజమాలోచిస్తే చెప్పడానికి అట్టే కనిపించదు. కనిపించడం మాటకేమి ? ఆ ముద్దరాలినిగూర్చి చెప్పడానికి ఎవరికీ తోచదు. ఆ గ్రంథకర్త అక్కడక్కడ ఏవో నాలుగు మాటలు వాడాడు. అవి తీసుకొని గంగప్పగారు చక్కని చిత్రం వేశారు. రేఖాచిత్రం అని ఆయన అన్నారుగాని పంచవర్ణ చిత్రమే అది. నిగమశర్మ అక్కని బయట పెట్టిన రాళ్ళపల్లి వారు గాని, సుశీలను తెలుగు గేస్తురాలుగ చూపిన నేనుగానీ నిగమశర్మ భార్య జోలికి పోలేదు. చక్కని వ్యాసం వ్రాశారు గంగప్పగారు.

రఘునాథరాయలు - వాల్మీకి - నిజంగా రఘునాథరాయల వ్యక్తిత్వం, సాహిత్య వ్యక్తిత్వం రూపొందినట్టు సలక్షణంగా సంతరించారు.

'త్రిపురాంత కోదాహరణం' సునిశిత పథంలో సాగిన విమర్శ వ్యాసం - 'ఏడుపుల సాహిత్యం'లో ఇంకా చేర్చ వలసిన 'ఏడుపు' పద్యాలు కొన్ని ఉన్నట్టు జ్ఞాపకం. 'కొసరి వసంత కాలమున కోయిల క్రోల్చిన భంగి' - అనే పద్యం 'ఉసిరిక కాయలంతలు పయోధరముల్ దిగవారునట్లుగన్' - అని పూర్తి. ఇది శ్రీనాథునిదని జ్ఞప్తి.

'పుష్ప సాహిత్యం' నిజంగా పుష్ప సాహిత్యమే.

ధూర్జటిని గూర్చి వ్రాసిన వ్యాసం చిన్నదైనా ఈశ్వరతత్వా నికి ధూర్జటి జీవితం మీదుకట్టిన పక్కని చక్కగా చెప్తుంది. నిజమే. భక్తికి పోతన, ధూర్జటులు- ఒక పాఠశాల శిష్యులే.

'గొంతిమీ కోకిల' కవితలో గంగప్పగారు ఒక్క ప్రక్క అనుకరణ మహత్వాన్ని చూపుతూ కవి హృదయ స్వాతంత్ర్యాన్ని కూడా వెల్లడించడం గణనీయం, ఇదే యీయన రచనలో విశిష్టత. కవి వ్యక్తిత్వాన్ని చెప్పడంలో గంగప్పగారు నేటి సాహిత్య పరిశీలకులలో మణి పూసగా చెప్పడం అత్యుక్తి కాదని యీ 'సాహిత్యసుధ' విమర్శ ప్రధానంగా నిదానించి ఓపికగా చదివే సహృదయుడైన చదువరి చెప్తాడు.

అధునిక వాఙ్మయంలో అగ్రగస్థాయికి చేరిన జాషువా కావ్యాల విమర్శ సముచితంగా ఉందిగాని కొస్త అతిగా ఉందా ? అని నా అనుమానం.

పెన్నేటి పాటపై వ్రాసిన వ్యాసం యుక్తియుక్తంగా ఉంది.

నవీన విమర్శ ధోరణి ఒకొక్క విధంగా ఉంటుంది. ఆ ఒకొక్క విధం గంగప్పగారి విమర్శలో కలికానికైనా కనిపించదు. ఆహా ! అని ఆనందంగా నిట్టూర్పు విడిచి ఆయా గ్రంథాలు చదవాలనే ఉత్సాహం కలిగించే తీరు గంగప్పగారి వాణీ విలాసానికి పసిడిపూత.

ఇలాటి విమర్శ గ్రంథాలను కళాశాలల్లో చదువుతున్న విద్యార్థినీ విద్యార్థులకు పఠనీయములుగా నిర్ణయించాలని నా ఉద్దేశం.

శ్రీ యామింజాల పద్మనాభస్వామి

# శబ్దరత్నావళిః

[అనువాదకర్త : శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రి, ఎం. ఏ., ప్రిన్సిపాల్, వైదిక సంస్కృత కళాశాల, నెల్లూరు. ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, సైఫాబాద్, హైదరాబాద్-4. డెమ్మీసైజు, పుటలు 501, వెల : 12-50.]

వ్యాకరణశుద్ధిగానూ, కవి సంప్రదాయ సిద్ధంగానూ వాక్య రచన చేసే వానికి అట్టి రచన, స్వర్గ సౌఖ్యాన్ని సమకూరుస్తుందని, "ఏకశ్శబ్దః శాస్త్ర సమ్మతః సుష్ఠుప్రయుక్తః స్వర్గేలోకేకా మధుక్ భవతి" అనే మహా భాష్యవచనం తెలుపుతూంది. ఇట్లే-వ్యాకరణజన్య శుద్ధి కల వాక్యం వక్తకు, ముందుగా పవిత్రతను, పిమ్మట అలంకార శోభను ఆవహింప జేస్తుందని,

"........సంస్కారవత్యేవగిరా మనీషి, తయా సపూతశ్చ విభూషితశ్చ" అనే కాళిదాసీయ సూక్తి సుస్పష్టం చేస్తూంది. ఇట్లే-వ్యాకరణ శుద్ధితో పుట్టిన శోభతోకూడిన వాక్యంలో సర్వమంగళాదేవి అనబడే మహాలక్ష్మి సన్నిహితురాలై ఉంటుందని,

"భద్రైషాం లక్ష్మీర్నిహితాధి వాచి" అనే శృతి వాక్యం విశదం చేస్తూంది.

ఈ విధంగా, వ్యాకరణ శాస్త్రీయ సంప్రదాయ సజ్జితమైన చదువు వలన, లౌకికంగానూ అలౌకికంగానూ (ఆ చదువుకొన్న వానికి) సత్ప్రయోజనాలు సంప్రాప్తిస్తాయని శ్రుతుల దగ్గరనుంచీ చాటుతున్నాయి. కనుకనే చదివినంతవరకూ, ఆ చదివిన దానికి కావలసినంత వ్యాకరణంకూడా తప్పనిసరిగా చదవాలని "అధికం యదినాధీషే తథాపి పఠపుత్ర వ్యాకరణం" అనే సూక్తి తెలుపుతూంది. ముప్పైయేళ్ళ క్రితం వరకూ సంస్కృత వ్యాకరణ పాఠం, శుచిగా ముందుగా మునిత్రయ + గురుదేవ పాదాభివందన పూర్వంగాను, సూత్రాలు సస్వరంగాను చదవడం వంటి శాస్త్రీయ సంప్రదాయాలు (ఛందోవత్సూత్రాణి భవంతి మొ॥) ఈ సమీక్షకునకు పరిచిత పూర్వాలే. ఏతావతా, లౌకిక ప్రయోజన సిద్ధిని ఆశించియైనా సంస్కృత వ్యాకరణాన్ని విద్యార్థులు తప్పక చదివి తీరాలి - సంస్కృతం సర్వభాషా జనని కదా !

రాను రాను క్రమంగా కాలప్రభావంచేత మనలో బుద్ధిబలం తగ్గుతూ వస్తూండడంచేత, వెనుకటి వ్యాకరణ శాస్త్ర గ్రంథాలలోని జటిలతను కూడా క్రమంగా తగ్గిస్తూరావడం అత్యవసరమే ఔతుంది. కనుకనే 17 వ శతాబ్దిలోని "సిద్ధాంత కౌముది"ని సంగ్రహించి సరళంగా "లఘు సిద్ధాంతకౌముది, లఘుకౌముది"వంటి వ్యాకరణ గ్రంథాలు వచ్చాయి. క్రమంగా ఇవికూడా సరళంగా మార్చవలసి రాగా 1878 లో "శబ్దరత్నావళి" వచ్చింది. వందేళ్ళనాటి ఈ సరళ వ్యాకరణం కూడా నేటి విద్యార్థులకు సుగమం చేయవలసి వచ్చింది. ఈ ముఖ్య కర్తవ్యాన్ని, శ్రీ సుబ్బరామశాస్త్రిగారు నిర్వహించడం ద్వారా వారు సంస్కృత విద్యార్థులకు మహోపకారం చేసిన వారయారు. వీరి ప్రస్తుతానువాదం మూలగ్రంథస్థ విషయాలను ఎంతగా సుగమం చేసిందో సంగ్రహంగా చూపుతాను.

**సంధిప్రకరణం మొదలు మూలం :-** "వర్ణానాం పదానాం వా సమాయోగః, లోపాఽగమాఽదేశాదివర్ణ వికారో వా సంధి రిత్యుచ్యతే. స చ సంహితా విషయే బోధ్యః ।

సంహితాతు క్వచిన్నిత్యా, క్వచిద్వివక్షా–యత్తా, తథా చోక్తం -

సంహితైకపదేనిత్యా నిత్యాధాతూపసర్గయోః।
నిత్యాసమాసే, వాక్యేతు సా వివక్షామపేక్షతే॥

**అనువాదము**

వర్ణములుగాని పదములుగాని కలియుట (సమాయోగః) సంధి యనబడును, లేదా- లోపము, ఆదేశము ఆగమము మున్నగు వానివలన గల్గు వికారము సంధి యనబడును. ఆ సంధి, సంధి నొందెడు రెండు వర్ణములకు గాని పదములకుగాని సంహిత అనగా సామీప్యమున్నప్పుడే వచ్చును. అదెట్లనగా- ఈ సంహిత ఒక్క పదము నందు నిత్యము. అట్లే ధాతూపసర్గలకు నిత్యము. సమాసమునందును నిత్యము. వాక్యమునందు వక్త యొక్క వివక్ష (ఇష్టము)ను అనుసరించి యుండును. ఏకపదమునకు ఉదా॥ రామ+ఇన అను ప్రకృతి ప్రత్యయములు కలిసి రామేణ అని పదమగును. కాన ఇచ్చట సంహిత (సంధి) నిత్యముగా చెప్పవలయును.

**ఉపసర్గ ధాతువులకు ఉదాహరణము :-**

ప్ర+ఏధతే అనుచోట ప్ర-ఉపసర్గకు ఏధతే అను ధాతువునకు సంధినిత్యముగజేసి "ప్రేధతే" అని ప్రయోగింపవలయును.—

సమాసమునకు ఉదా :- మధు+అరి అను సమాసము నందు యణాఽదేశ సంధిని నిత్యముగా జేసి "మధ్వరిః" అని ప్రయోగింప వలయును. విసంధి కూడదు. రామస్య+అనుజః అను వాక్యమును సంధి చేసియు చేయకయు ప్రయోగింపవచ్చును.

(చూ. 11+12 పేలు)

మీద చూపిన విధంగా ప్రస్తుతానువాదం, మూలమును పూర్తిగా అనుసరిస్తూ మూలంలోని విషయాలను సుగమం చేస్తూ, విద్యార్థులలో, "వ్యాకరణమంటే పెనుభూతం" అనే వెనుకటి భ్రాంతిని పార్రద్రోలుచు, వారి దృష్టిని సిద్ధాంత కౌముదీ పఠనమునకు తిరిగి సుముఖంగా చేస్తూంది. ఇట్టిది, సంస్కృత భాషతోబాటు దేశానికికూడా అభ్యుదయకరమే.

ఈ గ్రంథంలో చెప్పబడిన వివిధ విషయాలను గూర్చి, పుటల సంఖ్యతో సహా చక్కని 'విషయానుక్రమణిక' చూపబడింది. దీని సహాయంతో వలసిన విషయాలను సులభంగా పట్టుకోవచ్చును.

సంజ్ఞా ప్రకరణంలో - సంధులకు సంబంధించిన వివిధ విషయాలు చూపబడ్డాయి. ఇట్లే సుబంత ప్రకరణంలో సాధారణ విశేషశబ్దాలు, అవ్యయ ప్రకరణంలో వివిధ సమాసాలు, తద్ధిత, కృత్, సనాద్యంతాదివృత్తులు, విభక్త్యర్థ ప్రకరణంలో భ్వాది, దివాది, చురాది సాధారణ ధాతువులు, విశేషధాతువులు, సన్నంత, యజంతప్రభృతి ప్రకరణాలు, ధాతుపాఠంలో భ్వాది జుహోత్యాదులు, ధాత్వర్థ నిర్ణయం, అనువాదకర్త స్వయంగా చేర్చిన స్త్రీ ప్రత్యయ ప్రకరణం, ఇంగ్లీషు అర్థాలతో చేర్చిన-అకారాది క్రమయుక్త-శబ్దానుక్రమణిక, ధాత్వనుక్రమణిక; ఇవీ, ఈ 'శబ్దరత్నావళి'లో ఉండే విషయాలు. ఇందలి ఇంగ్లీషు అర్థాలు, ఉన్నతవిద్యాభ్యాసంచేసే విద్యార్థులకు Ph Dలో బాగా ఉపకరించేవి.

మహోన్నతమైన సంస్కృత భాషా సౌధానికి పాణినీయ వ్యాకరణం బంగారు పునాది. ఇంతేకాదు; ఇది సర్వశాస్త్రముల అభ్యాసానికి పరమోపకారకమైనట్లు "కాణాదం పాణినీయం చ సర్వశాస్త్రోపకారకమ్" అనే సత్యసూక్తి చాటుతూంది. దేశమంటే మనుజులు గనుక మానవాభ్యుదయమే దేశాభ్యుదయం. ఈ అభ్యుదయ కృత్యాన్ని నిర్వహించిన ఈ వ్యాకరణ గ్రంథ రచయిత+ప్రోత్సాహకులు కృతకృత్యులు. సంస్కృతాంధ్ర భాషలలో నిర్దుష్టమైన జ్ఞానమును సంపాదింపదలచిన వారందరికీ ఈ అనువాద గ్రంథం తప్పక చదువతగిన ఉత్తమ గ్రంథం.

# రఘువంశము

[మూలం : మహాకవి కాళిదాస కృతము. (తెలుగు లఘు వ్యాఖ్యాసహితము) మొదటి భాగము 1-9 సర్గలవరకు. వ్యాఖ్యాత : విద్వాన్, శిరోమణి, ఆకాశవాణి సంస్కృత పరిచయ కార్యకర్త శ్రీ కేశవపంతుల నరసింహ శాస్త్రిగారు. ప్రచురణ : ఆంధ్ర ప్రదేశ్ సాహిత్యఅకాడమి, కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు-4. డెమ్మీసైజు, పుటలు 393 వెల 10-00]

మానవుల సాంసారిక జీవితం అనే విష వృక్షంలో రెండే రెండు అమృత ఫలాలు వివేకవంతులకు లభ్యమౌతాయి. వాటిలో

మొదటి ఫలం, "కావ్యాఽమృతసాఽస్వాదన" రూపం. రెండవ ఫలం, సజ్జనులతో సద్గోష్ఠి నిర్వహణ రూపం. మిగతావన్నీ విష పూరితాలే. అంటే, ఈ లౌకిక సంసారంలో అ లౌకికాఽనందాన్ని అందజేయగలిగినవి. కావ్యాఽమృతరసాఽస్వాదాఽనందం, సద్గోష్ఠి సంజనిత సమధికాఽనందం అనే రెండూకాక, సంసారంలో మిగతా అంతా దుఃఖదాయకమే అని భావం. కనుక అలౌకికాఽనందప్రాప్తికి ప్రథమ సాధనం, సత్కావ్య పఠనమే అనే విషయం విశదీకృత మయింది.

అట్టి సత్కావ్యముల కోవలో నాయకమణిగా 'రఘువంశము' రెండు వేల యేళ్ళనాడే అలంకారికులచే ఎన్నిక చేయబడింది.

ఆదికావ్యం యొక్క అడుగు జాడల్లో సాగిన ఈ "రఘువంశ" కావ్యంకూడా ఆదికావ్యం వలెనే అఖండ భారతంలో సంస్కృత భాషా ప్రారంభానికి ప్రారంభ సాధనం కావడం, ఈ కావ్య కవితా పరిణతికీ, దీని ప్రత్యేకతకూ ప్రత్యేక నిదర్శన మనకతప్పదు. దీనిని బలపరచే మరో విషయంకూడా లేకపోలేదు. అది చరిత్రాంశం.

ఈ కవితను అజ్ఞానాఽవస్థలో ఉన్నపుడు మొట్టమొదటగా విన్న, "అస్తి + కశ్చిత్ + వాగ్విశేషః" అనే సంస్కృత పదాల క్రమాన్ని అనుసరించే ("కాళిదాసకవి"గా మారిన పిమ్మట) వరసగా కుమార సంభవ, మేఘదూత, రఘువంశ కావ్యాలను రచించినట్లు ప్రసిద్ధప్రథ ఉంది. ఇదికూడా ఈ కావ్య పరిణతిని దీని అద్యపాఠాఽర్హతను నిరూపిస్తూంది.

కాళిదాసకవి కవికుల గురువు గా ప్రసిద్ధి చెందినట్లే, రఘువంశము కూడా ప్రథమంగా ఇట్లు ప్రసిద్ధి చెంది ఉంది.

"రఘువంశ ప్రదీపేన, తేనాఽప్రతిమ తేజసా ।
రక్షాగృహగతా దీపాః ప్రత్యాదిష్టా ఇవాఽభవన్ ॥
(చూ. రఘువంశం, సర్గ 10, శ్లో 68)

రఘు కులమునకంతకు, ప్ర + దీప మై పుట్టిన రామచంద్రుని శరీర తేజము ముందర, పురిటింటగల దీపాలు వెల వెల బారినవి. ఇది ఇందలి వాచ్యార్థం. ఇక ఇందలి వ్యంగ్యార్థమిది. "రఘువంశము" అనే ప్రకృష్ట దీప కారణంచేత, ఇతర దీపాలు, అనగా సామాన్య కావ్యాలు, ఆ ప్రదీపం ముందర (దాని అనుపమ తేజస్సునకు) వెల్వెల బారినవి ఈ అర్థాన్నే సూరి ఈ శ్లోక వ్యాఖ్యలో మహా దీపసమీపేనాఽల్పాఃస్ఫురంతీతి భావః అనే వాక్య విన్యాసం ద్వారా సూచించినాడు. ఇంతటి మహోత్తమమైన మహా కావ్యానికి శ్రీ నరసింహ శాస్త్రివర్యుల లఘు వ్యాఖ్య - సూరి సంజీవినీ వ్యాఖ్యకు పట్టిన నిలువుటద్దంవలె ఉన్నది. ఉదా॥ సర్గ 1-5వ శ్లోకంలో- "ఆ జన్మ శుద్ధానాం...." మున్నగు 4 విశేషణాల్లోని "ఆఙ్" అనే ఉపసర్గకు అభివిధి (హద్దుతో కూడ కలుపుకొని) అనే అర్థమే గ్రాహ్యమైనట్లు, అత్ర సర్వత్ర ఆఙః అభివిధ్యర్థత్వం ద్రష్టవ్యం అని సూరి వ్రాయగా తదనుగుణంగానే శాస్త్రివర్యులు ఇచ్చట అభివిధి (గ్రాహ్యము) అని వ్రాసి, సూరివలెనే కవి హృదయమును స్పష్టంచేశారు. ఇట్లు ఇట అభివిధ్యర్థం చెప్పడంచేత జన్మతోకూడా-అంటే జన్మకు మూలకారణమైన గర్భోత్పత్తి మొదలుకొని అనే అర్థం వస్తుంది. యాజ్ఞవల్క్యస్మృతిలో- గర్భాధాన సంస్కారంలోని హోమాది వైదిక క్రియల నిర్వహణ చేత దంపతుల రేతస్సును ఆశ్రయించి ఉన్నపాపం పోతుంది అని స్పష్టంగా ఉంది. మీది స్మృతి వాక్య భావం మనసులోనుంచుకొనియే కాళిదాసకవి చెప్పిన అభివిధ్యర్థాన్ని సూరి, ఆ జన్మ శుద్ధానాం = గర్భాధానాది సర్వ సంస్కార సంశుద్ధానాం రఘూణాం అని తన సంజీవినిలో వివరించినాడు. ఇదే వివరణాన్ని అనుసరించి శాస్త్రిగారు ....ఇచ్చట అభివిధి. కనుక ఆ జన్మ అనగా గర్భోత్పత్తి నుండియే వైదిక (గర్భాధానాది) సంస్కారములచేత శుద్ధులు అని వ్రాసినారు. ఇట్లే వీరి తెలుగు వ్యాఖ్యలో అంతటా సంజీవినీ సమాశ్రయణ సౌభాగ్యం సంప్రకాశిత మౌతూంది.

ఇకశాస్త్రిగారు 1 వసర్గ 49వ శ్లోకానికి వ్రాసిన వ్యాఖ్యలో, శ్రీ సూరి సంజీవినీ వ్యాఖ్యలోలేని శ్రౌత విషయం వ్రాశారు. అది, 'కాళిదాస రహస్య సర్వస్వాఽభిజ్ఞ' అనే పేరును సంపాదించుకొన్న 'కాళిదాస హృదయము' అనే మదీయ గ్రంథంలోనిది. (చూ. 18వ పుట) ఇక సర్గ3-9- శ్లోకంలోని సంజీవినిలో :.... ఏతేన గర్భస్యభాగ్యవత్త్వ, తేజస్విత్వ, పావనత్వాని వివక్షితాని' అనే సూరి వాక్యాన్ని తెలుగు వ్యాఖ్య, '....గర్భస్థమైన శిశువు యొక్క భాగ్యవత్త్వము, తేజస్విత్వము, పావనత్వమును సూచింపబడినవి. అని ఛాయవలె అనుసరించినది'

ఇక శ్లోకభావాలను వ్రాస్తూన్న సందర్భంలో శాస్త్రివర్యులు 2-3 వాక్యాలలో మూలభావం వచ్చేటట్లుగా వ్రాయడం, వీరి సంగ్రహీకరణ సామర్థ్యానికి చక్కనినిదర్శనం. కాని మరికొన్ని స్థలాలలో మూలస్థ విశేషములు తెలుపవలసినచోట, మరికొంత వివరించి వ్రాయబడినది. (చూ 4-53, 5-7, 5-63, 6-23, 8-68, మొ. తెలుగు వ్యాఖ్యలు)

మీద చూపిన విధంగా శ్రీ శాస్త్రి వర్యుల లఘు వ్యాఖ్య, తియ్యతియ్యని చిన్ని చిన్ని తెలుగుపదాలతో మూలంలోని విశేషా

లను విశదం చేస్తూ, కవియొక్క సర్వతో ముఖ ప్రతిభను ఆంధ్ర పాఠకలోకానికి అందిస్తూ, చదివినకొలదీ చవులూరిస్తూ, "ఆంధ్ర సంజీవిని" అనతగి ఉన్నది. సంస్కృతం చదవదలచు కొన్నవారికీ, చదివినవారికీ కూడా ఈ 'ఉత్తమ వ్యాఖ్య' అవశ్యపఠనీయం. ఈ 'లఘు వ్యాఖ్య' సహాయంతో సంస్కృత విద్యార్థులందరూ స్వయంగా రఘువంశ కావ్యంలోని 'అమృతమును' ఆస్వాదించి ధన్యులు కావచ్చును. ఇంతటి మహాకార్యమును నిర్వహించిన వారును, నిర్వహించుటకు ప్రోత్సహించిన వారును సర్వదా ఆంధ్రలోకానికి అభినంద్యులు.

## సంస్కృత క్రియలు

(ఆకాశవాణి వార్తలలో వచ్చునవి)

రచయిత : వ్యాకరణ విద్యాప్రవీణ, శ్రీ కండ్లకుంట ఆళహ సింగరాచార్యులు ఎమ్. ఏ. బి. ఇడి., [ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, సైఫాబాద్, హైదరాబాద్-4. డెమ్మీసైజు 165 పుటలు. వెల 5-00]

వేదాంగములలో ఒకటైన 'నిరుక్తము' అనే తన గ్రంథంలో శ్రీ యాస్కాచార్యులవారు భాషోత్పత్తినిగూర్చి చెబుతూ 'ధాతు-మూలం భాషా' అని తెలిపినారు. మూలం అనగా చెట్టువేరు. చెట్టు పుట్టుటకు పెరుగుటకు దానివేరు (మూలం) మూల కారణమైనట్లు. ఒక భాషయేర్పడుటకును పెరుగుటకును (భూ, ఏధ, మొదలగు) ధాతువులు (Roots) మూల కారణాలౌతాయి. క్రియలను బోధించు మూలరూపాలకు 'ధాతువులు' అనిపేరు. ఏధ, కృ, మున్నగు సంస్కృత ధాతువులమీద, తిప్, తస్, ఝి, మొదలైన క్రియా ప్రత్యయాలు సంస్కృత వ్యాకరణ సంప్రదాయాలను సారంగా చేరగా, ఏధతే, కరోతి, మొదలైన క్రియాపదాలు క్రమంగా ఏర్పడ తాయి. అట్టి క్రియాపదాల స్వరూపజ్ఞానం చేతను, ఆ క్రియలు సమన్వయించే పదాల అర్థజ్ఞానం చేతను ఆ క్రియలుగల వాక్యాలు బాలురకు పూర్తిగా అర్థమౌతాయి. ఈ విధంగా సామాన్యపాఠకులకు సైతం సంస్కృత వాక్యాలలోని అర్థజ్ఞానాన్ని (చక్కని ప్రణాళికతో, ప్రసాదిస్తున్న ఈ ప్రస్తుత గ్రంథం, సంస్కృత ప్రారంభ దశలో ఉన్న విద్యార్థులకు, మధ్యతరగతి విద్యార్థులకూ కూడా 'వరప్రసాదమే' అనిచెప్పాలి, ఎందుకంటే-ఈవిధంగా సంస్కృత క్రియలయొక్కయు, అవ్యయ, కృదంతశబ్దాదుల యొక్కయు స్వరూప స్వభావాదులనుగూర్చి తేట తెలుగుభాషలో బాలురకు సులభంగా పరిచయం చేయగలిగే వివరణాత్మక గ్రంథం ఇంతవరకూ వెలువడలేదు. ఆ లోటును తీర్చగల గౌరవం "సంస్కృత క్రియలు" అనే ఈ ప్రస్తుత గ్రంథానికి దక్కింది.

ఈ గ్రంథంలోని మొదటి ప్రకరణంలో, - ఆకాశవాణి వార్తలలో తరచుగావినవచ్చే - 150 సంస్కృతవాక్యాలలోని క్రియా పదాలకు చెందిన వివరణం సులభరీతిలో చూపబడింది. ఈ ప్రణాళిక బాలబాలికలకు సంస్కృతమునందు అభిరుచిని కలిగించుటలో సమర్థవంతంగా ఉంది. ఈ వివరణ సందర్భంలోనే ఆయా క్రియల తాలూకు లట్, లిఙ్, మొదలగు లకారాలకు చెందిన ఇతర పురుష, వచనరూపాలూ, కర్తరి కర్మణి ప్రయోగాలూ, (Active & Passive Voice) చూపబడ్డాయి. ఈ పద్ధతిలో క్రియాపదాల వివరణం సాగడంచేత, ఒకే క్రియాపదాన్ని భిన్నవచనాలలోను, వర్తమానాది కాలాలలోను ప్రయోగింపగల సామర్థ్యం బాలురలో, ఈ గ్రంథపఠనంవలన ఏర్పడుతుంది. ఉదాహరణకు 26వ వాక్య వివరణ "దేశ దారిద్ర్యం సహసానిర్మూలయితుం న శక్యతే" = దేశముయొక్క బీదతనము ఒక్కసారిగా నిర్మూలించుట సాధ్యము కాదు. ఇందలి క్రియాపదము "శక్యతే". ఇది శక్ల=శక్తౌ అను ధాతువుయొక్క కర్మార్థక రూపము. వర్తమానకాలము - లట్ - ప్రథమపురుష - ఏకవచనమునందలి రూపమిది. లట్‌లో దీని రూపములు పూర్తిగా నిట్లుండును.

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు | (తత్) శక్యతే | (తే) శక్యేతే | (తాని) శక్యంతే |
| మ. పు | (త్వం) శక్యసే | (యువాం) శక్యేథే | (యూయం) శక్యధ్వే |
| ఉ. పు | (అహం) శక్యే | (ఆవాం) శక్యావహే | (వయం) శక్యామహే |

(బ్రాకెట్లలోని పదాలు సౌలభ్యసూచకంగా నేను చేర్చినవి)

కర్త్రర్థములో:- ప్ర. పు (సః) శక్నోతి (తౌ) శక్నుతః (తే) శక్నువంతి. 'నిర్మూలయితుం' అనునది 'తుమున్' ప్రత్యయాంతమగు అవ్యయము. ఇట్లే - 45వ వాక్యము :- ముఖ్యమంత్రిణా జనాః ప్రబోధితాః = ముఖ్యమంత్రిచేత జనులు ఉపదేశింపబడిరి. ఇందలి "ప్రబోధితాః" అనుపదము విధేయ విశేషణము. క్రియాపదము స్థానమున ప్రయోగింపబడినది. కృదంతమైన అకారాంత పుంలింగ శబ్దము. ప్రథమావిభక్తి బహువచన రూపము. దీనికి బదులుగా "ప్రాబుధ్యంత" అను క్రియాపదము వాడినచో సమానార్థమునిచ్చును.

మీద చూపిన విధంగా రచయిత, వాక్యరచనకు ముఖ్యమైన వ్యాకరణకార్యసామగ్రిని తగుమాత్రంగా చూపడంచేత కొంత సంస్కృత వాక్యాల అర్థజ్ఞానము, కొంత సంస్కృతవాక్య నిర్మాణ సామర్థ్యం బాలురలో ప్రోదుర్భవిస్తుంది.

ఇక నిత్యవ్యవహారంలోను, సంస్కృత వార్తలలోను తరచుగా వచ్చే 100 క్రియాపదాలు, ముఖ్యమైన కొన్ని నామవాచకాలు, విశేషణాలు, అవ్యయాలు అర్థాలతోసహా పట్టికలరూపంలో చూపబడ్డాయి. ఈ విధమైన ప్రక్రియచేత బాలురకు నిత్యవ్యవహారానికి వలసిన సంస్కృతపదజాలం అర్థాలతోసహా లభ్యమౌతుంది ఇక రెండవ ప్రకరణము 1వ అనుబంధంలో సంస్కృతక్రియల విశేష పరిచయం ప్రదర్శితమయింది. ఇందు పది లకారములలో పరస్మై పది, ఆత్మనేపది ధాతువుల భిన్నరూపాలు రూపనిష్పత్తితో సహ సంగ్రహంగా చూపబడ్డాయి. పిమ్మట కర్తరి కర్మణి ప్రయోగాలు, అకర్మక సకర్మక కర్తరి ప్రయోగాలు, స్వార్థ ప్రేరణార్థక క్రియా రూపాలు అనే ఇవి ద్వితీయప్రకరణ గతసామగ్రి.

ఇక 2వ అనుబంధంలో వేర్వేరు ఉపసర్గల చేరిక వలన క్రియలలో ఏర్పడే అర్థభేదాలు, (ప్రహార, ఆహార, సంహార, విహార మొదలైనవి) అవ్యయాల విశేషపరిచయం, క్త్వా, తుమున్, తద్ధిత ప్రత్యయాంతాలైన అవ్యయాలు, చికీర్షతి, జిగమిషతి మొదలైన సన్నంతక్రియలు, కృష్ణాయతే, కుమారాయతే, మున్నగు నామ ధాతువులు, ఇతర కృదంతాలు మున్నగు వానివిశేష పరిచయం కలదు. ఈ పరిచయంతో విద్యార్థులలో నిత్యవ్యవహారానికి చాలినంత వ్యాకరణ జ్ఞానం అలవడి, అది, వారి ఉన్నత విద్యాభ్యాసానికి దోహదకారి ఔతుందనడంలో సందేహంలేదు.

సంస్కృత భాషాభివృద్ధికి అనేకవిధాలుగా ప్రయత్నాలు జరుగుచున్న ఈ సమయంలో ఈ గ్రంథం సంస్కృతవిద్యార్థుల పాలిటి కల్పవృక్షం. ఈ గ్రంథ నిర్మాతలు ప్రోత్సాహకులు మిగుల అభినంద్యులు. సులభంగా సంస్కృతం నేర్చుకొనగోరిన ప్రతిఒక్కరూ ముఖ్యంగా చదువవలసిన ఉత్తమ గ్రంథం. "శుభం భూయాత్."

శ్రీ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి

## పరాశర సంహితా

[శ్రీ ఆంజనేయచరిత్ర (మూడు భాగాలు). సమర్పణ శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రి, వెల : మొదటిభాగం రు. 8 లు, రెండవ భాగం రు. 6 లు, మూడవ భాగం రు. 5 లు. ప్రచురణ శ్రీ హనుమత్సేవాసమితి, సత్యనారాయణపురం, విజయవాడ-11]

మొదటిభాగంలో ఏకపంచాశత్పటలం నుంచి ఏకోనషష్టితమ పటలం వరకూ, రెండవభాగంలో 61వ పటలంనుంచి 70వ పటలం వరకూ, మూడవభాగంలో 71వ పటలంనుంచి 80వ పటలం వరకూ శ్లోకాలూ, తాత్పర్యాలూ యిచ్చారు. అంజనేయ చరిత్ర, పూజా విధానం వంటి అంశాలను సులభంగా అందరకూ అర్థమయ్యేట్లు యీ మూడు పుస్తకాలలో యిచ్చారు. ఆంజనేయదండకం హనుమాన్‌చాలీసా వంటివి తెలుగువారందరకూ తెలిసినవే. కానీ శ్రద్ధా భక్తులతో ఆంజనేయుని అర్చించేవారు అంత ఎక్కువమందిలేరేమో. ఉపాసనాబలం ఉన్నవారు తమశక్తిని సోదరమానవుల సంక్షేమానికి వినియోగించుతున్నట్లు కనిపించదు.

పురుషమృగాన్ని కొనితేవడానికి బయలుదేరిన భీముడికి హనుమంతుడు దర్శనమిచ్చిన సంగతి సామాన్యులకేకాదు విజ్ఞులలో ఎంతమందికి తెలుసునో! పరాశరుడు మైత్రేయికి యీ చరిత్ర చెప్పాడు. దానినే యీ రచయిత తాత్పర్యసహితంగా ప్రచురించారు.

భక్తుడు అనగానే ఆలోచనలేకుండా గుడ్డిగా ఒక అతీతశక్తిని ఆరాధించేవాడని అభిప్రాయపడడం పొరపాటే అవుతుంది. ఎందుకనంటే నిజమైన భక్తునికి కూడా చాలా జిజ్ఞాసఅవసరం.

శ్లో॥ హనుమన్మూర్తి రూపాణి స్థూలసూక్ష్మ సమానితే
అత్యద్భుతాని లోకేషు సన్తీతి బహుధా శ్రుతమ్॥

భీముడు ప్రార్థించగా హనుమంతుడు తన వివిధ రూపాలనూ భీముడికి చూపిస్తాడు. ఇక్కడ విశేషార్థాలున్నాయి. వాటిని ఉపాసకులు మాత్రమే గ్రహించగలరు. ఉపాసనా దృష్టితో కాకుండా సాహిత్య దృష్టితో యీ పుస్తకాలను చదివేవారికి కూడా ఆసక్తి, ఆశ్చర్యం కలిగించే అంశాలు పరాశరుడు చెప్పిన ఆంజనేయ చరిత్రలో వున్నాయి.

ఆడంబరం లేకుండా మానసికంగా హనుమంతుడిని పూజించే విధానాన్ని 52వ పటలంలో వివరించారు. చాలా శ్రద్ధగా పరిశీలించవలసిన పటలమిది.

శ్లో॥ సువర్చలా సమేత స్త్వం చతురావరణాన్వితం
హంసతూలికాకయోపేతా మమ హృత్పంకజేవస॥

అనే శ్లోకాన్ని బట్టి ఆంజనేయుని భార్య సువర్చల అని పరాశరుడు చెప్పినట్లుతెలియుచున్నది. కానీ హనుమంతుడు నిత్య బ్రహ్మచారి అని కొందరు ఉపాసకుల అభిప్రాయం. ఈ కారణంగానే బ్రహ్మచారులయిన భక్తులు హనుమంతుడిని ఆదర్శంగా పెట్టుకొని వ్యవహరిస్తుంటారు.

మొదటి పుస్తకంలోని "విశ్వరూపదర్శనము" చాలా ముఖ్యమైనది. అదేవిధంగా శ్రీరామముద్రిక కథకూడా చాలా

ప్రధానమైనది. జపమాలా లక్షణం అనే శీర్షికన యీ గ్రంథకర్త వ్రాసిన అంశాలను ఆస్తికుల మనుకునే వారందరూ చదవడ మవసరం. జపమాలిక యందు నియత, అనియత అని రెండు రకాలున్నాయి. దేని ఉపయోగం దానికి వుండడమే కాక వాటిని ఉపయోగించవలసిన సందర్భాలు, తీరులలో కూడా తేడాలున్నాయి.

మొత్తంమీద యీ మూడు పుస్తకాలూ చాలా ప్రయోజనకరమైనవి. భక్తులు నిత్యపారాయణం చేసి, ఆచరించవలసిన అంశాలు చాలా వున్నాయి వాటిలో.

## రాస పంచాధ్యాయి

[రాసలీలలపై వ్యాఖ్యానము. ఆంధ్ర వ్యాఖ్యాత : పురాణపండ రామమూర్తి. వెల : రు. 5-00. ప్రకాశకుడు : పురాణపండ రాధాకృష్ణమూర్తి, డోర్ నెంబర్ 29-6-13 డి, జయశ్రీ టాకీస్ రోడ్, రాజమండ్రి - 4].

శ్రీ కృష్ణ లీలా తరంగిణి దక్షిణాదివారికి విశేషించి తెలుగు వారికి సుపరిచయము. నారాయణ తీర్థుల వారు సంస్కృతంలో శ్రీకృష్ణ లీలాతరంగిణి వ్రాసినా అది కఠినముగాక గానం చేయ డానికనువైన రీతిన సరళముగానున్నది.

ఇక్కడ 'రాసము' పంచాధ్యాయ యుతము. ప్రథమాధ్యాయంలో శ్రీకృష్ణభగవానుడు గోపికలతో ఆత్మ ద్వారా లీలనెరపెను? గోపికలు ఎవరు? శ్రీకృష్ణభగవానుడు వారితో రాసము జరుపుట యనగా నేమి అనే ప్రశ్నలకు విశేషణాలున్నాయి. ఆధ్యాత్మిక దృష్టిమాత్రమే కాక స్వానుభూతి అయిన భక్తిరస సమన్వితులకు మాత్రమే యీ "రాసము" 'లీలలు' వంటి మాటలు అర్థమవుతాయి. ద్వితీయాధ్యాయములో మనస్సుద్వారానూ, తృతీయాధ్యాయములో వాక్పాణములద్వారానూ, చతుర్థాధ్యాయములో ఇంద్రియముల ద్వారానూ, పంచమాధ్యాయములో శరీరములతోనూ భగవానుడు గోపికలతో లీలనెరపెనని కొందరిమతము. ఇక్కడ ఇంద్రియములద్వారా శరీరముద్వారా అననేమి? స్వామినీ భావంతో ధ్యానించిన గోపికల భగవానుడు అనుభవించెనా?. అది ఎట్టి అనుభవము? ఆనందము రూపరహితమై గమనాది క్రియలు లేనదయినప్పుడు ప్రియసంగము వలన స్వామినులకు విశేష సుఖ మున్నదన మెగుచున్న దనునది ఉచిత విషయము ఎట్లగుచున్నది.

అంతర్గృహగతా గోపికలలో జ్ఞానమూ, భక్తి రెండూ ఉన్నవని అంగీకరించుచు ఎన్నికారణాలను చెప్పిననూ గోపికలది జారబుద్ధియగుట ఎట్లు చెల్లును? ఇట్లాంటి జిజ్ఞాస లీలాశుకమును శ్రద్ధగా అధ్యయనం చేసిన వారికి కలుగుతుంది. అయితే "నృణాం నిః శ్రేయసార్థాయ" (53) మను నుడివిని అంగీకరించినచో ఇట్టి సందేహాలకు అవకాశం వుండదు. అయినా అంశాలను ఈ 131 పుటల పుస్తకంలో యీ రచయిత చర్చించినారు. మానవాతీత శక్తి కలదని గుర్తెరిగి తదనుగుణంగా ప్రవర్తించగలదు. వారందరూ చదివి, పరిశీలించి, జిజ్ఞాసచేయదగు మంచి అంశాలనేకం ఉన్న మంచి పుస్తకం ఇది. శారీరక సుగమం దృష్టిప్రాతిపదికన కాక ఆత్మ పరమాత్మల ప్రాతిపదికన, తదాత్మతో భావంతో చదివేవాడికి ఆసక్తి కలిగించే పుస్తకం ఇది.

## శ్రీ వేంకటాచల మాహాత్మ్యము

[తెలుగు వచనము. మూలము స్కాందపురాణాంతర్గతము. రచన: డాక్టర్ మోదేకుర్తి వేంకట సత్యనారాయణ. వెల: రు 10/-. ప్రతులకు : శ్రీమతి ఎం. సావిత్రి, 11/1, పిఠాపురం బీచ్ క్వార్టర్సు, ఆంధ్ర యూనివర్సిటి, వైజాగ్ - 530 003.]

నారదమహర్షి సుమేరు పర్వత శిఖరమందున్న యజ్ఞవరాహుని దర్శించడం నుంచి వ్యాసమహర్షి చెప్పిన ఆకాశగంగాస్నాన కాలనిర్ణయము, వ్యాసుడు వెంకటాచలమున చేయదగిన దానములను చెప్పడం వరకూ 40 అధ్యాయాలున్నాయి యీ 195 పుటల గ్రంథంలో. వ్యాసులవారు చెప్పిన సమాధానమునే నైమిశారణ్యంలో సూతుడు శౌనకాది మునులకు చెప్పినట్టు యీ పుస్తకాన్ని వచనంలో వ్రాయడంద్వారా భక్తులందరకు యిలా గ్రంథకర్త ఎనలేని సేవ చేసిన వారయినారు.

భూదేవి ఒకప్పుడు వరాహమూర్తి దగ్గరకువెళ్ళి "స్వామీ ఒక సందేహము తీర్చుకొనవచ్చితిని. నాతలపైనున్న పవిత్రగతులలో ప్రధానులైనవానిని తెల్పుము" అని అడిగెను. అందుకాస్వామి "శేషాచలమే అన్నిపర్వతములలో మిన్న" యని సమాధానమిచ్చెను. స్వామి పుష్కరిణి సర్వతీర్థములలో గొప్పది.

కుమార ధారా తీర్థమాహాత్మ్యము, తుంబుతీర్థ మాహాత్మ్యము, ఆకాశగంగా మాహాత్మ్యము, పాండవతీర్థమాహాత్మ్యము, పాపనాశన తీర్థ మాహాత్మ్యము, దేవతీర్థ మాహాత్మ్యములను ఈ పుస్తకం లో

8వ పుటవరకూ వివరించారు. రెండవ అధ్యాయంలో వరాహ మంత్రారాధన విధిని శ్లోకసహితంగా వ్రాసారు. అగస్త్యుని ప్రార్థన ఫలితంగా శ్రీనివాసుడు సర్వజనులకు దర్శన మిచ్చాడట. ఇది ఈ నాడు సయితం పెక్కుమందికి అనుభవైకవేద్యమే గదా! ఇక ఇక్కడనుంచి పద్మావతి ఆకాశరాజునకు లభించుట, ఉద్యానవన మందున్న పద్మావతికి హస్తసాముద్రికం చెప్పడం, రాజకన్యకలకు శ్రీనివాసునకు సంభాషణం, చిలుకపలుకలవంటి బాగాలు తెలుగు వాడికి తెలిసినవే. పదవ అధ్యాయం, పదకొండవ అధ్యాయము, పన్నెండవ అధ్యాయము వంటి వాటిలో విజ్ఞులుకూడా తెలిసికొన వలసిన అంశాలున్నాయి. "సర్వపాతక నాశనము, మహాపుణ్య ప్రదము అగు శ్రీ వేంకటాద్రి యందు భక్తితో శ్రీనివాసుని దర్శించిన వానిలో చతుర్వేది యైనను తుల్యుడు కాడు............ శ్రీనివాసునికంటే అధికమైన దైవతములేదు". బ్రహ్మాది దేవతలు శ్రీవేంకటాచలమున ఎల్లప్పుడు నివసిస్తారు. అయితే ఇక్కడ కొన్ని నియమాలను పాటించాలి. వాటిని పాటించగలిగిన వారికి మాత్రమే శ్రీనివాసుని దైవకృప లభించుతుందా? అని ప్రశ్నించ వచ్చు. అది భక్తివిధానానికి విరుద్ధంకాదు. కానీవిషయాలను తెలుసుకోవాలనే దృష్టితో ప్రశ్నించడం వివేకపద్ధతి. జిజ్ఞాస కలవారందరూ చదవదగిన మంచి వచనకావ్యాలలో ఇదొకటి.

# శ్రీమద్భగవద్వాణి

[శాంతి సాధన - గీతానుసరణ పద్యకృతి. కృత్యకర్త - కర్తా త్రిమూర్తికవి. వెల : రు 10 లు, ప్రచురణ : ఆంధ్ర సాహితీ ప్రచారసభ, స్టేషన్ లైన్ 1/1, తాల్పుకూడర్ పోస్ట్, 24 పరగణాల జిల్లా, పశ్చిమ వంగ.]

శ్రీ కృష్ణార్జునుల సంవాదరూప శ్రీమద్భగవద్గీతా శాస్త్రానికి పెక్కు తెలుగు అనువాదాలు వచ్చాయి. మరికొన్ని వ్యాఖ్యానాలు వెలువడినాయి. త్రిమతాచార్యులు తమతమ ప్రతిపాదిత మత సిద్ధాంతాలకనుగుణంగా భాష్యాలు వ్రాశారు. ఇటీవలి కాలంలో భగవద్గీత తెలుగు అనువాదాలు పద్యరూపాన గద్యరూపాన అనేకం వెలువడడంతోపాటు "భగవద్గీత మతరహిత ధర్మాన్ని, నీతినీ ప్రబోధిస్తుందా!" అనే అంశం గురించి మనదేశంలో మాత్రమే కాకుండా కొన్నివిదేశాలలో కూడా చర్చలు ప్రారంభమయ్యాయి. పరిశోధనలు జరుగుతున్నాయి. శుభమ్! ఈ కృషి వస్తునిష్ఠంగా జరుగుతుందని ఆశించటం తప్పుకాదు.

ఇక ప్రస్తుతం : త్రిమూర్తికవి అనువాదం సులభంగా సరళంగా ద్రాక్షాపాకమున నున్నదనుటకొక ఉదాహరణ :

పిండలోపంబుచే మేను ఎండబారి
బిల్లరులో బల్లులై మదితల్లడిల్ల
దలలో క్రిందుగ వంశకర్తలు వసింత్రు
నరకపురి నందు రాపుట్లు, నరకవశిన. (9వ పేజి)

అని పరితపించుచున్న అర్జునునికి కర్మగీతిలో భగవానుడు ఇట్లుపదేశించుచున్నాడు.

పార్థ! కర్మేంద్రియమ్ముల బిగువ నీక
గట్టినను, మాన సంబను బట్టలేక
రూపరీ సుగంధముల నెంచి రోజు నెవడు?
వాడె మూర్ఖుండు, నజ్ఞాని, బకము, వృకము

ఈనాడు మనలో చాలామంది స్థితి నిజంగా ఇలాగే వున్న దనడం తప్పుకాదు. 45వ పుటలో

గురు పదమ్మునందు గురిలేని మూర్ఖుండు
సందియంబు తోడ్రమందు నట్టి
సంశయాత్మునకు సౌఖ్యమింతయులేదు.
లేదిహంబు, బరములేదు పార్థ? (45వ పేజీ)

ఇదికూడా యీనాడు మనలో చాలా మందికి వర్తించుతుంది. దైవశక్తిలో పూర్తి విశ్వాశంలేదు మనకు. బాసలలో ఆ పదలలో ఏడుకొండలవాడిని మొక్కుకొనకుండ ఉండలేము. అయా తెలుగు పద్యాలకు మూలములయిన సంస్కృత శ్లోకాలు విజ్ఞులకు తెలిసియే ఉండవచ్చునను నమ్మికతో శ్లోకాలను ఉటంకించలేదు. అయా శ్లోకాలకు యీ పద్యాలను పోల్చితే కవి ఎంత సరళంగా తెలుగులో పద్యాలు వ్రాసినది విశదమవుతుంది.

ఇదే విధంగా కర్మ సన్యాస గీతి, ఆత్మ సంయమనగీతి, వంటి వాటియందుకూడా కవి తన ప్రతిభ చూపించాడు, భగవద్గీతకు మక్కికి మక్కి అనువాదం కాదిది. భగవద్గీత పరిధిలోది అనుకుంటాను. ఆస్తికులందరూ నిత్యం పారాయణ చేయ దగు పుస్తకమిది. ముఖ్యంగా శ్రద్ధాత్రయ విభాగగీతి, మోక్ష

సన్న్యాసగీతి నిత్యం పారాయణం చేయదగినట్టివి. మిగతా మంచి చెడుల సంగతి చెప్పలేనుగాని గీతా పారాయణం వల్ల జ్ఞానతృష్ణ పెరుగుతుందని మాత్రం గట్టిగా చెప్పవచ్చు. కుదురులేని వారికి కుదురేర్పరుస్తుంది భగవద్గీత.

శ్రీ వి. ఎస్. అవధాని

## హేట్స్ ఆఫ్ టు కాంతం (కథల సంపుటి)

[రచన : గరిమెళ్ళ వెంకట సీతారాం. ప్రచురణ : రచయిత, పేజీలు : 269 వెల : పన్నెండు రూపాయలు. ప్రతులకు : శ్రీమతి గరిమెళ్ళ మహాలక్ష్మి, శివోదయం బిల్డింగ్స్, అశీలుమెట్ట, విశాఖపట్నం-16 మరియు దేశీ బుక్ హవుస్, నారాయణగూడ, హైదరాబాద్-29.]

ఈనాటి తెలుగుకథ, వస్తువులో, విశ్లేషణలో, శిల్పంలో, కథా సంవిధానంలో, ఆశంసనలో, బాగా ఎదిగిందని కొందరు అంటున్నారు. ఇతర భాషల, ఇతర దేశాల కథల అనుసరణల పోకడలూ, తెలుగు కథలో రాకపోలేదని మరి కొందరు అంటున్నారు. సెక్సూ, హింసా, చేతబడులూ, మాయా మంత్ర తంత్రాలతో పాటు సైన్సునుకూడా కలగలిపి 'మాయా సైన్సు సాహిత్యాన్ని' అతి తెలివిగా అందించి, తెలుగు పాఠకుల్ని పిచ్చివాళ్ళను చేస్తూ, పేరు ప్రఖ్యాతులు గడించుకొన్న కొందరు కథకులు కాలర్లు ఎగరవేయటమూ గమనించ వచ్చును. ఈ కృషిని వేనోళ్ళ శ్లాఘిస్తూ, పత్రికల సర్కులేషన్ను పెంచుకోవటానికిగాను లాటరీ స్కీముల స్థితికి దిగజారిన కొందరు పత్రికల సంపాదకులు, ఇటువంటి సాహిత్యాన్ని ప్రచురించి సొమ్ము చేసుకొన జూస్తూనే, మరొకవంక సాహిత్యంలో మార్క్సిస్టు దృక్పథాన్ని గురించీ, సామాజిక స్పృహని గురించీ వంటింటి లెక్చర్లు దంచుతూ, గొప్ప సాహిత్య సేవను చేసేస్తున్నా మోహోయని ఎలుగెత్తి అరుస్తూ టెక్కులు పోవటమూ, తమ ద్వంద్వ విధానాలని గురించిన గమనింపులేని వెర్రి వాళ్లుగా తెలుగు పాఠకుల్ని పరిగణిస్తూ, ఫైటింగు కథల్నీ, మందు కథల్నీ, మత్తు కథల్నీ, మాయాకథల్నీ తెలుగు దేశంమీద విరివిగా అచ్చొత్తించి పుంఖాను పుంఖాలుగా విసరివేయటం, ఇక్కడ విచారించ వలసిన విషయమని అనకతప్పదు. ఈ పరిణామాల వలన అగ్ర స్థానం నుంచి ద్వితీయ స్థానానికి దిగజారిన తెలుగుకథ యొక్క ఈ దీన స్థితికి అగ్ర పీఠాల్నేర్పరచుకుని, భుజ కీర్తులు తగిలించుకుంటున్న ఈ ప్రబుద్ధులందరూ-తలా కొంతా బాధ్యతని వహించక తప్పదు. రేపు ఎవరయినా తెలివిగల పాఠకులు, చొక్కా పట్టుకుని నిలదీసి అడిగి నప్పుడు దొంగచూపులూ, క్రిందిచూపులూ, ప్రక్క చూపులూ, వెర్రిచూపులూ చూడటంవలన ప్రయోజనం వుండదు. తెలుగు సాహిత్య సీమలో వెర్రిగా 'మొలిచి, పిచ్చితలలు వేస్తున్న రాజకీయాలు, గ్రూపులు కట్టటాలు' వ్యాపార పోకడలూ, అనారోగ్యకరమయిన పోకడలూ, గ్రూపు ఫయిటింగులూ, మందు కొట్టుడులూ, పిచ్చ అరుపులూ, అదర గండపు మాటలూ, అవాస్తవికమయిన కృత్రిమ కుహనా నిబంధనలూ, ఈనాటి తెలుగుకథ ఇంకా బాగా ఎదిగి ప్రపంచ సాహిత్యంలో సముచిత స్థానం సంపాదించటానికి ప్రతిబంధకాలుగా తయారయా యని తీరాలి. ఈ కారణాల వలన తెలుగు కథల్ని పుస్త కాలుగా అచ్చొత్తించి అందించే నాధుడే కరువయిన ఈ రోజులలో ఇటువంటి కథల సంపుటాలు రావటం ఆహ్వా నించదగిన విశేషమేనని అనాలి.

శ్రీ గరిమెళ్ళ వెంకట సీతారాం రచించిన 15 కథలు ఈ పుస్తకంలో చోటు చేసుకున్నాయి. చక్కని పేపరుమీద ముచ్చటగా ముద్రించిన ఈ పుస్తకం అందంగా వుంది. పుస్తకం ముందు ముద్రించిన శ్రీ కొడ వటిగంటి లేఖ గడుసుగా గోడమీద పిల్లివాటుపుధోరణిలో వున్నది. 'మరేం ఫర్వాలేదు. నిర్మొహమాటంగానే చెప్పండి అని ఆయారచనల రచయితలు గట్టిగానే చెప్పి నప్పటికీ ముందు మాటలురాసే వారికి మొహమాటం తప్పదు' అని వాస్తవాన్ని వాస్తవంగా రచించిన రాచ కొండ విశ్వనాథశాస్త్రిగారు, రచయిత గురించి చాలా మంచి మాటను చెప్పబోయి. కొంత మొహమాటానికి లోనయ్యారని అనిపిస్తుంది. 'నా మాటకూడా కాస్త వినండి, సార్-' అంటూ కొన్ని మాటలు చెప్పిన రచ యిత-గబుక్కునపాఠకుల్లోకిచొరబడిపోయి రచయితగా తమ అస్తిత్వాన్ని నిల్పుకోవటంలో విఫలులయ్యారు. ఈ పుస్తకానికి చివరిమాట (?!)ను రాసిన వాకాటి పాండురంగారావుగారు చాలా చాలా మొహమాటానికి లోనయారనాలి. మిత్రత్వాన్నీ, కథలమీది అభి

ప్రాయాన్ని కలగలపరాదు అని అన్నవారు కొందరు సాహితీ ప్రకాండులే !

ఈ పుస్తకంలో వేసిన ప్రతీ కథకీ వెనుకన కొందరు ప్రసిద్ధుల అభిప్రాయాల్ని వెయ్యటంతోపాటు, ఆయా కథలకి ముందు కొన్ని పరిచయ వాక్యాలు రాశారు రచయిత. రచయితగారి వాక్యాలు తేలిపోగా, ప్రసిద్ధుల అభిప్రాయాలు నానా రకాలుగా హొంబర్గరూ, కందిపొడీ, సాంబారూ, పప్పుచారూ, అన్నమూ,చపాతీలు కలిపి తయారుచేసిన అడ్డదిడ్డమయిన వంటకాల్లాగా వున్నాయి. కొన్ని అభిప్రాయాలు నిష్కర్షగా, నిజాయితీగా వుంటే, మరికొన్ని దృష్టిదోషం వలన రచనలని బుజాలకి ఎత్తుకున్నాయి. ఇవి చాలక, భారతిలో సమీక్ష కావాలన్నారు రచయిత. కనుక తప్పదు.

హేట్స్ ఆఫ్ టూ కాంతం అన్న కథలో-దీ ఎక్స్ప్రెజిషన్ఎబవుట్ మేనేజిమెంట్ టెక్నిక్ వజ్ నాట్ ఫ్యూజ్డ్ ప్రాపర్లీ. దీ రీడర్ ఈజ్ నాట్ టోల్డ్ వైదీ స్టోరీ టెల్లర్ విథాల్ హిజ్ క్వాలిఫికేషన్స్ ఈజ్ సో బాడ్లీ ఆఫ్ ! అన్పిస్తుంది.

సన్మానం కథలో అవగాహనలేని వెకిలితనంవుంది.

విషవలయం, అనుభవంలోపండినా, కథనం పలచబడి కేవలం ప్రబోధాత్మకమయి బలహీనమయి కూర్చున్న కథ.

కథ నిడివి పెరిగినా చివరలో ఏం జరుగుతుందో పేరు చూడగానే తెలిసి పోయేకథ సుభాషిణి. ఐ ఫ్రౌండ్ ఎట్ దీ అన్సింపాథటిక్ డిస్పోజల్ ఆఫ్ సుభాషిణీ- అంటారు ఒకరు-అందులో వాస్తవం వున్నది.

చివరి వాక్యంలో మలుపు వున్న అరిగిపోయిన సరదాకథ, 1+1 = ?

విషయం వుదాత్తమూ, ప్రయోజనాత్మకమూ అయినా, తగినట్టుగా కథనం లేనందువలన నీరసపడి పోయిన కథ-వెల్డన్.

డైరక్టుగా పాఠకులతో మాట్లాడే 'రచయిత చెడు అలవాటు' వలన తేలిపోయిన కథ-బామ్మగార్లా జిందాబాద్.

ఏకాగ్రత లోపించిన కథ-మగసిరి. కథనంలో చవకబారు తనం వుంది.

పాత్ర చిత్రణలు సినిమా టెక్గా వుండి కృతకత్వాన్ని పుష్కలంగా జేబులో వేసుకొని తెల్లమొహం వేసిన కథ చిటపట చినుకులు.

అరచేతిలో స్వర్గం చూపించినట్లుగా, ఓవర్ అప్టిమిస్టిక్గా వున్న పగటికల లాంటిది-మేనేజరు రంగయ్య కథ. కృతకత్వం పుష్కలంగా వుంది.

ప్రబోధం ఎక్కువయి, విశ్లేషణ తగ్గిపోయి, తేలిపోయిన కథ స్వార్థం.

ఫ్యూడల్ సమిష్టి కుటుంబాలలో ఒకప్పుడువుండిన చాదస్తపు మమకారం గల్గిన కథ-ఇల్లాలు.

కేవలం ప్రబోధాత్మకంగానే అయి, మహిళా శీర్షికకు వ్రాసిన సోదాహరణ వ్యాసంలా అన్పించినది, సంఘం శరణం గచ్ఛామి రచన.

కుటుంబ నియంత్రణ ఇతివృత్తం మీద సాగదీసిన ఓ మోస్తరు కథ-కాంతం బ్రతికుంటే చాలు.

నేనెవరికోసం వ్రాయటం అన్నకథలో, అసూయ ఆడవాళ్ళకే బ్రహ్మగారు పెట్టాడన్న భావాన్ని పలికించడం రచయిత సంస్కారానికి తగినది కాదన్న ఒక మార్క్సిస్టు రచయిత్రి మాటలో వాస్తవం లేకపోలేదు. కథకుడి మనసులోని ఆటు పోట్లకి అద్దంలాంటిదయిన ఈ కథ చాలా లూజ్ కన్స్ట్రక్షన్.

శ్రీమతి గరిమెళ్ళ మహలక్ష్మి రచించిన నిర్ణయం అన్న పేరుగల రచనకూడా ఈ పుస్తకంలో చేర్చబడింది.

ఈ పుస్తకం రచయిత మాటల్లోని గడుసుతనం, కథలలో లేదు. హఠాత్తుగా పాఠకులతో మాటల్లోకి దిగిపోయి కథనాన్ని ఘోరంగా తేలిక పరచడం వలన, రచయిత, కథలకి న్యాయం చెయ్యలేక పోయారు. కొన్ని కథలలో రచయిత చెప్పదల్చుకున్న విషయాలు తొందరపాటు తనంతో వున్నట్లనిపిస్తుంది. చక్కని శైలి, నిరాడంబరమయిన నడకా కల ఈ కథలు, మలుపులు కరువయి విశ్లేషణలు కొరవడి, తేలిపోతాయి. చాలాచోట్ల రచయిత

తలపడిన-ప్రబోధాలూ, పాఠకుల్లోకి చొరబడి మాట్లాడే ప్రయత్నాలూ, లేకుండా వుంటే కథనాలకి బలం వచ్చేది. కథలలో సమగ్రతా పూజ్యమే.

కేవలం వైయక్తికమయిన అంశాలకే ప్రాధాన్యమిచ్చిన ఈ కథలలో సాంఘికదృష్టి, సామాజిక ప్రయోజనమూ శూన్యం, రచనలలో 'ఇవి' బాగావుండాలని ఘోషించే కొందరు అభ్యుదయ రచయితలు తమ అభిప్రాయాలలో ఈ అంశాన్ని విస్మరించటానికి, మొహమటానికి వారు లోనవడమే ప్రధాన కారణమనాలి. చిత్రమైనది గదా మన సాహితీసీమ !

మన దేశానికి లెనిన్ మావోల రోజులు రావాలని రచయితగా సీతారాం గుర్తించి అటువంటి ఆశల్ని ప్రతిఫలించే మంచి కథలు ఆయన రాయాలని రాచకొండ విశ్వనాథశాస్త్రిగారు అభిలషించటం సముచితమూ. అభినందనీయమూ ననాలి. రా. వి. శాస్త్రిగారి మాటలు ఈ పుస్తకానికి నిండుదనం ఇచ్చాయి. కోట్లాది చీమలకి పద్ధతి ప్రకారం బంధాలు బిగించి, పద్ధతిప్రకారం వాటిని పీల్చి పిప్పిచేస్తున్న వారిమీద ఆగ్రహం వెలిబుచ్చుతూ ఆక్రోశాన్ని వెళ్ళగక్కుతూ, ఎన్నో 'అయ్యో అయ్యో కథలు' రావాలన్న రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి అభిలాషను నేటి యువ రచయితలు గుర్తించి రచనలు చేయాలని అనాల్సి, ఈ సందర్భంలో.

శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావు

## నృసింహక్షేత్ర మహాత్మ్యాలు

[కోరుకొండ సర్వస్వ సంగ్రహము (శ్రీ లక్ష్మీనృసింహ క్షేత్రము) రచన : శ్రీ గుండు విఘ్నేశ్వర శాస్త్రి, భక్తిప్రబోధ మండలి, అనపర్తి, తూర్పుగోదావరి జిల్లా, 95 పుటలు మూల్యము రు 5. ]

శ్రీ విఘ్నేశ్వర శాస్త్రిగారు కోరుకొండ క్షేత్రమునకు సంబంధించిన సర్వవిషయములను సంగ్రహపరచి దీనికి సర్వస్వ సంగ్రహమని పేరుపెట్టిరి. ఇందు కోరుకొండ క్షేత్రచరిత పరాశర, ద్వాపర, అజ్ఞాత, కాకతీయ, రెడ్డి, గజపతి, సుల్తాను, మందపాటి, పెద్దాపుర, కొచ్చెర్లకోట, బ్రిటీష్ యుగములుగా విభజింపబడినది. ఈ భాగము తరువాత స్వామివారి ఉత్సవములు ధర్మకర్తల యేలుబడి, తదితర విషయములు ఉటంకింపబడినవి. చిత్రపటములున్నవి. తిరుమల తిరుపతి దేవస్థానముల ఆర్థికసహాయముతోనే గ్రంథము ముద్రింపబడినది. వీరుకాక వదాన్యులు మరికొంతమందిగలరు. ఆచార్య దామెర్ల వెంకటరావుగారి ఆశీస్సులు శ్రీ పదునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారి అభినందనము గ్రంథముఖమున శ్రీ లక్ష్మీనృసింహ వర్ణచిత్రముతో పొందుపరచబడినవి.

గ్రంథము చివర రెండు పుటలలో గ్రంథకర్త పరిశీలించిన గ్రంథముల జాబితా యొసంగబడినది.

రాజమహేంద్రవరమునకు 20 కి. మీ. దూరమున నున్న కోరుకొండ క్షేత్రమునకు రాజమండ్రి నుండి ప్రతి 30 నిముషములకు బస్సుసౌకర్యము కలదు. లక్ష్మీనృసింహాలయము కొండపై నున్నది. స్వామి దర్శనమునకు 600 చిన్నమెట్లు నధిరోహింపవలెను. మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నంగారు 1903లో కుమారనృసింహము పేర కొక్కొండ మహాత్మ్యమును పెద్దిభట్ల యజ్ఞనగారి ప్రేరణ వల్ల సత్యవోలు గున్నేశ్వరరావుగారి ధనసహాయముతో ఎనిమిదవ ఎడ్వర్డు పట్టాభిషేక దినోత్సవము (31-12-1902) నాడు ఏలూరులోని సత్తిరాజు సీతారామయ్య గారి దేశోపకారి ప్రెస్‌లో ముద్రితమయినది. ఇందు స్థానికవిషయము లెన్నియో గ్రంథస్థమయినవి. తరువాత 1915లో రాజమహేంద్రవరము ఆంధ్రసారస్వత సమాజము వారిచే వి. ఆర్. జగపతివర్మ సంపాదకత్వమున కోరుకొండ కైప్రేయత్ ముద్రించబడినది.

ప్రస్తుత శాస్త్రిగారి గ్రంథమున ఈ రెండు గ్రంథముల నామస్మరణము దక్క పరిశీలిత గ్రంథపట్టిక యందు వీటి పేర్లు లేవు. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు వేదాద్రి మహాత్మ్యమును రచించిరి.

కోరుకొండ ఆలయమును సాత్వికవాసన గలిగినటువంటిది, సత్యభాషలుగలిగినటువంటిది, గుణరత్నములచేత నలంకరింపబడినది ప్రసన్నమైన హృదయముకలిగిన దాళిలక్ష్మి యనుపేరుగల విష్ణుభక్తునకు శ్రీ నృసింహస్వామి స్వప్నమున సాక్షాత్కరించి పంచశరశైలమందు తానవతరించితినని చెప్పెను. వెంటనే యామె మిమ్మిడి

నాయకుని స్వప్నవృత్తాంతము విన్నవించెను. తరువాత దాశిలక్షి ద్రవ్యమార్జించి కోరుకొండ యందు వెదుకగా లక్షీయుక్తంగా ఒక నరసింహమూర్తి వేంచేసి యున్నటువంటి శిలా సెజ్జ మూపు జానలు పొడుగు గలిగినది ఆమెకు అగపడెను. విజయసంవత్సర ఫాల్గుణశుద్ధ దశమినాడు శాస్త్రోక్తముగా ప్రతిష్ఠ చేయించినది. ముమ్మిడినాయకుడు రెండూళ్లిచ్చెను. కోవెల విమానము గోడ పొడుగున కట్టిన నల్లరాళ్ళమీద రామ రావణయుద్ధము, భారత యుద్ధము కొంత, దశావతారములు, అష్టదిక్పాలక రూపముల చిత్ర ప్రతిమలు చేయించి కొండపైకిమెట్లు లక్ష్మీకట్టించినదని కైఫియతు చెప్పుచున్నది. ఆలయంపైన చక్రము ముమ్మిడి నాయకుడు చేయించినారు. ఈ ముమ్మిడి నాయకుడు కావయ నాయకుని మేనకోడలిని వివాహమాడినాడు. క్రీ. శ. 1358 లో నున్నటీతని శాశనముచెప్పు చున్నది.

కోరుకొండ సర్వస్వము కోరుకొండంతయున్నదని దానికిది సంగ్రహమని గ్రంథకర్తలు సెలవిచ్చినారు. ఆ మాతృగ్రంథము ననైనను శాసనములు, కోరుకొండ కైఫీయతు, ఇతరకైఫీయతులలోని భాగములు అనుబంధముగానిచ్చి గ్రంథమునకు ప్రామాణికత కల్పింతురు గాక!

## మహాక్షేత్రము మామిళ్లపల్లి

[రచయిత శ్రీ కపిలవాయి లింగమూర్తి, ప్రచురణ శ్రీలక్ష్మీ నృసింహస్వామి దేవస్థానం ట్రస్టుబోర్డు, దేవస్థానం అభివృద్ధి మండలి, మామిళ్లపల్లి, అచ్చంపేట తాలూకా, వయా తెల్కపల్లి మహబూబ్‌నగర్ జిల్లా, పిన్. 509385. పుటలు 60. వెల రు 6 లు.]

ఆంధ్రప్రదేశ్‌లో మూడు ప్రాంతముల యందును నృసింహాలయములు పెక్కులున్నవి. ఇవి యన్నియు కొండలపైననో గుట్టబండలమధ్యనో వెలసినవియే. రాయలసీమలోని అహోబలము తెలంగాణమున యాదగిరి, కోస్తాప్రాంతమందలి సింహాచలము ప్రజలు పేరులుపెట్టుకొను పుణ్యక్షేత్రములు నృసింహావతారావిర్భావము హిరణ్యకశిపుని ప్రాసాదస్తంభాంతరము నుంచి వెలువడగా నారసింహక్షేత్రములు ఎత్తైన ప్రదేశముల యందవతరించుటకు కారణమారయ పరిశోధకులాలోచింప వలసిన విషయము. భయానక బీభత్సరూపమైన నృసింహమూర్తి ప్రజలకు దూరముగా నుండవలయుననియో, సింహము గిరిగహ్వరావాసము గనుకనియో యెద్దియో రహస్యమిందున్నది.

మహబూబునగర్ జిల్లా, అచ్చంపేట తాలూకా, మామిళ్లపల్లి క్రీ. శ. 1107 నుండి శాసనములందు చూతపోష, చూతఘోష పురము అనెడి సంజ్ఞలో వ్యవహారమందుండెనని గ్రంథకర్త శ్రీ కపిలవాయి లింగమూర్తిగారు తెల్పియున్నారు.

ఈ గ్రంథమున చరిత్రతోబాటు నృసింహావతార విశిష్టత, నృసింహోపాసన విధానము, నృసింహమూర్తి భేదములతో అనేక విషయములు చర్చింపబడినవి. యాత్రికులకుపయోగార్థము ప్రస్తుత పరిస్థితులిందు పొందుపరచబడియున్నవి. అన్నింటికంటె ముఖ్యముగా గ్రంథాంతమున శాసనపాఠము లివ్వబడినవి.

ఇట్టి అమూల్య గ్రంథమును ముద్రింప దొరకొనిన ధర్మకర్తలనేగాక, క్షేత్రమహాత్మ్యమును పరమ ప్రామాణికముగా దిద్ది తీర్చిన పరిశోధన ధురంధరులు శ్రీ లింగమూర్తిగారిని అభినందింపక తప్పదు. ఇతర ప్రాంతముల రిట్టి గ్రంథములను పఠించి ప్రాంతీయావగాహన పెంపొందించు కొనెదరుగాక!

శ్రీ నిడుదవోలు వెంకటరావు

## "ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ: సాంప్రదాయక రీతి"

[పరిశోధనా గ్రంథము. రచన: డాక్టర్ కోవెల సంపత్కుమారాచార్య. పుటలు: xx+343. వెల: రు. 40/- ప్రతులకు: బాలా బుక్ డిపో, స్టేషన్ రోడ్, వరంగల్. ఆంధ్ర సారస్వత పరిషత్, తిలక్ రోడ్, హైదరాబాదు-1. శ్రీ కె. అరవిందబాబు, 15/29/1 - రామన్నపేట - వరంగల్]

డాక్టర్ కోవెల సంపత్కుమారాచార్యగారు 1978లో కాకతీయ విశ్వవిద్యాలయమునుండి డాక్టరేట్ పట్టంకొరకు సమర్పించిన సిద్ధాంత వ్యాసమే యీ గ్రంథం.

ఆచార్యులుగారు సంప్రదాయపట్ల అత్యంత శ్రద్ధాసక్తులతో తెలుగులో సాగిన సాహిత్య విమర్శలో వ్యక్తమగు సాంప్రదాయక రీతిని ప్రధానంగా పరిశీలించారు. సాహిత్య రంగములో విమర్శ సంప్రదాయమనగా, సాహిత్యమును వివేచించుటలోను, పర్యాలో

చించుటలోను, ఈ దేశమున ప్రాచీనకాలమునుండి అవిచ్ఛిన్నంగా శిష్ట సహృదయ పరంపరావ తీర్ణమై సాగివస్తున్న విధానమని ఆచార్యులవారు పేర్కొన్నారు. పరంపరానుగత విషయములను పర్యాలోచించి మాత్రమే స్వీకరింపవలెను. విమర్శ ఆధునికమైనా, సాంప్రదాయికమైనా సహృదయుని జ్ఞానమును మరింత పెంపొంది చుకట్లుండవలెనని తన ప్రిన్సిపల్స్ ఆఫ్ లిటరరి క్రిటిసిజమ్‌లో పేర్కొన్నాడు. మంచి సంప్రదాయ పరంపర ఎక్కడున్నా నిల బెట్టుకోవటం విమర్శయొక్క కర్తవ్యాలలో ఒకటనీ, ఏ రచనగాని దానికదే ప్రత్యేకం కాకుండా గతకాలపు కవుల కృతులతో తుల నాత్మకంగా వివేచించడం అవసరమంటాడు. టి. ఎస్. ఎలియట్ తన సేక్రెడ్ వుడ్‌లో.

తెలుగులో సాహిత్య విమర్శ ఒక ప్రక్రియగా కందుకూరి వీరేశలింగం గారితో రూపు దిద్దుకొని, పి. దక్షిణామూర్తి (1982) గారి ద్వారా ఆధునిక లక్షణాలను సంతరించుకొన్నదని ఆచార్యుల వారి అభిప్రాయం. వీరేశలింగంగారు కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు రచించిన "విగ్రహ తంత్రము"పై, తమ "వివేక వర్ధని" లో "గుణాగుణ ప్రదర్శినీ సామాజికుడు'' అన్న పేరుతో రచించిన విగ్రహ తంత్ర విమర్శనము (1875) సాహిత్య విమర్శగా తెలుగు సాహిత్యరంగంలో అవతరించింది. కొక్కొండ వారి రచనలోని భాషా లోపాలు, అపశబ్దాలు, అస్వారస్య ప్రయో గాలు, గీర్వాణ భాషానభిజ్ఞత, సందర్భశుద్ధి రాహిత్యం, అప్రౌఢి, వచన రచనారీతిలోని అత్యంత ప్రాథమికత మొదలగు దోషాలను విపులంగా నిరూపించే లక్ష్యంతో పంతులుగారు తమ విమర్శన సాగించారు.

కావ్యాంత రంగపై దృష్టిని సారించి విమర్శకు పూను కొన్నవారిలో పి. దక్షిణామూర్తిగారు ఆద్యులు. వారు తమ "పింగళి సూరన''లో సూరన జీవిత పరిచయంతోపాటు, సూరన కృతులలోని కవితాశక్తి, భావనాశక్తి, రసాను గుణ్యత మొదలగు కావ్యాంత రంగాంశాలను వివరించారు. వెన్నేటి రామచంద్రరావు గారు తమ "మను-వసు చరిత్ర రచన-విమర్శనము"తో ఆధునిక సాహిత్య విమర్శనకు శ్రీ కారం చుట్టారు. రావుగారు సంప్రదాయా వగాహనతోపాటు పాశ్చాత్య విమర్శనా రీతులను మేళవించి తుల నాత్మక పరిశీలనారీతికి మార్గదర్శకులైనారు. ఆధునిక ప్రక్రియా విశేషమగు నవలపై కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారు వివేక చంద్రికా విమర్శనము సాగించి సాహిత్య విమర్శను ఆధునికంగా మరింత విస్తృతం చేశారు. శాస్త్రిగారు తమ విమర్శను ఏడు భాగ ములుగా విభజించారు. 1. కథామూలము 2. ఇతివృత్తము 3. పాత్రములు 4. రసము 5. వర్ణనలు 6. అలంకారములు 7. నీతులు-ఆచార వ్యవహారాలు. విమర్శకుల దృష్టిని ఇతివృత్త నిర్వహణముపైకి మరలించిన తొలి విమర్శకులు బ్రహ్మయ్య శాస్త్రిగారు.

కట్టమంచి రామలింగారెడ్డి కవిత్వ తత్త్వ విచారము, తెలుగు సాహిత్య విమర్శలో ఆద్యగ్రంథమనీ, రెడ్డిగారు ఆద్యులనీ పలు వురి అభిప్రాయం. కవిత్వ తత్త్వ విచారము పాశ్చాత్య సాహిత్య విమర్శనా సంప్రదాయ రీతి ననుసరించి వ్రాయబడినది. కాని సంప్రదాయ పరిణతులైన వేదం వెంకట రామశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి, దళ్ళెపల్లి అనంత కృష్ణశర్మగార్లతో రెడ్డి గారికున్న సన్నిహిత సంబంధము వారిని భారతీయ సంస్కారానికి దూరంగా వుంచలేకపోయింది. రెడ్డిగారు ప్రధానంగా భావనాశక్తి కథా సంగ్రాత, అంగాంగముల కలయిక కథయందైక్యము, నాటక సరణి, పాత్ర చిత్రణ మొదలగు అంశములను గూర్చి చర్చించి సిద్ధాంత రీతుల వెలయించినారేతప్ప కావ్యమున రసమునకున్న స్థానము, రస స్వరూపము. కావ్య గత వివిధాంశములున్న అంశములను విచారించలేదన్నారు ఆచార్యగారు. తిక్కనగారి "నానా రసాభ్యుదయ"మన్న పదబంధము రెడ్డిగారివద్ద 'నానా భావాభ్యుదయం'గా మారిందటూ రెడ్డిగారు ప్రధానంగా భావ పర మైన దృష్టి కథా పరమైన బద్ధిగావారన్నారు.

రాళ్ళపల్లి వారు కావ్యకళా దృక్పథంతో విమర్శను వెలయిం చారు. భావకళ వస్తుకళ రచనా కళ అనే వింగ దింపుతో, వివేచ నకు సంప్రదాయ గౌరవమును సంపాదించినారు రాళ్ళపల్లివారని ఆచార్యుల అభిప్రాయం.

రస-రమణీయకములు అన్న అధ్యాయంలో, దువ్వూరి రామి రెడ్డిగారు తొలినాళ్ళలో కట్టమంచివారి విమర్శనా రీతిని అనుసరించి నార , కాలక్రమంలో రాళ్ళపల్లివారివైపు మొగ్గినట్లు తెలిపినారు. రీతి, వక్రోక్తి మొదలగునవి కావ్యాత్మత్వమునందజాలవని నిరా కరిస్తూ రసము కేవలము మానవ చర్యలకే సంబంధించిన యెడల అవ్యాప్తి దోష కారణముగా కావ్యాత్మకానేరదని రామిరెడ్డిగారు

వివరించారు. రమణీయక ముండేది ప్రీతి స్థలమందలి అహ్లాదమును రసముగా భావించినందున రమణీయకమందు రసముండునని చెప్పుట సమంజసమని రామిరెడ్డిగారి అభిప్రాయం.

'సమన్వయ దృక్పథము' అన్న అధ్యాయంలో, సాహిత్య విషయమున ప్రాక్ పశ్చిమ దేశవాసులకు విరోధభావము తగదనీ, పద్ధతులు వేరైనా రెండింటి పరమార్థము రస ప్రతిపాదనమేనని బసవరాజు అప్పారావుగారు తమ అంధ్రకవిత్వచరిత్ర" ద్వారా నిరూపించారన్నారు ఆచార్యులుగారు. సాహిత్య సృజనలో తాత్విక ఆధ్యాత్మిక బలమును ప్రధానంగా ఆకాంక్షించినవారు బసవరాజు అప్పారావుగారు. వారి తర్వాత విశ్వనాథ సత్యనారాయణగారు వెలయించిన సాహిత్య విమర్శలో' కావ్యానందమంతయు నీప్రీతి పదికపై సాగినదేనని సంపత్కుమారాచార్యుల అభిప్రాయం.

కట్టమంచివారి, కవిత్వ తత్త్వవిచారము తర్వాత పదునాల్గేళ్ళకు, అక్కిరాజు ఉమాకాంతంగారి 'నేటి కాలపు కవిత్వము' వెలువడింది.

ఉభయుల ఆలోచనా సరళిలో సామ్య మెక్కువగానున్న దన్నారు. రామలింగారెడ్డిగారు పాశ్చాత్య ధ్వయనంపట్లను. అక్కిరాజుగారు భారతీయా ధ్వయనం పట్లను మొగ్గు చూపుటయే ప్రధానమైన వైషమ్యమని ఆచార్యులవారి అభిప్రాయం.

'నిర్మాణ శిల్పము' అన్న అధ్యాయములో పాశ్చాత్య విమర్శనా మార్గమున ఇతివృత్తము కావ్యమున కాత్మీయ స్థానము కానీ భారతీయ విమర్శనా మార్గమున రసము ఆత్మస్థానీయమన్నారు ఆచార్యులవారు.

'రమ్యాలోకము' అన్న అధ్యాయంలో రాయప్రోలువారి రచనా రమ్యతను పరామర్శించినారు. రాయప్రోలువారు ఉచ్చారణమునందు లాలిత్యమును, శ్రవణమునందు సుఖమును వర్ణ సమ్మేళన విషయమున లక్షించినారన్నారు. మృదుత్వమనునది శ్రవణ సుఖమునకు, సరళత్వమనునది ఉచ్చారణ సుఖమునకు సంబంధించినది. కావుననే అయన మృదుల సరళాక్షరముల సమ్మేళనమన్నారు. రాయప్రోలు వారి 'అమలిన శృంగారము'ను పరామర్శించినారు.

'కావ్య పరమార్థము' అన్న అధ్యాయంలో శిల్పమును గురించి విశ్లేషిస్తూ 'కవితాను గాఢముగా భావించి అను శీలనము చేసి పొందిన అనుభవమును రచన ద్వారా పాఠకునకు కల్గించి, అతనిచే అను శీలనము చేయించి తద్వారా ఉత్పథములందు, ఉదాత్త రీతులందు సంచరింప జేయునట్టి కవి పరమైన వ్యాపార విశేషము శిల్పము' అని పేర్కొన్నారు ఆచార్యులు.

సంపత్కుమారాచార్యులుగారు విశ్వనాథవారిపట్ల, వారి విమర్శనా రీతులపట్ల గల సద్భావముతో, భారతీయ సాహిత్య దార్శనిక పరివేషములో సత్యనారాయణగారు కావ్య మౌలిక హేతువుగా ప్రతిపాదించిన 'జీవుని వేదన' సాహిత్య విమర్శనా పథములో వినూత్నమూ, విశిష్టమూ అన్నారు.

"సంవిధాన- సామాజిక దృక్పథము" అన్న అధ్యాయములో నాచన సోమనాథుని సంవిధాన రీతిని, శ్రీ శ్రీ గారు నిర్వచించిన సంవిధాన రీతిని విపులంగా తెలిపినారు. శ్రీశ్రీగారు వెలయించిన సాహిత్య విమర్శలో నిష్పన్నమైన సంవిధాన సామాజిక దృక్పథమునందు మొదటి యంశము రసానంద పరమకాగా, రెండవ యంశము స్వీకరించదగిన వస్తువుకు సంబంధించినది. ఈ ఉభయ పరిశీలనము గల సాహిత్య విమర్శనమే సమగ్రమైనదన్నారు సంపత్కుమారాచార్యగారు.

చివరి అధ్యాయములో అత్యాధునిక తెలుగు సాహిత్య విమర్శ, గణనీయమైన విస్తృతిని సంపాదించుకొన్నదన్నారు. శాస్త్ర విషయపరత, శాస్త్రప్రమాణపరత, మనస్తత్వ శాస్త్ర భూమిక, మార్క్సు వాదము, సాహిత్యవిమర్శ అన్న శీర్షికలో ఆధునిక సాహిత్య విమర్శనా రీతులను విపులీకరించినారు.

సంప్రదాయమును గురించి వ్రాస్తూ నూతనత్వము సంప్రదాయమునకు భిన్నముకాదనీ, వ్యతిరేకముకూడా కాదని, నిత్య నూతనత్వముతో వికాసము చెందుటయే సంప్రదాయము యొక్క విశేషలక్షణమని పేర్కొన్నారు. మంచి సాహిత్యమునకు వలె మంచి సాహిత్య విమర్శకు సంప్రదాయమే మూలమని, కాలము గడిచిన కొలది సంప్రదాయం యొక్క వైశిష్ట్యము, దాని అవశ్యకత నిరూపితమగు చుండునని ఆచార్యులవారి అభిప్రాయం.

అనుబంధములో మూడు లేఖలను పొందుపరచినారు. మొదటి లేఖలో శ్రీ వి. రంగావారిగారు 1913లో అనగా కట్టమంచి వారి రచనకంటే ముందుగానే పింగళి సూరనపై వ్యాసము ప్రచురించినట్లు తెల్పినారు.

మరి రెండు బసవరాజు అప్పారావు, రాయప్రోలు సుబ్బారావుగారి లేఖలు.

సంపత్కుమారాచార్యులవారు ఎంతో పరిశ్రమించి, సంప్రదాయంపట్ల శ్రద్ధతో యీ విమర్శనా గ్రంథమును రచించినారు. పాశ్చాత్య, భారతీయ విమర్శనా రీతులను చక్కగా విశ్లేషించినారు. రచనాశైలి మరింత సరళంగా వుండిన బాగుండేది.

## కన్నడ సాహిత్య సౌరభం

[రచన : శ్రీ గడియారం రామకృష్ణశర్మ. వెల : రు. 2/- ప్రతులకు : యువ భారతి, కింగ్స్ వే, సికిందరాబాదు - 3 లేదా యువ భారతి కార్యాలయం, ఆంధ్ర సారస్వత పరిషత్, హైదరాబాద్ - 1]

తెలుగు కన్నడ భాషా సాహిత్యాలలో తల స్పర్శి పాండిత్యంగల గడియారం రామకృష్ణశర్మగారు రచించిన పుస్తకమిది.

కన్నడ సాహిత్యంలోని చంపువులు, వచనములు, షట్పది, త్రిపది కావ్యాలు, దాస సాహిత్యము శతకము మున్నగు ప్రక్రియలలోని రసబంధురమైన పద్యాలను ఎన్నుకొని తెలుగులో వాటిని వివరించిన తీరు ఎంతో హృద్యంగా వుంది. కన్నడిగుల ఆది కవియైన పంపకవి రచించిన విక్రమార్జున విజయంలోని ఛాయలు నన్నయ భారతములో కనిపించును. రన్నకవి రచించిన గదాయుద్ధంతో భీముని అవక్ర విక్రమమును ద్రౌపది ఆత్మ గౌరవమును నిరూపించు కొన్ని పద్యములకు వాటి వ్యాఖ్యానము రచించినారు శర్మగారు. బసవేశ్వరుడు ధార్మిక మహావిప్లవ వుద్యమమును నిర్వహించిన మహాపురుషుడు. అతని అనుచరులైన శివశరణులు జన సామాన్యమునకు అర్థమగురీతిలో మూఢాచారములను నిరసించి భక్తిని ప్రచారమొనర్చిరి. దేవలోకము, మానవలోకము అనునవి వేరుగాలేవని, సత్యము చెప్పుట దేవలోకము, అసత్యమాడుట మానవలోకము. ఈ రీతిగ వచనములు సుబోధకములు. అక్కమహాదేవి వచనములలోని సొగసులను అందజేసినారు. తెలుగువారికి వేమనవలె కన్నడిగుల కత్యంత ప్రీతి పాత్రుడు సర్వజ్ఞుడు. అనల్పమైన భావములను త్రిపదిచ్ఛందములో చెప్పించిన ప్రవ్రజాకవి సర్వజ్ఞుడు.

భక్తాగ్రేసరులైన పురందరదాసు, కనకదాసు మొదలగువారు రచించిన కీర్తనల కొన్నిటి నెన్నుకొని వాటి పరమార్థమును సులలితంగా వ్యాఖ్యానించారు. కొండంత సాహిత్యాన్ని చిన్న దర్పణంలో ప్రతిబింబింపచేసి తెలుగువారికి కన్నడ సాహిత్యామృతాన్ని పంచి పెట్టినవారు శర్మగారు.

కన్నడ జనప్రియ మహాకవి కుమారవ్యాసుని భారతములోని రసగుళికలవంటి పద్యముల నెన్నుకొని వాటి సౌరభాన్ని తెలుగు వారికి పంచిపెట్టారు.

మచ్చుకొక పద్యం :

కళచి దుర్యోధనన బెళగొడె
నెలకె బీళ్వందదం కౌరవ
కులద నిఖిళైశ్వర్య విశెగోర్గడిసి కెడెవంతె
ధళ ధళిప నగెమొగద బిగుహె
కృళిద హుబ్బిన బిట్టకంగళ
హొళెవ హలుగళ కర్ణశిరకెడెదుదు ధరిత్రియలి

**శర్మగారి వివరణ :**

దుర్యోధనుని శ్వేతచ్ఛత్రము ఊడిపడినట్లు, కౌరవకుల సకలైశ్వర్యము మొత్తముగా నేలగూలినట్లు, స్వచ్ఛ హాసముతో మిగుల బిగువైన కనుబొమలతో తెరచిన కనులతో విచ్చిన దంత పంక్తితో ప్రకాశించు కర్ణుని శిరము నేలరాలెను.

మరణ సమయములో మహాయోగివలె నిశ్చల మనస్కుడై కర్ణుడు మరణించినట్లు తెలుపుటకై కవి కర్ణశిరమును ఆ విధముగా వర్ణించెను. కర్ణ మరణముతో దుర్యోధన రాజ్యలక్ష్మి కౌరవుల సమస్త వైభవములు నాశనమయ్యెనని సూచింపబడినది.

సాహిత్య ప్రియులందరూ చదువదగిన పుస్తకమిది. పొరుగు భాషయగు కన్నడ సాహిత్య మందలి సౌరభాన్ని అందజేసిన యువభారతి సంస్థ కృషి అభినందనీయము.

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

## కవితా కాళింది

[గన్ను కృష్ణమూర్తి, ఎం. కాం. వెల : రు. 5-00 లు ప్రతులకు : రచయిత, జూనియర్ లెక్చరర్, హెచ్. నెం. 10-3-307/31, పోస్టాఫీసు ప్రక్కన, శివాజీనగర్, నిజామాబాద్.]

గన్ను కృష్ణమూర్తిగారు పనిగట్టుకొని కాకుండా వివిధ సమయాల్లో కలిగిన అనుభూతులకు ఈ సంకలనంగా అక్షరాకృతి నిచ్చారు. భావపరంగా కృష్ణమూర్తిగారు ఏ ఒక్కదానికి కట్టుబడిన వారు కారని ఈ సంకలనం, వారి ముందు మాటలు స్పష్టం చేస్తున్నాయి. కవిత్వం ఎంత సరసమైనా, ఎంత సుందరమైనా సమకాలీన సమాజ స్పృహ కృష్ణమూర్తి గారిని వదలలేదు. కనుకనే-

ఈ బడుగు వర్గాల శరీరాల్ని రాళ్లగా
ఎముకల్ని ఇటుకలుగా
రక్తాన్ని రంగుగా
బ్రతుకుల్ని పునాదులుగా
తమ జీవన సౌధాన్ని నిర్మించుకుంటున్నాయి
ధనికవర్గాలు పనికవర్గాలు" అని అనగలుగుతున్నారు కవిగారు.

కృష్ణమూర్తిగారు మంచి భావుకత కలిగిన కవి. చెప్పదలుచుకున్న విషయాన్ని చమత్కారంగానూ, శక్తిమంతంగానూ చెప్పగలరు. ఆ చమత్కారంలో సభ్య సమాజంపై వెక్కిరింతకూడా ఉంటుంది. తనకు గల అసహనం ఉంటుంది. పాఠకుల్లో ఔరా! అనిపించేటంత ఆశ్చర్యం ఉంటుంది.

'శిబి చక్రవర్తి
ఒక్కరికే ఒక్కసారే
తన శరీరాన్ని కోసిచ్చాడు
మల్లోకాల్లోనూ కీర్తింపబడ్డాడు.
కానీ,
వేశ్య తన అంగాంగాన్నీ
లోకానికి సమర్పిస్తోంది
కులసతుల పరువు నిలుపుతోంది
తూట్లుపడ్డ మనసుతో జీవిస్తోంది
అయినా ఆమెను లోకం దుమ్మెత్తి పోస్తోంది"

ఇలాంటి గేయాలు ఈ సంకలనంలో చాలా ఉన్నాయి. మినీ కవిత రాయడంలో కూడా కృష్ణమూర్తిగారికి ఒక ప్రత్యేకత ఉన్నది. రాబోయే కాలంలో వారేమిటో వారు తెలుసుకొని ఇంకా ఉత్తమ కవిత్వం రాస్తారని ఆశ.

# శ్రీశ్రీ మరో ప్రస్థానం

[శ్రీశ్రీ. వెల : రు 5-00 లు. ప్రతులకు : సి.ఎస్.ఆర్. ప్రసాద్, సి-108, శ్రీనివాసనగర్ కాలనీ, గుంటూరు - 522006 (2) సృజన, హనుమకొండ - 506001]

ఎంతటి కవి కూడా ఒకసారి తానురాసిన కావ్యాన్ని తిరిగి మళ్ళీరాయలేడు. మహాప్రస్థానం అనంతరం శ్రీశ్రీ కవిత్వాహ్నంగా ఇకలేడు అని భావించేవారు లెక్కకుమించి ఉన్నారు. ఇట్లాభావించేవారిలో చాలామంది అంతరాంతరాల్లో మహాప్రస్థానాన్ని కూడా ఉత్తమ కావ్యంగా అంగీకరించరు. యుగధర్మాన్ని బాహాటంగా ధిక్కరించలేరు. కనుక, మహాప్రస్థానాన్ని మహాకావ్యంగా అంగీకరించక తప్పటంలేదు. కళలన్నింటితో పాటు కవితాకళకూడా కాలపరిధికి లోబడినది కనుక కాలం యొక్క విలువలలో కవిత్వపు విలువలుకూడా మారితీరుతాయి. అన్న యాథార్థ్యాన్ని అంగీకరిస్తే మహాప్రస్థానానికి ఏ విలువ ఇస్తన్నామో మరో ప్రస్థానానికి కూడా అదే విలువను ఇవ్వగలుగుతాం.

ఒకనాడు అప్పుడున్న సామాజిక విలువలమీద తిరుగుబాటును కలిగించే మానసిక స్పృహను పాఠకులలో కలగజెయ్యడమే సాహిత్య పరమావధిగా సంప్రదాయ సాహిత్యంపైన, సంప్రదాయక విశ్వాసాలపైనా అభ్యుదయ కవులు ధ్వజమెత్తారు. ఆ కాలానికి బౌద్ధికమైనస్పృహ మహదాశయంగా భాసించింది. దానిని ఈనాడు దోషమనడానికి అస్కారంలేదు. ఈనాడు స్పృహ చైతన్యంగామారి క్రియాత్మకంగా పరవశించడం కవితాన్యాయంగా భావించబడుతూంది. ఈ మౌలికమైన భేదమే వి. ర. సం. ఆవిర్భావానికి మూలకారణం. వి. ర. సం. దశాబ్దిచరిత్రలో మరువరాని ఘట్టంగా మరోప్రస్థానం ఆవిష్కరించబడింది. బృహత్ ప్రాగ్ద్వారాన్ని తెరచి, సాహిత్య సామాజిక చరిత్రలో మరో అధ్యాయానికి నాంది పలుకుతూ మహత్ కవితాకాంక్షయాన్ని తీర్చుతూ మరో ప్రస్థానాన్ని సాగిస్తున్నాడు శ్రీశ్రీ.

సాహిత్యం - సామాజిక చైతన్య స్ఫూర్తిని మరింత దీప్తిమంతం చెయ్యడానికి ఉపకరించే మహత్తర సాధనం. సమకాలీన సమాజంలో సాహిత్యం తాను నిర్వహించవలసిన చారిత్రిక పాత్రను విస్మరించకూడదు. ఒకవేళ అట్లా విస్మరింపబడినా జనజీవితంలో రావలసిన మార్పు ఆగదు. జట్కావాలా గేయంలో శ్రీ శ్రీ ఈ సత్యాన్ని కావ్యస్తం చేశాడు.

"సికాకుళం యెల్లిపోవాలని
సెప్పవయ్యా సిరి సిరి మువ్వ
ఇప్పుడు సెప్పుమరి
యెల్లమంటావా వొద్దంటావా
నువ్వెల్లమన్నా వొద్దన్నా
నేనెల్లకమానన లే."

అంటాడు జట్కావాలా. ఇక్కడే శ్రామిక వర్గ చైతన్యం యొక్క స్వతంత్రి అస్తిత్వం వెల్లడవుతోంది. అదే గేయంలో శ్రీ శ్రీ అస్తి నాస్తి విచికిత్స జట్కావాలాకు కూడా పట్టటం హర్షణీయం కాదు. 'ఒక సకలాతీత శక్తి ఉన్నట్టా లేనట్టా' అనే ఖడ్గసృష్టి నాటి సదసత్సంశయం.

'అపలాడంటూ ఉన్నాడా
ఉంటే మాత్రం అదెవ్వడు నన్ను రచ్చించడానికి
అప్పుడప్పుడాన్ని తలుసుకుంటానుగాని
అదో పిరికి దనం'

అనే పాదాల్లో పునరాకృతిని పొందింది.

'ఓ మహాత్మా ! ఓ మహర్షీ' 'తుది పయనం తొలివిజయం అనే రెండు ఖండికలలోనూ శ్రీ శ్రీ ఆలోచనా విధానంలో వచ్చిన పరిణామం స్పష్టంగా కనబడుతుంది. ఓ మహాత్మా ! ఓ మహర్షి ! గాంధీపై రాసిన గేయం. ఆయన సిద్ధాంతం దేశాన్ని నిర్వీర్యం చేసిందని, ఆ సిద్ధాంతానికి కాలం చెల్లిందని ఈ గేయంలో చెబుతూ ఈ సామాజిక అవ్యవస్థకు పరిష్కారంకూడా ధ్వనింప చెయ్యడం ఈ ఖండిక ప్రత్యేకత. ఏ మహదాశయంలో స్వాతంత్ర్య సిద్ధి అనంతరంకూడా ఆశయంగానే మిగలటం కాక దోపిడీ శక్తుల విజృంభణ, శ్రమ జీవుల దైన్యస్థితి పెరిగి పోవడం గాంధీజీ తెర మరుగున పడటానికి మూలకారణాలయ్యాయి.

'సర్వమానవ సమానత్వం
సరే అది నీ మూలతత్వం
అమానుష పైశాచకత్వం
అదే ఎదురౌతున్న సత్యం'

అని ఈనాటి వాస్తవ స్థితిని వెల్లడించాడు. హింసను హింసతోనే అణచాలనే సైద్ధాంతిక దృక్పథానికి శ్రీ శ్రీ రావడం ఈ గేయంలో కనబడుతుంది.

'కలదు సుమా ! ఓ కర్మచందా
గతి వితర్కం అనే పంథా
చర్యపై ప్రతి చర్యరాదా
హింసకాక ప్రతి హింసలేదా'
'నీవు చూపిస్తున్న దాట
యథాస్థితి కాక కంచుకోట
హింసతోనే సృష్టిపూస్తది
హింసతోనే మార్పు వస్తది'

ఒకనాటి సామాజిక స్పృహ ఈనాడు చైతన్యమై క్రియాత్మకంగా పర్యవసిస్తుందని, బలహీనులు అట్టేకాలం దానిసత్వాన్ని భరించరని కంఠోక్తిగా చెబుతున్నాడు.

'నెత్తురు కార్చిన కళ్ళు నిప్పులు చెరుగుతాయి
వంకర టింకర రాళ్ళే గుళ్ళయి ఎగురుతాయి
శ్రీకాకుళం అడవిలో చీమలు పాముని చంపుతాయి
సింహాద్రి శిఖరంమీద ఎలుకలు పిల్లిని చెండాడుతాయి.'

కవిత్వపరంగా మహా ప్రస్థానంలోని గేయాలు విమాన వేగంతో సమానమైనవైతే మరో ప్రస్థానంలోని వేగాలు కాలి నడకతో సమానమైనవి. మహా ప్రస్థానం శబ్ద ప్రధానమైతే మరో ప్రస్థానం అర్థ ప్రధానమైనది. అంటే అక్కడ అర్థంకాని, ఇక్కడ శబ్దంకాని లేవని చెప్పడం నా అభిప్రాయం కాదు. అలంకారిక శిఖామణుల కొలమానాలకు లొంగనంతమాత్రాన కావ్యం గొప్పతనానికి ఏ మాత్రం కీడువాటిల్లదు. ఈ కావ్యదృక్పథాన్ని ఋంరు గేయంలో శ్రీ శ్రీ నిర్దేశించాడు.

"సంహారాన్ని స్పందనం చేసి
ఉద్రేక తరంగాలే తురంగాలుగా
అగ్రహం కొరడాచే చూని
సాయుధ చీ ఛత్సుని సారథినై
భారత కురుక్షేత్రంలో
నవయుగ భగవద్గీతా ఋంరును ప్రసరిస్తాను
మంటలచేత మాట్లాడించి
రక్తంచేత రాగాలాపన చేయిస్తాను"

కల్లోలనవ్యస్ఫూరీ వి. ర. సం. దశాబ్దంలో మరో ప్రస్థానం ఒక మైలురాయి. 1970 తరువాత తెలుగు కవిత్వం తిరిగిన మలుపులో మరో ప్రస్థానం విస్మరించరాని, విస్మరించలేని చారిత్రిక ఘటన.

## గుండె మండింది, తూర్పు, ఉరుములు

[వెల : రు. 3-00 లు తూర్పు : వెల : రు 0-60 పై ఉరుములు : వెల : రు. 0-50 పై ప్రతులకు : తోట మహదేవన్, ఇం. నెం. 10-3-116 గచ్చుచౌలి, సిరిసెల్ల-505301, కరీంనగర్ జిల్లా.]

గుండె మండింది, తూర్పు కవితా సంకలనాలు తోట మహదేవన్‌గారు రాసినవి. ఉరుములు మినీ కవితా సంకలనం తోట మహదేవన్, బుస్సా బాలచందర్‌గారు కలిసి రాసినది. ఈ సంకలనాల్లో కోపం ప్రదర్శితమైనంతగా కవిత్వం బహిర్గతంకాలేదు. కేవల నినాదం కవిత్వం కాదు. కాదని మార్క్సిస్టు సాహిత్య పండితులు కూడా అంగీకరించారు. అంగీకరించనిది ఆలోచనలేని ఉద్రేక పరులు మాత్రమే. సమాజంపట్ల సరైన అవగాహన ఉన్నవాడు, తను చెప్పదల్చుకున్న భావం కవిత్వ రూపంలో వ్యక్తం చెయ్యదల్చుకున్నవాడు, కవిత్వంపట్లా దాని నిర్మాణం పట్లాకూడా

సక్రమమైన అవగాహనను కలిగి ఉండాలి. కసిని, కోపాన్ని వెలువరించడానికి శుష్కవచనం రాసి అది కవిత్వమనే భ్రమాత్మకస్థితిలో పడిపోకూడదు. కవిత్వానికి మనిషిని ప్రభావితం చేసే మహత్తర శక్తి ఉంది. ఆ శక్తిని గుర్తించి కవితాయుధాన్ని శత్రుసేన మీద ఉపయోగించడం మంచిది.

మొదటి సంకలనంలో కొన్ని నిర్వచనాలిచ్చారు మహదేవన్‌గారు. ఆ నిర్వచనాల్లో అక్కడక్కడ చమత్కారం గోచరిస్తుంది. ఉదాహరణకు మున్సిపాలిటి అంటే– "ఉన్నది ఊడగొట్టి/లేందానికి/ఏడ్చేది" అని. త్రాగుబోతుకు నిర్వచనం ఏమంటే– "సారాతో/జీవితం/మారాకు/తొడుగుతుందని/భ్రమిసేవాడు." ఇట్లాగే ప్రేమ, మతం మొదలైన వాటినికూడా నిర్వచించారు. ప్రజాస్వామ్యమా గుడ్ ప్రోగ్రెస్. కళ్ళుతెరవండి ఒక మోస్తరుగా ఉన్న కవితలు. రెండవ సంకలనంలోని మినీ గేయాల్లో కొన్ని గుండె మండించింది. సంకలనంలోనే. వర్గ పోరాటం దీని ధ్యేయం. మూడవ సంకలనంలో మధురగీతికల కిది కాలంకాదని, ఇది విప్లవ గీతాల సమయమని బుస్సా బాలచందర్ చెబుతున్నారు.

"ఆస్థానాధీశుల
కాళ్ళదగ్గర పడుండి
మ్రోగించకోయ్ మధుర గీతం
వినిపించవోయ్ విప్లవ గీతం"

ఈనాటి బాధ రేపటి విప్లవానికి నాంది అని తోట మహదేవన్‌గారు చెబుతున్నారు.

"నేటి నానెత్తుటి గాయం
రగుల్కొనే రేపటి ఉదయం."

# విస్తరించిన వెన్నెల

[భీమిరెడ్డి నరసింహారెడ్డి. వెల: రు. 7-50 లు. ప్రతులకు: శ్రీమతి బి. లక్ష్మీదేవి, మైలవరం డ్యాం, జమ్మలమడుగు తాలూకా, కడప జిల్లా.]

నరసింహారెడ్డిగారి కవిత్వం చెడిపోతున్న తరానికి బుద్ధి చెప్పడానికై ఉద్దేశించినది. ఆ చెప్పడంలో అలుపు సొలుపూ, ఆ దేశ కాదేశాలుగాని ఏమీలేవు. చాలా సునాయాసంగా చాలా ఫ్లాట్‌గా చెప్పారు. దుష్టులు దోపిడీ చేస్తారని, వారు అట్లా దోపిడీ చెయ్యడం, వారికీ, సమాజానికీ క్షేమంకాదని హితవు చెబుతున్నారు. చిన్ననాటి ముచ్చట్లను మైలవరం శిల్పాలను వెన్నెలను, నేటి విద్యావిధానాన్ని తన కవితేతివృత్తాలుగా గ్రహించారు.

'అందరు కష్టపడితే
అన్నానికేమి కొదువ?
ఒళ్ళు దాచుకుంటే
దొరదు సంపాదన' అన్న రెడ్డిగారే మరల—

"పని చేస్తున్నారు
పగలంతా విసుగులేక
తిన తిండి చాలక
పండుకుంటున్నారు పస్తు–"

అని అంటున్నారు. అయితే ఒక యాథార్థ్యాన్ని మాత్రం గ్రహించారు. అదేమంటే—

'కష్టించే వారికి లేదు సుఖం
మధ్యవర్తులు, కంట్రాక్టర్లు
పెట్టుబడి పెట్టి, పేదల కష్టం
తింటున్నారు పైనుండి"

చరిత్ర కవిత శ్రీ శ్రీ దేశ చరిత్రలకు అనుసరణ. దేశ చరిత్రలు ధ్వని ఈ చరిత్ర ప్రతిధ్వని.

# ఎక్స్‌రే

[ఆధునిక కవితా వేదిక. ఎడిటర్: కొల్లూరి. వెల: రు. 0.2ు పై. ఫర్ కరస్పాండెన్సు: ఎక్సురే, కొల్లూరి హవుస్, అమలాపురం-533202]

ఇదొక సాహిత్య కరపత్రం. దీనిలో మినీ, మాక్సీకవితలు, ఒకవ్యాసం, ఒక సమీక్ష ఉన్నాయి. ఎ. ప్రభాకర్ 'రాజకీయం' అనే కవిత వ్యంగ్యాత్మకమైనది.

"ఒక్క నక్క
ప్రమాణ స్వీకారం చేసిందట
ఇంకెవ్వర్నీ మోసగించనని
ఒక పులి పశ్చాత్తాపం ప్రకటించిందట
తోటి జంతువుల్ని సంహరించనందుకు
ఈ కట్టుకథ విని
గొర్రె లింకా
పుర్రె ఊపుతూనే ఉన్నాయ్''

నక్క, పులి, గొర్రెలువరుసగా అవకాశవాదులకు, రాజకీయ దోపిడీ దార్లకు, పీడితులైన ప్రజలకు ప్రతీకలు.

ఆర్. సత్యనారాయణగారి కవిత–

"గుడిసెలో మానానికి
గుడ్డకరువు
షోకేసులో బొమ్మకు
గుడ్డ బరువు."

చమత్కారంగా ఉంది. ఉద్యమంలోంచే కవులుపుడతారనే అద్దేపల్లి వారి వ్యాసం చర్చకు ఉద్దిష్టమైనది. ''ఈ నెత్తురు చిత్తడి ఇంకెన్నాళ్ళు'' జ్వాలా ముఖి గేయం వర్తమాన వ్యవస్థపై రావలసిన తిరుగుబాటును బోధిస్తుంది.

శ్రీ టి. ఎల్. కాంతారావు

---

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd , by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor; S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 61247.

80



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA104M176 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 8ʃ |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CT BC |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Naung |
| పేజీలు విడదీసినది | Sotoisha |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |